# జీవాత్మ, పరమాత్మ, జగత్తు

## ( జగజ్జీవేశ్వరులు )



రచన : ఆంగ్లము


పరమహంస పరివ్రాజకాచార్యవర్య

జగద్గురు

శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామివారు

శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు. కుర్తాళము






ఓం

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# నమోవాకములు

"చేనేతోద్యమ పితామహ" శ్రీ గుంటక నరసయ్య (పంతులు)

"సతామ్ సద్భి స్సంగః కథ మపి పుణ్యే నభవతి"

అని మహాకవి భవభూతి నుడివినట్లు నా యొక్క పూర్వపుణ్యమువలన మహా సత్పురుషులు శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు, జగత్ గురువులు, పరమహంస పరివ్రాజకాచార్యులు, పూజ్యులు అయిన శ్రీ శ్రీ శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాముల వారితో నాకు పరిచయము సుమారు ఇరువది ఐదు సంవత్సరములకు పూర్వము లభించినది.

నాకు అనారోగ్య మేర్పడిన కారణము చేత దాదాపు ప్రతి సంవత్సరము, కురుతాళ ప్రకృతిధారా స్నానార్థమై అత్యంత మనోహరమైన, ఆహ్లాదకరమైన, మలయ మారుత వాతావరణ ముండే సీజన్‌లో కురుతాళము వెళ్లుట తటస్థించుచున్నది. నే నక్కడ నున్నన్ని దినములు శ్రీవారి సన్నిధిని, శ్రీవారి మఠములో సర్వసౌఖ్యములు గల వసతిలో ఉండుట జరుగుచున్నది.

నాకు గల కించిత్ అధ్యాత్మ జిజ్ఞాసను శ్రీస్వాములవారు గమనించి అవ్యాజకరుణతో సందర్భానుసారము తత్త్వవిశదీకరణ చేయుచుండగ విని, తనిసి నే నెంతో తృప్తి చెందెడివాడను. శ్రీవారి తత్త్వవిశదీకరణ విధానము నన్నెంతగానో ఆకర్షించినది. నన్నేగాదు యత్కించిత్ జిజ్ఞాసగలవారి నందరిని ఆకర్షించును. ఇందుకు పాశ్చాత్య దేశములలో కూడ "పోప్ ఆఫ్ ఇండియా" అని ఎంతో ప్రఖ్యాతి గాంచిన బ్రహ్మీభూతులు శ్రీ శృంగేరి శారదాపీఠాధిపతులు, జగద్గురువులైన శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ స్వాములవారి ప్రియ అంతేవాసియై అనూచానముగ వచ్చే గురు శిష్య సత్ సంప్రదాయములను అలవరచుకొన్న శ్రీ సిద్ధేశ్వరీ పీఠ ప్రథమ పీఠాధిపతులు, బ్రహ్మీభూతులైన శ్రీ శ్రీ శ్రీ విమలానంద భారతీ స్వాములవారియొక్క శుశ్రూషలతో శ్రీవారియొక్క సంసర్గమున దాదాపు త్రిదశాబ్దంబులు ఈ శ్రీ శ్రీ శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారు

గడప్పుటయే ఈవిధమైన తత్త్వ విశదీకరణకు కారణమైయుండును.

అదియునుగాక ఈ శ్రీ స్వాములవారు కూడ స్వయముగా ప్రతిభాశాలురు, విద్యాధికులు ( M. A., LL. B., అడ్వకేటు), జన్మాంతరీయ సంస్కార పరిణత చిత్తముగల మహానుభావులు. శుచిమంతులైన శ్రీమంత కుటుంబమున జన్మించినారు. పసితనముననే తీవ్రతర అధ్యాత్మ జిజ్ఞాసచే సద్గురువులకై అన్వేషణ సాగించినారు. ఇరువదిరెండవ ఏటనే సద్గురు సమాశ్రయము పొందగలిగినారు. ఉన్నతవిద్యాభ్యాసము చేయుచున్నపుడుగాని, లాయరుగా వృత్తి నాశించునపుడుగాని తమ గురువులవారిని వదలివుండలేదుసరిగదా, ఆ సద్గురువులవారిని తమయింటనే నిలుపుకొని సేవా శుశ్రూషలతో నిరంతరము బ్రహ్మానుసంధాన యోగంబున కాలము గడపగలిగినారు. ఇటుల ఒకటి, రెండు కాదుగదా సతతము దాదాపు ముప్పది సంవత్సరములు సాగినవి.

ఇట్టి తపస్సంపన్నులైన శ్రీవారి తత్త్వ విశదీకరణ విధానము అత్యంత సులభము, సుబోధకరము. ఇట్టి విధాన మెవరి నోటను వినలేదు, కనలేదు. ఇది నా పాలిటి కొక మహదవకాశమని భావించెడివాడను; భావించుచున్నాను. ఇట్లు కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట శ్రీవారి పీఠాధిపత్యము వహించిన పంచవింశతి వత్సర రజతోత్సవము జరిగినది. ఆ సందర్భమున ప్రకటించిన రజతోత్సవ సంచికలో "జీవాత్మ-పరమాత్మ-జగత్" అను శీర్షికను శ్రీవారు ఇంగ్లీషులో రచించిన సుదీర్ఘ వ్యాసము ప్రకటించబడినది. శ్రీవారి ముఖతః ఈ వ్యాసముయొక్క సారమును తెలుసుకొని ముగ్ధుడనైతిని, ఆనందపడితిని. ఆత్మవిచారణ అనగా, తన్ను తాను తెలుసుకొను విధానము, యెట్లుండవలెనో తెలుసుకొంటిని.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

అన్న గీతావాక్యములు తూచా శ్రీవారికి అన్వయము కాగలవు. శ్రీవారి బోధనావిధానము, తమ సద్గురువుల వలెనే ప్రశ్నలు, జవాబులతో నిండి యుండును. శ్రీవారు రచించిన ఇంగ్లీషు వ్యాసమును ముముక్షువులందరికి, పండితపామరులకు సుబోధకముగ నుండునట్లు శ్రీవారేగాని లేక ఇతర పండితులుగాని తెలుగులోనికి అనువాదము చేసిన బాగుండునని పదే పదే శ్రీవారికి మనవి చేసుకొనుచుండెడివాడను.

శ్రీవారికి సతీర్థులు, శ్రీ విమలానంద భారతీ స్వాములవారి ప్రియ శిష్యులు, కీర్తిశేషులైన శ్రీ వేమవరపు శేషగిరిరావు పంతులుగారి జామాత శ్రీ పి హనుమత్ జానకీరామశర్మగారు (B. A. (Hons.) Head of the Telugu Department, Venkatagiri Raja's College, Nellore) నాబోటి వారల అభీష్టమును శ్రీ స్వాములవారిద్వారా తెలుసుకొని అత్యుత్సాహముతో, ఓర్పుతో,

శ్రద్ధాభక్తులతో అనతికాలములోనే దీనిని తెలుగులోనికి అనువదించిన ప్రాతప్రతిని పూర్వపుణ్యమువల్ల చూచి పూర్తిగా మొదటినుండి చివరవరకు శ్రద్ధగా చదివితిని. ఈ గ్రంథమున విశదీకరింపబడినంత సులువుగా తత్త్వవిశదీకరణ మరి యే గ్రంథ మందును చూడలేదు. అధ్యాత్మ జిజ్ఞాసువుల కిది కల్పతరు సదృశమైనది. అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లున్నది యిందలి పరమార్థ వివరణ. పారిభాషిక పదజాలాడంబరము లేదు. అధ్యాత్మ పాండిత్య ప్రకర్షము కాదు. భాష జటిలతగాని, అన్వయ కాఠిన్యతగాని లేదు. మాటలగారడి అంతకంటే లేదు. కేవల తత్త్వవిశదీకరణ మాత్రమే లక్షింపబడినది యిందు.

సర్వసామాన్యముగా జిజ్ఞాసువులే గాక పండిత పామరులకు గూడ నాలుగు మాటలతో తత్త్వము తెలుసుకొని, కష్టపడకుండా తరించవలయునని, తాము తరించినట్లు లోకమెరుగవలయునని యుండును. అట్టివారలకు "బ్రహ్మ సత్యం - జగన్మిథ్య" అనే నాలుగు మాటలు సరిపోవును. మంచి సంస్కారముగల, సత్‌శీలముగల, శాస్త్రాచార్యోపదేశముగల జిజ్ఞాసువులు ఈ నాలుగు మాటల యొక్క గూఢార్థమును తెలుసుకొని పట్టుదలతో సాధించి జన్మ మృత్యు పరంపరల నుండి విముక్తిని పొంది తరించెదరు. తదితరులు "జగత్ సత్యం - బ్రహ్మ మిథ్య" అన్న ధోరణిలో కుతర్కములతో జీవితాంతములను గడుపుచునే యుందురు.

శ్రీస్వాములవారు "జీవాత్మ - పరమాత్మ - జగత్"ల సంబంధ బాంధవ్యములను గూర్చి అత్యంత సులభముగా తెలియజేసి చివరకు ఈ తెలిపిన రహస్యాతి రహస్యములను పిల్లలకు, ఇంకా పసిపిల్లలకు, బ్లాకు బోర్డు మీద పటములను గీసి పాఠములలోని క్లిష్ట విషయములను ఆ పటములను చూపించుచూ ప్రతి యొక్క విషయమును వారికి బోధించినట్లుగా, ముందుగా "సత్యం - జ్ఞానం - అనంతం - బ్రహ్మ" అన్న పటమును చూపించి అనగా "బ్రహ్మ సత్యం - జగన్మిథ్య" తత్త్వమును నిరూపించి, తరువాత వరుసగా అజ్ఞానావరణములను పైకి యెత్తి చూపి తుదకు అజ్ఞానమున నున్న తన్ను, ఆ పైన అజ్ఞాన మావరించినటువంటి తన్ను, అనగా అజ్ఞానము వచ్చినట్లుగా కనపడే తన్ను, వీటన్నిటికి మించి "నిత్య శుద్ధ బుద్ధ ముక్త" స్వరూపమే తానని సునిశ్చితముగా నిర్ణయించి చూపుచూ వెండి కమండలము యొక్క ఉదాహరణతో కమండలము యొక్క మిథ్యాత్వమును స్థాపించుటకు తోడు పటములద్వారా కూడ అజాత వాదమును గుర్తుచేయుచు ఈ గ్రంథమును పూర్తిచేయుట చాలా విశేషము.

కర్మ, భక్తి, జ్ఞానములనే ప్రధానముగా పెట్టుకొని ప్రాచీనకవుల పంథాల ననుసరించి బహు గద్య పద్య గ్రంథములు, నాటకములు, చరిత్రలు రచించి, ప్రచురింపజేసి చదువరులను సంతోషపెట్టి, పండిత సభలలో

గౌరవ మర్యాదలు, సన్మానములు, బిరుదులు పొందిన శ్రీ జానకీరామశర్మగారి రచనా నైపుణ్యమును ఈ తెలుగు తర్జుమాలో కూడ చూడనగును.

శ్రీ స్వాములవారు దీనిని రచించి ముముక్షుజన లోకమునకు అపారమైన మేలొనర్చినారు. అధ్యాత్మ జిజ్ఞాసువులైన సోదరు లందరు ఈ గ్రంథమును శ్రద్ధతో పఠించి జన్మసఫలత గాంచగలరని ఆశించుచూ, శ్రీ స్వాములవారికి నా సాష్టాంగ నమో వాకములు అర్పించుచున్నాను.

శాంతినివాసము
పద్మనగరము
హైదరాబాదు
జనవరి, 1981

సుజనవిధేయుడు,
శ్రీవారి అంతేవాసి,
గుంటక నరసయ్య



ఈ గ్రంథమును అనువదించినవారు :

పోలూరి హనుమజ్జానకీరామశర్మ, ( B. A. Hons. )

ప్రాచ్యభాషాశాఖాధ్యక్షుఁడు

వేంకటగిరి రాజ కళాశాల, నెల్లూరు

# సవరణ పట్టిక

| పుట | భాగము | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 5 | 1 | 1 | వానిగ | వానినిగ |
| 5 | 2 | 3 | చాతుర్వర్ణ్వ | చాతుర్వర్ణ్య |
| 5 | 2 | 6 | వినస్వర | వినశ్వర |
| 7 | 1 | 32 | అర్ధ | అర్థ |
| 9 | 1 | 32 | తంత్రమునకు | తంత్రతకు |
| 11 | 2 | 12 | విశ్వాసమునందు | విశ్వమునందు |
| 15 | 2 | 8 | జగదృశ్యము | జగద్దృశ్యము |
| 17 | 1 | 27 | శమదయాది | శమదమాది |
| 17 | 1 | 30 | వెలుఁగుచున్నను | మెలఁగుచున్నను |
| 17 | 2 | 2 | సంచార | సంసార |
| 18 | 1 | 13 | రహిత్వము | రహితత్వము |
| 27 | — | 11 (Heading) | షష్ఠా | షష్ఠ |
| 28 | 1 | 20 | శీలనము | శీలము |
| 28 | 1 | 30 | అనుమతి | అనుమితి |
| 32 | 1 | 24 | సంభంవించు | సంభవించు |
| 34 | 1 | 27 | వినియోగము | వియోగము |
| 45 | 1 | 9 | శరీరమునకు | శరీరము |
| 45 | 2 | 28 | జ్ఞానముచేత | అజ్ఞానముచేత |
| 46 | 2 | 27 | స్తనయ్వో | స్త్వనయో |
| 51 | 2 | 20 | యజ్ఞాత్వా | యద్ జ్ఞాత్వా |
| 55 | 1 | 13 | దేవీ | దైవీ |
| 60 | 1 | 5 | కేవలయు | కేవలము |
| 64 | 1 | 22 | రూఢుఁడై | గూఢుఁడై |
| 70 | 2 | 30 | ధ్యాసారూప | ధ్యాసరూప |
| v | 2 | 28 | " నేను | నేను |
| viii | 1 | 12 | మీ | మీరు |
| viii | 1 | 23 | నీకు | మీకు |
| viii | 1 | 25 | నీవు | మీరు |
| viii | 1 | 26 | వన్న | రన్న |
| viii | 2 | 9 | అస్థి | అస్తి |
| viii | 2 | 20 | అస్థిత్వము | అస్తిత్వము |
| x | 2 | 15 | ఆత్మతో, | ఆత్మతో |
| x | 2 | 15 | నాత్మను | అనాత్మను |
| x | 2 | 17 | ఆవిద్యచే | అవిద్యచే |
| xi | 2 | 7 | జ్ఞానముచేత | అజ్ఞానముచేత |
| xi | 2 | 8 | దృశ్య | అది దృశ్య |

# దేవుడు ఉన్నాడు

శ్రీరస్తు. చిరంజీవి సౌభాగ్యవతి శ్రీమతి పెళ్లకూరు అనసూయమ్మగారిని (దంపతులను) నారాయణస్మరణపూర్వకముగ ఆశీర్వదించి వ్రాయునది.

తమరు అత్యంత భక్తితో వ్రాసిన ఉత్తర మందినది. ఆనందమైనది. తమ రుభయులు లోగడ కుర్తాళము యీ మన పీఠమునకు వచ్చినప్పుడు—

"దేవుడు లేడు అని నాస్తికులు ప్రచారము చేయుచున్నారు. వీరలకు నచ్చునట్లుగాను, తిరుగు లేకుండాను చెప్పి దేవుడు ఉన్నాడు అని ఋజువు ఎట్లా చేయాలి?" అని మీరు అడుగుట, మీకు తృప్తికరముగ జవాబు చెప్పుట జరిగినది. తిరిగి ఉత్తరములో ఆ ప్రశ్ననే అడుగుచున్నారు.

శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥

గీత- అ. 4 శ్లో. 34.

అని చెప్పిన గీతావాక్యము ననుసరించి ప్రశ్నలు వేయుట, జవాబులు చెప్పుట, చెప్పించుట అన్న పద్ధతి ఉత్తమమైనది. అప్పుడు సర్వసందేహములు నివృత్తి కాగలవు.

అయినను అడిగితిరి గనుక వ్రాయుచున్నాను. "దేవుడు ఉన్నాడు" అని నిర్ధారణ చేయుటకు నాస్తికులు చెప్పుచున్న "దేవుడు లేడు" అన్న వాక్యమే ప్రమాణము. ప్రమాణ వాక్యము.

దేవుడు లేనేలేని పక్షములో "దేవుడు లేడు" అని ఎట్లా చెప్ప గలుగు చున్నాడు? ఈ ప్రశ్న అడుగవలెను.

తెలియనటువంటి, లేనేలేనటువంటి వస్తువునుగూర్చి చెప్పుటకుగాని, తెలుసు కొనుటకుగాని వీలగునా? వీలుకాదని స్పష్టముగా చెప్పవలసినదే!

లేనిదానినిగూర్చి చెప్పుచున్నానని చెప్పుట, లేక ఉపన్యసించుట ప్రారంభించి నచో "అది ఉన్నది", "చెప్పబడినది" లేక "తెలియబడినది" కాగలదుకదా?

అనగా ఉన్నదానిని గురించి మొండిగా, విమర్శజ్ఞాన శూన్యముగా "లేదని" చెప్పుటయే లేక చెప్పుటకే తప్ప ఉన్నది - లేనిది ఎట్లు కాగలదు? లేనిది - ఉన్నది ఎట్లు అవగలదు?

ఒక చిన్న (గమ్మత్తు, నవ్వువచ్చే) ఉదాహరణ తీసుకు విచారణ చేసిన బహుసులభముగ తెలియగలదు.

ఒకరు తన స్నేహితునకు చాలా ముఖ్యమైన ఒక ఉత్తరమును వ్రాసినారని అనుకొనుడు.

వ్రాసిన వారికి జవాబు త్వరగా కావలసిన అవసరము కలదు. కనుక ఉత్తర మంతయు వ్రాసి, చివరకు "యీ ఉత్తరము అందని పక్షములో తిరుగు టపాలో యీ ఉత్తరము అందలేదని ఉత్తరము ద్వారా (Clear గా) తెలియపర్చ వలసినదిగా మరీ మరీ కోరుచున్నాను" అని వ్రాసినారని అనుకోండి. ఇక విచారణ:

ఉత్తరము అందని పక్షములో ఉత్తరము అందలేదని తిరుగు టపాలో ఎట్లా జవాబుగా ఉత్తరము వ్రాయుట తటస్థించును? వ్రాసినవారికి బుద్ధి (మెదడు) ఉన్నట్లా, లేనట్లా?

ఒకవేళ ఉత్తరము అందుకొని, చదువుకొని తిరుగు టపాలో "మీరు కోరిన ప్రకారము మీరు వ్రాసిన ఉత్తరము అందలేదని వ్రాయుచున్నాను" అని వ్రాసినచో అంది ఉత్తరమును అందలేదని వ్రాయుట తప్ప మరేమున్నది? ఉత్తరము అందకపోతే అందలేదని వ్రాయుట ఎంత absurd గా వుండునో, కుదరదో, అట్లాగే దేవుడు లేకపోతే లేడని చెప్పటము కూడా అంత absurd గా వుండును, కుదరదు.

ఎవరైనను అందరికి తెలియచెప్పవలయునని ఉన్నదానిని గురించి ప్రచారము చేయవలయునుగాని అసలే లేనిదానిని గురించి ప్రచారము ఎందుకు? ఎట్లాచేయటము వీలగునా?

కనుక ఏదైన ఒక వస్తువు "ఉన్నది" అని గాని, "లేదు" అని గాని తెలియ చెప్పుటకు మొదట ఆ వస్తువు ఏదో తెలిసినగాని తెలియచెప్పుటకు వీలుకాదు. ఇది సిద్ధాంతము. తిరుగులేదు.

ఏదైన ఒక వస్తువు "ఉన్నది" అని గాని "లేదు" అని గాని చెప్పినచో ఆ వస్తువు ఏదో, ఎట్టిదో తెలియును గనుకనే చెప్పకలుగుచున్నాడు.

ఆ వస్తువు ఏదో తెలియని పక్షములో "ఆ వస్తువు ఏదో ఫలనా అని నాకు తెలియదు. కనుక ఆ వస్తువు ఉన్నదనికాని, లేదనికాని నేను చెప్పజాలను, చెప్పుటకు వీలుకాదు" అని చెప్పవలసి యుండును.

"దేవుడు లేడు" అని చెప్పినపుడు, దేవుడు అంటే ఎవరో, ఏమిటో బాగా తెలుసును గనుకనే "దేవుడు లేడు" అని చెప్పగలుగుచున్నాడు.

దేవుడు అంటే ఎవరో, ఏమిటో తెలియని పక్షములో పెద్దమనిషి తరహాలో దేవుడు అంటే ఎవరో, ఏమిటో, లేక రాయో. రప్పో తనకు తెలియదు

గనుక "దేవుడు ఉన్నాడనిగాని, లేడనిగాని చెప్పజాలను, చెప్పుటకు వీలుకాదు" అని జవాబు చెప్పవలసి యుండును.

"దేవుడు లేడు" అని చెప్పినప్పుడు చెప్పినవాని అభిప్రాయము తనకు ఎదురుగా లేడు అని అర్థము కాని అసలు ఎక్కడా లేనే లేడని అర్థము కాదు.

కనుక దేవుడు ఉన్నాడని నిర్ధారణ చేయుటకు "దేవుడు లేడు" అన్న వాక్యమే చాలును. ఇదే ప్రమాణము. ఇంతకు మించి ఇంకా చెప్పవలయునా ?

పైన విమర్శచేసి దేవుడు ఉన్నాడు అని నిర్ధారణ చేసిన వాక్యములను అన్నిటిని కంఠస్థముచేసి వరుసగా ఒప్పచెప్పిన చాలును. తెలుసుకోవలయును అన్న జిజ్ఞాస నిజముగా వున్నచో "దేవుడు ఉన్నాడు" అని ఒప్పుకొని తీరవలసినదే.

దేవుడు ఉన్నచో ఎట్లా వున్నాడు ? ఎక్కడ వున్నాడు ? ఎప్పుడు వున్నాడు ? ఏమి చేయుచున్నాడు ? అసలు ఎందుకు వున్నాడు ? మొదలగు వివిధ ప్రశ్నలు ఉన్నవి. మొదట దేవుడు వున్నట్లు నిర్ధారణగా ఒప్పుకున్న పక్షములోనే పైన చెప్పిన ప్రశ్నలను గూర్చి విచారణ చేయుట న్యాయము. ఇట్లు కాకుండా సబ్ లుండగా ప్రశ్నల పరంపరను వేయుచూ విచారణ సాగిపోవుచున్నచో చెప్పేవారు, వినేవారు ఉభయులు అతఃపాతాళమునకు పోయి, గాఢాంధకారములో వుండి తిరిగి జన్మ ఎత్తి సత్యమును తెలుసుకొనుటకు మరికొన్ని వేల జన్మలు పట్టవలసినదే !

అందరికి బాగా తెలిసిన మరి రెండు చిన్న ఉదాహరణలను తీసుకుని విచారించినచో "దేవుడు ఉన్నాడు" అని ఇంకా బాగా దృఢపడగలదు.

ఆంధ్ర దేశములో ఎవరన్నా "ఏమిటోయి గొడవ" అని అడిగితే, "ఏమున్నది, సింగినాదం, జీలకర్ర" అని జవాబు చెప్పుచుందురు కొందరు.

కనుక ఈ "జీలకర్ర" ను ఉదాహరణగా తీసికొని విచారించుచున్నాం.

ఎవరో ఒకరు ప్రక్కనున్న గృహస్తుని యింటికి వెళ్లి ఆ యింటిలో వున్న పది సంవత్సరముల వయస్సుగల చిన్న అమ్మాయిని పిలిచి "మీ యింటిలో మీ అమ్మను అడిగి కొంచెము జీలకర్ర తెచ్చిపెట్టు" అని అడిగినారని అనుకోండి.

అప్పుడు ఆ అమ్మాయి వెంటనే వంటయింటిలోపలకు పరుగెత్తి మూతలు పెట్టె తెరచి చూచి జీలకర్రను కొంచెము తీసుకువచ్చి కావాలన్నవారికి యిచ్చును. ఇవ్వగలుగును.

ఒకప్పుడు జీలకర్ర అయిపోయి లేనిపక్షములో తిరిగివచ్చి "లేదండీ" అని జవాబు చెప్పును.

ఆ అమ్మాయినే మరి ఒకరు వచ్చి "Potassium Synade ను కొంచెము తెచ్చిపెట్టు" అని అడిగినారని అనుకోండి.

అప్పుడు ఆ పిల్ల వెంటనే "Potassium Synade అనగా ఏమిటండీ? నాకు తెలియదు. ఇంగువా, మెంతులా, ఆవాలా, బెల్లమా?" అని అడుగుతుంది. అది ఏదో తెలియని సందర్భములో అన్ని ప్రశ్నలు వేయక తప్పదు.

అది ఏదో చెప్పక తిరిగి, తిరిగి "Potassium Synade తెచ్చిపెట్టు" అని అడిగితే ఆ పిల్ల ఏమిచేయును?

ఆ చిన్నపిల్ల కోపములో "అదేమిటండీ! అది ఏమిటో నాకు తెలియదని చెప్పుతుంటే, తీసుకురా, తీసుకురా, అని అదేపనిగా అడుగుతారు? ఆ వస్తువు ఏదో నాకు తెలిసినగదా వెతికి చూచి, వున్నచో తీసుకు వచ్చి యివ్వటము, లేనిచో లేదని చెప్పుటకు వీలు అయేది" అని సమాధానము చెప్పును.

ఒకవేళ ఆ పిల్లకు Potassium Synade అనగా ఏమిటో తెలిసిన పక్షములో "అదేమిటండీ, అట్లా అడిగి తీసుకురమ్మంటారు? ఆ వస్తువు నాలిక మీద తాకించగానే, చచ్చిపోయే విషపదార్థముకదా, దానిని ఎవరైనా అందరికి అందేటట్లుగా వుంచుతారా" అని జవాబు చెప్పి, మందలించును కూడా!

కనుక, పైన నిర్ధారణ చేసినట్లుగా ఒక వస్తువు ఉన్నదనిగాని, లేదనిగాని చెప్పుటకు ఆ వస్తువు ఏదో ఫలానా అని తెలిసినగాని చెప్పుటకు వీలుకాదన్న అంశమునకు జీలకర్ర ఉదాహరణ చక్కగా సరిపోవును.

అనగా దేవుడు ఎవరో, ఏమిటో తెలుసును గనుకనే, "దేవుడు లేడు" అని ధైర్యముగా చెప్పగలుగుచున్నాడు.

ఇక "లేడు" అన్నదానికి మరియొక చిన్న ఉదాహరణ చెప్పెదను.

బాగా ధనవంతులు, పెద్ద పెద్ద అధికారులు—వారలు కాపురముచేయుచున్న బంగాళాల సింహద్వారముల ప్రక్కను బాగా పాలిష్ (మెరుగు) చేయబడిన ఇత్తడి బిళ్ళలను లేక రేకులను (Signboards) అమర్చి వుంచుతారు. ఆ బిళ్లపైన సగమున "In (లోపల)" అని, మిగతా సగమున "Out (బయట)" అని అక్షరములను చెక్కించుదురు. దీని అర్థము ఏమనగా "In (లోపల)" అని వ్రాసిన దానికి ఆ యజమాని బంగాళాలో వున్నట్లుగా అది చూచి చదువుకున్నవారు గ్రహించవలసియుండును.

"Out (బయట)" అని వున్న అక్షరములు చూచి ఆ యజమాని బయటకు వెళ్లినట్లు, ఇంటిలో లేనట్లు తెలిసికొనవలసి యుండును.

ఆ అక్షరములు ఉన్న "in" పైన, "out" పైన ఇటు అటు కదలునట్లుగా చిన్న ఇత్తడి బిళ్లలు (మూతలు) అమర్చిపెట్టుదురు. సింహద్వారము దగ్గర ఎప్పుడూ కాపలాకాయుచుండే బంట్రోతో, మరొకరో యజమాని ఇంట్లోకి రాగానే "out" అన్న అక్షరములు మూసివేయుదురు. బయటకు వెళ్లగానే "in" అన్న అక్షరములను మూసి వేసి "out" అన్నవి వుంచుదురు.

అప్పుడు దీని అర్థము ఆ యజమాని ఇంట్లో లేడని, బయటకు వెళ్లినాడని తెలుసుకోనవలసి యుండును.

ఆ యజమాని ఒకేసారి యింటిలోను, బయటను ఉండగలిగి వున్న పక్షములో యీ "in" అని "out" అని ఉంచిన సైన్‌బోర్డు అక్కడ అమర్చనే అక్కర లేదుగదా!

అనగా ఆ యాజమాని ఉంటే ఇంటిలో వుండాలి. ఇంటిలో లేకపోతే బయటకు వెళ్లి వుండాలి.

సర్వత్ర, సర్వదా సర్వవ్యాప్తిగా ఆ యజమాని వుండడుకదా! ఉండ లేదు కదా?

కనుక "దేవుడు లేడు" అని నాస్తికుడు ఘంటాపథంగా, బాహాటముగా చెప్పినప్పుడు, ఆ బంగాళా యజమాని తీరుగా ఆ దేవుడు తన వద్ద లేడనియే అర్థము. అంతే!

అసలు దేవుడే లేడని అర్థము కానే కాదు. కానేరదు.

ఎవరైనను తప్పిపోయి, కనపడకపోతే అతను ఎక్కడ వుంటే అక్కడ వెతికితే అక్కడ కనబడును. లేనిచోట వెతికితే కనపడడు.

దేవుని విషయము వేరు. దేవుడు ఎక్కడెక్కడ వెతికితే అక్కడక్కడల్లా కనబడును. ఎట్లా కావాలి అంటే అట్లా కనపడును. దేవుడు తాను ఎట్లుగా సంకల్పించిన ఆ ప్రకారము కనపడును. ఒకప్పుడు ఉండికూడ కనబడడు.

దేవుడు సర్వవ్యాపి గనుక "ఎక్కడ వున్నాడు? ఉన్నాడా" అని అడిగే ప్రశ్నలే తప్పు. Evidence Act ప్రకారము ప్రశ్న అడుగనే కూడదు. "రాజుగారి పెద్ద భార్య మహాపతివ్రత" అని చెప్పినచో రెండవ భార్య పతివ్రత కాదనే సూచించును గదా! దేవుడు ఒకచోట వుండి, మరొకచోట లేనప్పుడు దేవుడు ఎక్కడ వున్నాడు అని ప్రశ్న వేయవచ్చును. కనుక ప్రశ్నయే సరికాదు.

ఆస్తిక్యబుద్ధి, అనగా వేదప్రమాణబుద్ధి, గలవారలకు దేవునియొక్క ఉనికిని గూర్చి చెప్పనవసరము లేదు.

పరమభక్తుడైన ప్రహ్లాదచరిత్ర, శ్రీ నృసింహావతారము యొక్క అవతరణ గూర్చి తెలిసికొన్నవారికి వేరే, ఏదో నమ్మకము కలుగునట్లు, దేవునిగూర్చి చెప్పవలయునా? "దేవుడు ఉన్నాడు" అంతే!

మీ రందరును అత్యంతభక్తి ప్రపత్తులు గలవారగుటవల్ల పైన పొందుపర్చిన అంశములను చక్కగా గ్రహించగలరు అనే నా నమ్మకము. మీ అందరి క్షేమ సమాచారములు తెలుపుచుండవలెను.

ఇవియే మీ అందరికి నారాయణస్మరణపూర్వక ఆశీర్వాదములు.

శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వామి
శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి
కుర్తాళము
30-8-1972

కుర్తాళము
27-6-'80

అస్మత్ సిద్ధేశ్వరీ పీఠ ముఖ్యశిష్యులు
శ్రీ కొల్లకూరు రామచంద్రా రెడ్డిగారిని నారాయణస్మరణ
పూర్వకముగ ఆశీర్వదించి వ్రాయునది.

మీరు వ్రాసిన ఉత్తరము అందినది. ఆనందమైనది.

మీ ధర్మపత్ని శ్రీమతి అనసూయమ్మగారి యొక్క స్మారక చిహ్నముగ నెల్లూరులో ఆమెగారి పేరున కళ్యాణమండపమును నిర్మాణము చేయించి, ధన్యులైరి.

ఆ సందర్భములో వున్న, "Self, Supreme Self and the Universe" అన్న చిన్న గ్రంథమును, "జీవాత్మ - పరమాత్మ - ప్రపంచము" అని తెలుగులోనికి అనువాదము చేసిన పుస్తకమును మీ ఖర్చుతో అచ్చు వేయించి, తమ సతీమణిగారియొక్క స్మృతిచిహ్నముగ పాఠమూర్తికి [illegible], అపారమైన దైవభక్తిని ప్రకటింపచేసి దాన, తాము తృప్తిని [illegible] సంకల్పము [illegible] తెలిపితిరి. సంతోషము. మాకును సమ్మతమే. శ్లాఘనీయము కూడా!

ఆమెగారిని గూర్చి నాలుగు వాక్యములు ఉపోద్ఘాతముగా వ్రాసి పంపమని కోరితిరి. నేను వ్రాయవలెనా ?

ఆమెగారు నాకు వ్రాసిన, లభ్యపడిన యిందులో పంపే రెండు ఉత్తరములను శ్లోకాలు జిరాక్సు చేయించి ఆపాటున అచ్చు వేయించుట ఉత్తమము. ఇట్లు జరిపిన ఆమెగారి యొక్క సచ్ఛీలము, సదాచారము, సత్సంప్రదాయము, సత్సంస్కారము, సద్గోష్ఠి, సత్సంగము, సత్పఠనము, సత్ప్రవర్తన మొదలగు ఆమె సద్గుణములు తెలియబడ గలవు. తర్వాత లోగడ నేను ఆమెగారికి వ్రాసిన ఆధ్యాత్మిక, ఆస్తిక్య, జ్ఞాన, వైరాగ్య సంబంధమైన ఉత్తరములు వెతికిన, దొరకిన ఒకటి లేక రెండు అచ్చువేయించినను సరిపోవును. [illegible].

ఇవియే నారాయణస్మరణపూర్వక ఆశీర్వాదములు
శ్రీ త్రివిక్రమ రామానందభారతీ స్వామి
శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి
కుర్తాళము
27-6-1980

# చిన్న ఉపోద్ఘాతము

శ్లో. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥
గీతా. 7 అ॥ 3 శ్లో.

పైన చెప్పిన గీతా వాక్యములు — శ్రీ పెళ్ళకూరు అనసూయమ్మగారి యెడల బాగా సమన్వయము కాగలవు.

శ్రీ స్వాములవారి, ఆమెగారి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు చాలా విలక్షణముగా యుండును.

ఆమెగారు శ్రీ స్వాములవారికి వ్రాసిన రెండు ఉత్తరములు యిందు ప్రచురింపబడుచున్నవి. ఆమెగారు స్వహస్తముతో వ్రాసిన ఉత్తరములకు ఫొటోలు తీయించి, బ్లాకులు చేయించి, ఉన్నవి ఉన్నట్లుగా కూడా యిందు ప్రచురింపబడినవి.

రాజకీయములలో భాగముగా యున్న ప్రజాసేవలలో మునిగి, తీరికయే దొరకని భర్తగారికి నచ్చచెప్పి, ప్రోత్సహించి దంపతులు ఉభయులు శ్రీ స్వామివారి సన్నిధికి పలుమారులు వెళ్ళి, ఆత్మ విచారణ చేయుటయేగాక, ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా కూడా ఆత్మతత్త్వమును తెలిసికొని తరించిన మహాసాధ్వి, ఉత్తమ యిల్లాలు - యీ శ్రీమతి పెళ్ళకూరు అనసూయమ్మగారు.

ఈమెగారి స్మారక చిహ్నముగా భర్తగారైన శ్రీ పి. రామచంద్రారెడ్డిగారు యీ పుస్తకమును ప్రచురించుట సామాన్య విషయముకాదు. బహుధా శ్లాఘనీయము.

కీర్తిశేషులైన

శ్రీమతి వెల్లకూచి అనసూయమ్మగారి యొక్క

స్మారకచిహ్నము

ఈ

“జీవాత్మ పరమాత్మ జగత్తు”



కీ. శే. పెళ్లకూరు అనసూయమ్మగారు

శ్రీమతి అనసూయమ్మగారు మంచి సంప్రదాయముగల సుసంపన్నమైన కుటుంబములో జన్మించింది. ఆనాటి నెల్లూరు జిల్లా బోర్డు ప్రెసిడెంటు అయిన శ్రీయుతులు పెళ్లేటి వెంకట సుబ్బారెడ్డిగారు ఆమె జనకులు. 1943 సంవత్సరములో విద్యా వినయ సంపన్నులు, సహృదయులు, ఐశ్వర్యవంతులు అయిన శ్రీయుతులు పెళ్లకూరు రామచంద్రారెడ్డిగారితో వైభవోపేతంగా ఆమెకు వివాహం అయినది. వీరు నేడు ఆంధ్ర ప్రాంతీయ ప్లానింగ్ అండ్ డెవలప్‌మెంటు కమిటీ అధ్యక్షులుగా ప్రజాసేవ చేస్తున్నారు.

శ్రీమతి అనసూయమ్మగారు అజన్మసంస్కారంగల విదుషీమణి, కవి పండితాభిమానము ఆమెగారికి పుట్టుకతో వచ్చినది. నిత్యము భగవద్గీత పారాయణ చేసేది. భారత, భాగవత, రామాయణాది పురాణాలను, ఉపనిషత్తులను శ్రద్ధతో పఠనం చేసేది. అవి ఆమెగారికి దాదాపు కంఠస్థములని చెప్పుటకు ఒక ఉదాహరణ. శ్రీ శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారు ఉపన్యసిస్తూండగా వారికి ఏదైనా పద్యమో, శ్లోకమో గుర్తుకు రానప్పుడు సభలో ఉన్న అనసూయమ్మగారి వంక చూడగా, ఆ పద్యాన్నో, ఆ శ్లోకాన్నో వెంటనే అందించేది.

శ్రీ రమణ మహర్షులకు, శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారికి, శ్రీ నిత్యానంద స్వాములకు, శ్రీ మళయాళ స్వాములకు అనసూయమ్మగారు ఆప్తవర్గములోని శిష్యురాలు. భర్తను భక్తితో సేవిస్తూ, బంధుజనులను అభిమానంతో ఆదరిస్తూ, సేవకులను, పేదలను, సాధువులను సానుభూతితో కనిపెట్టుతూ, కొన్ని గ్రంథములను అచ్చు వేయించి పండితులను సన్మానించి అందరి మన్ననలను చూరగొన్న దొడ్డ ఇల్లాలు. ఇన్ని సుగుణాల రాశి అయిన ఆ మహాసాధ్వి గుండెపోటుకు గురిఅయి 15-8-1975-వ తేదీన భర్తను, పి. వెంకట సుబ్బారెడ్డి, ప్రభాకరరెడ్డి, వసంతకుమార్ రెడ్డి కుమారులను, రేవతి, మంజుల కుమార్తెలను, కామేశ్వరి కోడలును, బంధుకోటిని దుఃఖసముద్రమున ముంచి భగవంతుని చరణ సన్నిధిని చేరినది.

ఇటువంటి సాధ్వీమణిని భార్యగా గలిగిన భాగ్యశాలి శ్రీ రామచంద్రారెడ్డిగారు తమ సహజ ఔదార్యముతో నెల్లూరులో "పెళ్లకూరు అనసూయమ్మ కళ్యాణ మండపము" రెండు లక్షల రూపాయలతో కట్టించినారు. ఈ ఉత్తమ గ్రంథమును సర్వాంగ సుందరముగా ముద్రింపించి తమ ధర్మపత్ని యెడల తమకుగల అపార ప్రేమాభిమానములకు స్మృతి చిహ్నముగ ముముక్షువులకు ముకుళిత హస్తములతో అందచేసినారు. సర్వేశ్వరుడు వారికి ఆయు రారోగ్య భాగ్యముల నిచ్చి సర్వదా, సర్వథా ప్రోచుగాత!

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

30-6-'73

సచ్చిదానందస్వరూపులైన శ్రీ స్వామివారి పాదసన్నిధికి అనేక ప్రణామములాచరించి వ్రాయునది. తమరు వ్రాసిన ఉత్తరము నిన్ననే చేరినది. తమరు రామన్నపాళెం వ్రాసిన ఉత్తరములు కూడా చదివితిమి. నిన్ననే రామన్నపాళెం నుండి మన గుమస్తా దశరథరామయ్య కూడా వచ్చినారు. శ్రీ రెడ్డిగారు హైదరాబాదునుండి శనివారం వస్తారని చెప్పినారు. తమరు రామన్నపాళెంనుండి కుర్తాళం చేరిన తర్వాత ఇప్పటికి మూడుసార్లు హైదరాబాదు పోయినారు. శ్రీ రెడ్డిగారికి తమరు జాబు వ్రాసే తీరిక కూడా లేదు. జనం ఎక్కువగా వస్తున్నారు. పనులు ఎక్కువగా ఉన్నవి. తమరు వారికి వ్రాసేటట్లయితే రామన్నపాళెమునకే వ్రాయండి.

స్వామీ! నాకు సంసారముమీద వ్యామోహము ఎక్కువగా లేదు. ఈ సంసార బంధముల నుండి తప్పించుకొనుటకు ఏదైనా మార్గముంటే తెలుపండి. మనుష్యులు ప్రాక్తనకర్మ అనుభవించియే తీరవలెను, దానిని నశింపచేయుటకు ఏదైనా దారిలేదా? నాకు శరీరముయొక్క ఆరోగ్యము ఏమీ బాగులేదు. నాకు మనశ్శాంతిలేదు. కాబట్టి తమరు నాకేమైనా మంచి విషయములు తెలుపుచూ మరల ఒక ఉత్తరం మద్రాసుకు వ్రాయండి. ఇంతే.

ఇట్లు

(Sd.) పి. అనసూయమ్మ

హైదరాబాదు
20-8-'73

దైవాత్మ స్వరూపులైన శ్రీ స్వామివారి దివ్యసన్నిధికి అనేక దండవత్ ప్రణామము లాచరించి వ్రాయునది.

10-వ తేదీన తమరు నాకు మద్రాసుకు వ్రాసిన జాబు ఈదినము హైద్రాబాద్ చేరినది. తమ యొక్క క్షేమ సమాచారములు తెలిసినవి. చాలా సంతోషమైనది. శ్రీ రెడ్డిగారు ఢిల్లీ వెళ్లి ఉన్నారు. ఈదినమే వారి దగ్గరనుండి జాబు వచ్చినది. వారు 21 న బయలుదేరి 23 హైద్రాబాద్ వస్తానని వ్రాసినారు. వారిని పి. వి. నరసింహారావుగారు రమ్మని ఢిల్లీ నుండి ట్రంక్ కాల్ లో మాట్లాడినారు. కాని ఇక్కడ ప్లేన్‌లో కాని, ట్రెయిన్‌లో కాని టిక్కెట్లు దొరకలేదు.

శ్రీ రెడ్డిగారు ఢిల్లీ నుండి వచ్చిన వెంటనే తమరికి మరియొక ఉత్తరము వ్రాసెదము. తమరికి ఇంతకు ముందెప్పుడో వైరాగ్యాను ఉత్తరము వ్రాసితిని అని తమరు వ్రాసినారు. కాని అంతటి మహాభాగ్యము మా బోటి వారలకు కలుగునా! స్వామీ! తమ బోంట్ల దయవలన, భగవదనుగ్రహము వలన జ్ఞాన వైరాగ్యములు కలిగిన యెడల ఇంక కావలసిన దేమున్నది! తమయొక్క దయవలన ఎప్పటికైనా వైరాగ్యము, జ్ఞానము స్థిరముగా నుండవలయుననియే కోరుకొనుచున్నాను. ఇచ్చట క్షేమము. తమరియొక్క క్షేమ సమాచారములు తెలుపగోరుచున్నాను.

ఇట్లు
నమస్కారములతో
(Sd.) పి. అనసూయమ్మ



జగద్గురువులు శ్రీ శంకరాచార్య
శ్రీ శ్రీ శ్రీ అభినవ విద్యాతీర్థ స్వాములవారు
శ్రీ శృంగేరి పీఠాధిపతి



శ్రీ శ్రీ శ్రీ శివచిదానంద సరస్వతీ స్వామీజీ

శ్రీ మౌనస్వాములవారు



శ్రీ శ్రీ శ్రీ విమలానంద భారతీ స్వామీజీ



శ్రీ శ్రీ శ్రీ విమలానంద భారతీస్వామి II



శ్రీయుతులు పెళ్లకూరు రామచంద్రారెడ్డిగారు

*Chairman, Coastal Andhra Planning and Development Committee, Government of Andhra Pradesh*



శ్రీరస్తు

# అంతర్యామి ప్రార్థనము

శ్లో॥ జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః
జానా మ్యధర్మం న చ మే నివృత్తిః
త్వయా హృషీకేశ హృది స్థితేన
యథా నియుక్తోఽస్మి తథా కరోమి॥

— ప్రపన్న గీత - 56

హృషీకేశా! ధర్మమును ఎఱుంగుదును. కాని దాని యందు నాకు ఆసక్తి కలుగుటలేదు. నేను అధర్మమును ఎఱుంగుదును. కాని దానినుండి వెనుకకు మరలఁ జాలకున్నాను. నా హృదయమందున్న నీవు నన్ను ఎట్లు నియోగింతువో అట్లు చేయుదును.

# శాంతి పాఠము

హరిః ఓమ్। శం నో మిత్ర శ్శం వరుణః। శం నో భవత్వర్యమా।
శం న ఇన్ద్రో బృహస్పతిః। శం నో విష్ణు రురుక్రమః।
నమో బ్రహ్మణే। నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం। బ్రహ్మాసి।
త్వమేవ। ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి। ఋతం
వదిష్యామి। సత్యం। వదిష్యామి। తన్మామవతు। తద్వక్తార మవతు।
అవతు మామ్। అవతు వక్తారమ్।

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

తైత్తరీయోపనిషది, శిక్షావల్ల్యాం ప్రథమోఽనువాకః (ప్రాణవృత్తికి, అహస్సునకు అభిమాని యైన దేవత) మిత్రుడు మాకు సుఖము (సుఖకరుఁడు) అగును గాక! (అపానవృత్తికి, రాత్రికి అభిమాని యైన దేవత) వరుణుఁడు మాకు సుఖము (సుఖకరుఁడు) అగును గాక! (చక్షురింద్రియమునకు, ఆదిత్య మండలమునకు అభిమాని యైన దేవత) అర్యముఁడు మాకు సుఖము (సుఖకరుఁడు) అగును గాక! (బలమునకు, బాహువులకు అభిమాని యైన దేవత) ఇంద్రుఁడు, (వాక్కునకు, బుద్ధికి అభిమాని యైన దేవత) బృహస్పతి మాకు సుఖము (సుఖకరులు) అగుదురు గాక! (పాదేంద్రియమునకు అభిమాని యైన దేవత) ఉరుక్రముఁడు (జగద్వ్యాపకుఁడు) అయిన విష్ణువు మాకు సుఖము (సుఖకరుఁడు) అగును గాక! బ్రహ్మము వైన యో వాయుదేవా! నీకు నమస్కారము. నీవే ప్రత్యక్ష మైన బ్రహ్మము. నిన్నే ప్రత్యక్ష మైన బ్రహ్మమునుగా చెప్పుదును. ఋతమునుగా (శాస్త్రము ననుసరించి బుద్ధియందు నిశ్చయింపఁబడిన కర్తవ్యమునుగా) చెప్పుదును; సత్యమునుగా (వాక్కుచేత, కాయముచేత వ్యవహరింపఁ బడునట్టి ఋతమునుగా) చెప్పుదును. అది (సర్వాత్మక మైన యా వాయురూపబ్రహ్మము) నన్ను (బ్రహ్మవిద్యను అర్థించు శిష్యుని) రక్షించును గాక! అది వక్తను (బ్రహ్మవిద్యను బోధించు నాచార్యుని) రక్షించును గాక! నన్ను రక్షించును గాక! వక్తను రక్షించును గాక!

ఆధ్యాత్మికము లైన విఘ్నములు శమించును గాక! ఆధిభౌతికము లైన విఘ్నములు శమించును గాక! ఆధిదైవికము లైన విఘ్నములు శమించును గాక!



ప్రథమ పరిచ్ఛేదము

# సమాజ సమీక్ష

## పూర్వము, నేడును సౌఖ్యము కొఱకు జరుగుచున్న యన్వేషణ

భౌతికశాస్త్ర పరిశోధనలవలన కనులకు మిఱుమిట్లు కలిగించునట్టి ఫలితములను సాధించిన పాశ్చాత్యనాగరికత, తమ దేశములోని దేదియైనను వ్యర్థమే యని భారతీయులు భావించునంతగా వారిని విభ్రాంతులను గావించినదని నేను విశ్వసించుచున్నాను. కాని, మానవులకు సుఖమును కలిగించుచున్నట్లుగా కన్పించుచున్న యనేక నూతన విజ్ఞాన విశేషములు పాశ్చాత్య దేశములలో ప్రజలను నానాఁటికి సుఖహీనులలను, దుఃఖభాజనులలను గావించుచున్న వనుట సత్యము.

నాగరికములైన యా దేశములలో కూడ ధనసంపత్తికి పరిశ్రమకు, ధనవంతులకు సామ్యవాదులకు, సామ్యవాదులలో కూడ మితవాదులకు అతివాదులకు, ప్రభువులకు సామాన్యులకు, కాథలిక్కులకు ప్రొటెస్టెంట్లకు, షియాలకు సున్నీలకు, తుదకు నల్లవారికి, తెల్లవారికిని మధ్య అవిశ్వాసము, సంఘర్షణము చెలరేగుచుండుట మనము చూచుచునే యున్నాము.

అప్పటికి చక్కఁగా నున్న సాంఘికమైన యైకమత్యమును, దృఢత్వమును భంగ మొనర్చుటకే ప్రజలలో ఒకరి కొకరికి నడుమ ఎన్నో సమస్యలను సృష్టించుచు బ్రిటిషువారు హిందూదేశమును ఎట్లు పాలించిరో తెలిసినవారు నేఁటికిని కొందఱు జీవించియే యున్నారు.

మనము స్వారాజ్యమును సంపాదించు కొన్న తరువాత కూడ మన నాయకులు సర్వరోగచింతామణిగా వర్ణరహితసమాజమును నిర్మింపవలయునని పూనుకొనిరి. వర్ణములు నిర్మూలింపబడిననే తప్ప, మన ప్రజలకు సుఖము గాని, సమానత్వము గాని కలుగదని ప్రకటముగా ఉద్ఘోషించుచున్నారు.

హిందువులకు సంబంధించిన వర్ణభేదములను ఒకప్పటికి తొలఁగింపఁగల మనుకొన్నను ఇంకను ఈ దేశమందున్న ముస్లిములు, క్రైస్తవులు, బౌద్ధులు, జైనులు మొదలగు వారి సంగతి యేమి? అసలు, హిందువులలో కూడ వైష్ణవులు, శైవులు మొదలుగా

ఎన్నో తెగలవారు ఉన్నారుకదా! భిన్నము లైన యిన్ని మతములతో, వర్ణములతో ఎప్పటి కైనను ఏకరూపమైన సమాజము ఎట్లు రూపొందఁగలదు? నిజమునకు మతములకు సంబంధింపని ప్రభుత్వ వ్యవస్థను (Secular State) మనము ఏర్పఱచుకొన్నది యీకారణముచేతనే కదా!

వర్ణ భేదములను తుడిచివేయుటకై బుద్ధ భగవానుఁ డెన్నో ప్రయత్నములను గావించె నని, కాని బౌద్ధసంఘరూపమున మఱియొక వర్ణ మేర్పడుటయే ఆ ప్రయత్నములకు ఫల మయ్యె నని చరిత్ర నిరూపించుచున్నది. విగ్రహారాధనమును నిరాకరించి, "గ్రంథ సాహిబ్" పఠనమును ప్రవేశపెట్టి గురు నానక్ ముస్లిములకును, హిందువులకును ఏక త్వమును సంపాదించుటకై ప్రయత్నించెను; కాని విఫలుఁ డయ్యెను. సిక్కు జాతి మరల ఇంకొక వర్ణముగా వెలిసెను.

ఈ శతాబ్దమున వేదములను మాత్రమే ప్రమాణముగా గుర్తించుచు, విగ్రహారాధన మును నిరాకరించుచు స్వామి దయానంద సరస్వతి వర్ణభేదములను తొలఁగించుటకై ప్రయత్నించెను. మఱి ఆ ప్రయత్నమునకు ఫలముగా నేటి ఆర్యసమాజము ఏర్పడి అదియొక క్రొత్తవర్ణము లేక తెగ యయ్యెను.

ఇంచుమించుగా ఈ పద్ధతులయందే రామమోహనరాయలు ఉపనిషత్తులలో, బైబిలులో, ఖురానులో, బౌద్ధుల త్రిపిట కములలో నున్న ప్రార్థనములే ముఖ్యము లని గుర్తించి బ్రహ్మసమాజమును ప్రారంభించెను. దీని కంతకును ఫలముగా బ్రహ్మ సమాజము వేఱొకవర్ణముగా పరిణ మించెను.

రామమోహనరాయలు, వారి యను యాయులును స్త్రీ పునర్వివాహమును ఆచరణలోనికి తెచ్చిరి. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారును బ్రహ్మ సమాజమున చేరి స్త్రీ పునర్వివాహమును ప్రోత్సహించిరి.

మన కాంగ్రెసు నాయకులలో కొందఱు హిందువులలో వర్ణభేదములను తొలఁగించి దృఢమైన యేకరూప సమాజమును రూపొందింప వలయునని సర్వోదయ సమాజ మును ప్రారంభించిరి. ఇప్పటికే ఎక్కువగా నున్న వర్ణభేదముల సంఖ్యకు ఇది యింకొక దానిని అధికముగా చేర్చుచున్నది.

ఈ యుద్యమములను ఆరంభించిన నాయ కులు అప్పటి కప్పుడు నెగ్గినట్లే కన్పించు చున్నను, తుదకు అనులోమ, విలోమ జాతులవంటి ప్రత్యేకవర్ణములు ఏర్పడుటయే ఫలితముగా కన్పించుచున్నది. కాని పురాతనమైన వర్ణవిధానము మానవుఁ డెవఁడును సృష్టించినది కాకపోవుటచే హిందూసమాజము బహుముఖముల కొన సాగుచునే యున్నది. అది అనాదిగా శాశ్వతముగా నున్నది.

పరమేశ్వరావతారమైన శ్రీకృష్ణభగవా నుఁడు భగవద్గీతలో నాల్గవ యధ్యాయము నందు పదుమూఁడవ శ్లోకమున నిస్సందేహ ముగా ఇట్లు ఉద్ఘాటించినాఁడు.

శ్లో. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్॥

"గుణములయొక్క, కర్మలయొక్క విభా గము ననుసరించి నాలుగువర్ణముల విధా నము నాచే సృష్టింపఁబడినది. నేను దానికి కర్తను అయినప్పటికిని, నన్ను అకర్తనుగఁ

(కర్తృత్వము లేనివానిగ) అవ్యయునిగ తెలిసికొనుము."

శ్రీకృష్ణభగవానుఁడు చాతుర్వర్ణ్యమును జన్మసిద్ధముగనే తాను సృష్టించినట్లు ఉద్ఘాటించినాఁడు. జీవులు నిత్యులు. వారికి వారి గుణములనుబట్టి ఆయావర్ణములలో జన్మలు కలుగుచుండును. వారు పూర్వ జన్మలలో చేసిన సత్కర్మములను బట్టి, దుష్కర్మలను బట్టి ఏర్పడిన సంస్కారముల వలన ఆ గుణములు రూపొందును. జీవులు ఎల్లప్పుడును స్వతంత్రులైన కర్తలు స్వతంత్రులైన భోక్తలు. జీవు లనగా మానవులే కాదు, ఇతర ప్రాణులును జీవులే.

జగత్తునకు దూరుఁడై యున్న యొకానొక యీశ్వరునిచే జీవులు సృష్టింపబడుట లేదు. క్రింద చెప్పబోవువిధముగా వారు వర్ణవ్యవస్థ యందు జన్మించుచున్నారు. సకలజీవుల యొక్క అనగా మానవులయొక్క కర్మల వివరములను అన్నింటిని భగవంతుఁడగు చిత్రగుప్తుఁడు అత్యంతశ్రద్ధతో అద్భుతముగా సమకూర్చుచుండును. పుట్టినజీవులు కాల వశమున మరణింతురు. మరణించినవారు కాలవశమున మరల జన్మింతురు. ఇదే హిందూధర్మమునకు సారాంశము.

"జాతస్య హి ధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మ మృతస్య చ"

పుట్టినవానికి చావు నిశ్చితము. చచ్చిన వానికిని మరల పుట్టుట నిశ్చితమే. కర్మ ఫల ప్రదాతయైన ఈశ్వరుఁడు చిత్ర గుప్తునిచే సమకూర్చ బడిన జీవులకర్మఫల ములను ఎవరివి వారికి నొసంగుచుండును. ఉచ్ఛనీచవర్ణములలో జన్మించుట వారివారి కర్మానుసారమే జరుగును. అందు ఈశ్వరుని ప్రమేయ మేమియును లేదు. ఇదియే జీవుల విషయమున నీశ్వరుఁడు గావించు గుణకర్మ విభాగము.

ఇది శ్రీకృష్ణభగవానుని చాతుర్వర్ణ్య సృష్టికి ఆధార మైన పదార్థము. ఇట్లు చెప్పుచునే ఆయన వినస్వర మైన యీసృష్టి తో తనకు సంబంధము లేదని, తాను యథార్థముగా ఎల్లప్పుడును అవ్యయుడ నని ప్రకటించుచున్నాఁడు.

సుమారు ఆరు శతాబ్దములవరకు చోళ రాజులు దక్షిణాపీఠభూమిలోని కొన్ని భాగ ములను పాలించినప్పుడు కూడ ఈవర్ణవ్యవస్థ చక్కగానుండి సమాజములోని యాయా యంతస్తులవారు తమతమ వృత్తులను చక్కఁగా నెరవేర్చుకొనుచు భిన్నమతము లకు జెందినవారితోకూడ సామరస్యముతో శాంతితో జీవించిరి. బలిద్వీపమున నేఁడు కూడ నాలుగు వర్ణములవా రున్నారు. అయినను ఆదేశవాసులలో ఇంకను సామరస్య మున్నది.

ప్రజాతంత్ర మైన భారతరాజ్యాంగమున ఇప్పుడు హిందువుల మైన మనము — లేక భారతీయులము అందఱమును — వర్ణము, మతవిశ్వాసము, శరీరముయొక్క రంగు, సంపద మొదలగు వానితో సంబంధము లేకుండ ఐకమత్యమును పొందుట యెట్లు, అనునదియే ప్రస్తుత మైనప్రశ్న. సజీవమైన విశ్వాస ముతో ప్రతి వ్యక్తియు ఉన్నతతరము లైన యాశయములను సాధించుటయే లక్ష్యముగా పురోగమింప వలయును.

గతమును విస్మరించి, జరిగిన యపకారము లనుక్షమించి, జ్ఞానహీనమును, అమాయికము ను అయిన సమాజమునకును, ఈశ్వరునకును

సేవకుల దళముగా మనము స్పర్థలకు స్వస్తి చెప్పి సమరసభావముతో జీవింపఁ బూనుట మేలు. ఆచారమర్యాదలవిషయమున పట్టుఁ బట్ట వద్దు. శీలమును కాపాడుకొనుఁడు. పెద్దలను గౌరవింపుఁడు. అధికారపదవులకు పరుగులు పెట్టవద్దు. మనుష్యులలో భేదము లుండనే యుండును. ఇతరుల దృక్పథమును గ్రహించుటకు ప్రయత్నింపుఁడు. అభిప్రాయ భేదములను అన్నింటిని తొలఁగించుకొనుఁడు. పైకి కన్పించుచున్న భేదములకు నడుమ నున్న యథార్థ మైన యేకత్వమును గుర్తింపుఁడు.

పక్షపాతరహిత మైన మనస్సుతో ప్రాచ్య పాశ్చాత్య తత్త్వశాస్త్రములను అధ్యయన మొనర్చినచో, అది ప్రతివ్యక్తికిని ఉన్నత తరము లైన యాశయములను సిద్ధింపఁ జేసికొనుటకు ఉపకరింపఁ గలదు.

ఆధ్యాత్మిక విషయములలో, ఐహిక విషయములందును మనకు మార్గదర్శకము, పవిత్రమును అయిన భగవద్గీతను పురుషులు, స్త్రీలును అభ్యసించినచో మనుష్యులలో ఒక రొకరికి మధ్యనున్న యభిప్రాయ భేదము లన్నియు తొలఁగిపోయి మేలు కలుగును.

పరమాత్మను సాక్షాత్కరింపఁ జేసికొనుటయే ప్రతివ్యక్తికిని జీవితలక్ష్యమై యుండవలయును. కావున ఆత్మ, పరమాత్మ, జగత్తు పరస్పరము ఎట్లు సమన్వితములై సంబద్ధములై యున్నవో తెలిసికొనుట ఆవశ్యకము.



ద్వితీయ పరిచ్ఛేదము

# వ్యక్తియొక్క లక్ష్యము

అనేక విధములైన యుద్దేశములతో ప్రయోజనములతో పలువురు సాంఘికములు, రాజకీయములు, ఆర్థికములు, కళాత్మకములు, ధార్మికములు మొదలుగ భిన్నములైన లక్ష్యములను సాధింపఁ బూనుకొనుచుందురు. ఒక్కొక్కప్పుడు ఆ లక్ష్యముల ప్రయోజనములను సాధించుటకై యీ వ్యక్తులు సంఘములుగా సమాజములుగా కూడుకొనుచుందురు. జీవితమున తా ముద్దేశించిన ప్రాథమికములైన లక్ష్యములను వ్యక్తీకరించుటకై వారు తమ కార్యక్రమములను నియమించుకొనుచుందురు. ప్రధానమైన జీవిత లక్ష్యమునకు తక్కిన వన్నియు అంగములుగా నొనర్చుచు ప్రతి వ్యక్తియు తన జీవితమును స్వాధీనమందుంచుకొనుటకు ప్రయత్నించును. జీవితమున కొక లక్ష్యమే లేకపోయినచో వ్యక్తియొక్క ప్రయత్నములు, సంఘర్షణములును

అర్థరహితము లగును. జీవితమును గూర్చి ప్రపంచమునుగూర్చి వ్యక్తికిఁ గల దృక్పథమును ప్రభావిత మొనర్చునట్టి యాతని యుదాత్త లక్ష్యములపైనాధారపడియే వాని యొక్క ఆచరణము, భావన, ఆలోచనము, విమర్శనమును ఏర్పడుచుండును. సాధారణముగా ప్రతివ్యక్తి యొక్క జీవితలక్ష్యము కేవలము ఐహికమో లేక ఆధ్యాత్మికమో అయియుండును. ఇది చాలవఱకు అతఁడు మెలంగుచున్న సమాజము మీఁద, జన్మనిచ్చిన కుటుంబముమీఁద, పొందుచున్న విద్యమీఁద, అలవఱచుకొన్న శీలముమీఁదను ఆధారపడియుండును.

మానవుల యీ లక్ష్యములను ధార్మికములు, సుఖప్రధానములు అను రెండు సముదాయములుగా విభజింప వచ్చును. ధార్మికమైన లక్ష్యము దేవుని కనుఁగొనుటకో లేక ఆత్మతత్త్వమును విచారించుటకో లేక ఆత్మకు దేవునకు ప్రపంచమునకుఁ గల సంబంధమును తెలిసికొనుటకో మానవుని ఉత్తేజితుని గావించును. ఆ విధముగా అతఁడు ఆత్మసాక్షాత్కారమును ఉద్దేశించి తన యాలోచనమును, ఆచరణమును నడుపుకొనుటకు ప్రయత్నించును. వైరస్య మధ్యమున సామరస్యమును, భేదముల నడుమ ఏకత్వమును గుర్తించుటయే ఆతని ప్రముఖ ప్రయత్నమై యుండును. సుఖప్రధానమైన లక్ష్యము ఇతరవిషయము లన్నింటికన్నను ఈ లోకములోని భోగముల పైననే అధికమగు శ్రద్ధను కలిగించును. ఈ దృక్పథము ఐహిక ప్రయోజనాత్మకము అర్థపరాయణమును అయిన తత్త్వమునకు ప్రాముఖ్యము నొసంగి ఈ ప్రపంచమున ఇంద్రియసుఖముయొక్క పరమావధిని పొంద వలయునని వాంఛించును. మానవుఁడు తన్ను కేవల మొక భౌతికప్రాణినిగా మాత్రమే భావించుచున్నచో, శరీరేంద్రియ సుఖములను అత్యంతముగ అభిలషించుచున్నచో అతఁడు సహజముగా భోగపరాయణమైన లక్ష్యము ననుసరించుటకే ఉన్ముఖుఁడగును. అప్పు డాతఁడు అధికారముకొఱకు, భోగములకొఱకు పిచ్చివాఁ డగును. దేశములు యుద్ధములకు దిగుటకు ఇదియే కారణము. శక్తిమంతములైన జాతులు ఎవరిని లెక్క పెట్టవు; రక్తపాతమునకు వెఱపు నొందవు. కావున అవి యితర జాతులను స్వలాభమునకై వినియోగించుకొనుటకు ఆరంభించును. సుఖములయందు కన్న ఆత్మతత్త్వమునందు అధిక శ్రద్ధను కలిగియున్న మానవుఁడు సహజముగా ధార్మికము లేక ఆధ్యాత్మికము అయిన లక్ష్యమును అనుసరించుటకే ఉన్ముఖుఁడగును. అట్టి వ్యక్తులతో రూపొందిన సమాజములు స్వార్థరాహిత్యము, ప్రేమ, సన్న్యాసము అను లక్ష్యముల మార్గమునే యనుసరించును.

సృష్టియందలి నిత్యసత్యములను భారతదేశ మెప్పుడును ఉద్ఘాటించుచునే యున్నది. భారతదేశము కర్మభూమి. వ్యక్తికి కలుగు శుభముకాని అశుభముకాని యీ జీవితములో అతఁడు కావించుచున్న ప్రయత్నములపై ఎట్లు ఆధారపడియున్నవో, అట్లే అతఁడు పూర్వజన్మలో కాని అనేకజన్మలలో కాని కావించిన సుకృతదుష్కృతములపై ఆధారపడియుండును. సాధారణముగా భారతదేశములో ప్రతివ్యక్తియు జన్మసిద్ధముగనే తాత్త్వికుఁడై యుండును. పరదేశీయుల పాలనము మొదలగు కారణములచేత ప్రాచీన భారతదేశమునకు, నేటి భారతదేశమునకును మనకు కొంత భేదము కన్పించుచుండును.

పరదేశీయుల ప్రభావములకు లోనైయున్నను భారతదేశము తన సనాతనధర్మమును ఎప్పుడును విస్మరింపదు. మానవుఁడు పరమేశ్వరుని గూర్చి లేక పరమాత్మనుగూర్చి ఆలోచించుటకు ముందు ప్రపంచములో, ముఖ్యముగా తన సమాజమునందు, తనకుఁగల స్థానమెట్టిదో గుర్తింప వలయును. సాధారణముగా ఈలక్ష్యమును గుర్తింపకయే చాల మంది పరమాత్మనుగూర్చి, అద్వయబ్రహ్మమునుగూర్చి ఉపన్యాసముల నొసంగుటకు ఆరంభించుచుందురు. దీనిని తప్పక పరిహరింపవలయును. తానొక సాంఘిక జీవి యని మానవుఁడు గ్రహింపవలయును. తన పొరుగువానికి ఎట్టి కష్టము కలుగకుండునట్లుగా అతఁడు ప్రవర్తించుచుండవలయును. "నిన్ను నీ వెట్లు ప్రేమించుచున్నావో నీపొరుగువానిని అట్లే ప్రేమింపుము" అన్న యేసుక్రీస్తు యొక్క మాటలను మనము స్మరింపవలసి యున్నది. అప్పుడు, "నన్ను నేను ప్రేమించుకొనుచున్నట్లుగా నా పొరుగువాని నేల ప్రేమింపవలయును ?" అని ఎవఁడైనను అడుగవలసియే యుండును. మీ రిద్దఱును ఒక్కటే కావున నీవు నిన్ను ప్రేమించుచున్నట్లే నీపొరుగువానిని ప్రేమింపవలయును. మనము ఒకరొకరితో సాంఘికముగా, ఆర్థికముగా, రాజకీయముగా, ధార్మికముగా సంబద్ధులమై యుండుట గమనింపవచ్చును. ఒకరి కేది మంచిది యగునో అది యందఱకును మంచిదే యగును. ఒకరి కేది చెడ్డది యగునో అది అందఱకును చెడ్డదే యగును. కావున మనుష్యునకు మనుష్యునకు, మనుష్యునకు ప్రపంచమునకు, ప్రపంచమునకు ఈశ్వరునకును సంబంధ మున్నది. జీవాత్మయొక్క యథార్థమైన యంతస్సును తెలిసికొనిననే తప్ప మనము మన లక్ష్యములను సాధింపఁజాలము. ఉన్నత తరమైన తన లక్ష్యమును సాధించులోపల వ్యక్తి అనేక విధములైన సంఘర్షణములను ఎదుర్కొనవలసి యుండును.

*

### తృతీయ పరిచ్ఛేదము

# వ్యక్తి సంఘర్షణము

ఈ ప్రపంచమునకు ఉనికి ఎట్లు ఏర్పడినది? దీని నెవఁడు సృష్టించెను? ఎవఁడైనను ఈ ప్రపంచము నెందులకు సృష్టించెను? సృష్టి కాధారమైన పదార్థమేది? సృష్టికర్త యెవఁడు? ఈ ప్రపంచమునుగూర్చి మనకు కలుగుచున్న యనుభవ మెట్టిది? మనము నిజముగా ప్రపంచమునుగూర్చి తెలిసికొనవలయునన్నచో ఈప్రశ్న లన్నియు సమంజసములే. మనము ప్రపంచము సత్యమని నమ్ముచున్నాము. మనము నిత్యులమైనట్లే ఈ ప్రపంచమున అన్నిపనులు చేయుచున్నాము. ఈ విశ్వమును గూర్చి మనకు

కలుగుచున్న యనుభవముతో తృప్తి నొందుటకు మన మెప్పుడును యత్నించుచునే యున్నాము. కొన్ని సమయములలో మహితములైన మన యాశలు ఫలింపనప్పుడు మనము నిర్వేదము నొందుచుందుము. ఈ విశ్వము ఎంత యథార్థముగా కన్పించుచున్నను, ఇదియే పరమమైన సత్యము అను విశ్వాసమును కలిగింపఁజాల కున్నది. ఈ విశ్వమంతయు జీవన్మరణములు, చీఁకటి వెలుఁగులు, వృద్ధి క్షీణతలు, వ్యవస్థావ్యవస్థలు. సుఖ దుఃఖములు, శుభాశుభములు ధర్మాధర్మములు మొదలుగా కలగూరగంపగా నుండు విరుద్ధాంశములతో, సూక్ష్మ సంఘటనములతో కూడి యున్నది. ఇంద్రియముల వలన కలుగు ననుభవమునందు అసంతృప్తి కలిగిననే తప్ప, మానవుఁడు తనకు కలుగుచున్న యనుభవము యథార్థమా, కాదా, అని ప్రశ్నించుకొనుచు, తన మత ధర్మమును గూర్చి విచారించుచు తత్త్వవిషయములను గూర్చి ఆలోచింపఁడు. మానవుఁడెప్పుడును సర్వోన్నతమైన వస్తువులను గూర్చి భావించుచుండునేకాని, దానిని అందుకొనఁ జాలనని నిరాశనొందుచుండును. ఎప్పుడును భంగపడక శాశ్వతముగా నిలిచి యుండు వస్తువు కొరకై అతఁడు ఆశపడుచుండును. మరణము, జీర్ణత్వము మార్పు ఉండరాదు. ఆతనికన్న భిన్నమైన యితర పదార్థముపై వానిసుఖ మెల్లప్పుడును ఆధారపడి యుండును. ఒకప్పటికి అతఁడు ఈ పారతంత్ర్యమును ద్వేషింప నారంభించును. అప్పు డాతఁడు ద్వంద్వములకు, సాపేక్షతకు, పరతంత్రమునకు అతీతముగా నుండవలయునని యభిలషించును, పరిమితులు, నియమములు లేకుండ స్వేచ్ఛగా ఆనందింపవలయు ననుట మానవునకు సహజమైన కోరిక. వ్యక్తికి స్వాతంత్ర్యము తగునా అని ఎవ్వరును ప్రశ్నింపరాదు. ఒక్కొక్కప్పుడు ఒకానొకఁడు పరిపూర్ణము, ఆనందమయమునైన స్థితిని అందుకోవలయునని ఆకాంక్షించును. కాని యింద్రియములు ఆ స్థితికి చేరనీయక అతనిని నిరోధించును. అప్పు డాతఁడు ఆ పరతత్త్వమునుగూర్చి భావించును, లేదా అట్టిదేదో ఉన్నదని అనుకొనును, లేదా ఊహించును. పరతత్త్వముయొక్క ప్రత్యక్షానుభవము అతని యూహలకు, భావములకు అతీతమై యుండును. అతని యనుభవము లన్నియు వినశ్వరములు, సవికారములు, సాంతములు, నియతములును అయిన అనేక పదార్థములకు సంబంధించి యుండునే కాని అవినాశ్యము, నిర్వికారము, అనంతము, అనియతమును అయిన వస్తువునకు సంబంధించి ఎప్పుడును ఉండవు. ఆ పరతత్త్వము ఆతని దృష్టిపథమునకు అతీతమైనట్లే గోచరించును. ఆ కారణము వలన అతఁడు పరమాత్మను అన్వేషించునప్పుడు ఎన్నో సంశయములకు, సంఘర్షణములకు గుఱియగును. ఈశ్వరుని విశ్వసించువారు, ఈశ్వరుని నమ్మినను శాస్త్రమును నమ్మనివారును, ఆ పరమేశ్వరుఁడు మన యనుభవమున గోచరమగుచున్న ఈ ప్రపంచము కన్నభిన్నుఁడై యున్నాఁడని విశ్వసింతురు. అజ్ఞేయవాదులు ఈ ప్రపంచమునందు అంతర్గతముగా పరతత్త్వ మొకటి వ్యాపించి యున్నదని గుర్తించుచున్నను, అది అజ్ఞాతము, అజ్ఞేయము అని చెప్పుదురు. వివిధ నామరూపాత్మకమైన యీ విశ్వమే సగ

తత్త్వమని జగదీశ్వరవాదులు తలంతురు. ప్రత్యక్షప్రమాణవాదులు దాని నెప్పుడును లెక్కపెట్టనే లేదు. నాస్తికులు పరమాత్మయే లేఁడందురు. వేదాంతులు మాత్రమే ఆ పరతత్త్వము ఏకమని, అద్వితీయమని వివిధ నామరూపాత్మకమైన యీ విశ్వము ఉన్నట్లుగా కన్పించుచున్నదే కాని యథార్థముగా దానికి అస్తిత్వము లేదని నొక్కి వక్కాణించుచున్నారు. పాశ్చాత్య దేశములలో తఱచుగా జరుగుచున్నట్లు వేదాంతదర్శనమును జగదీశ్వరవాదముగా భ్రమింపరాదు.

వివేకానందస్వామి యిట్లు చెప్పెను: "ఈ విశ్వము సత్యముగాదని వేదాంతి చెప్పును. అది ఉన్నట్లు మాత్రమే కన్పించుచున్నది. అజ్ఞానద్వారమున చూడఁబడుచున్న భగవంతుఁడే ప్రకృతి. భగవంతుడు ప్రకృతిగా లేక ప్రపంచముగా అయ్యెనని జగదీశ్వరవాదులు చెప్పుదురు. భగవంతుఁడు ఈ ప్రపంచముగా తోఁచుచున్నాఁడే కాని ఆయన ఈ ప్రపంచముగా కాలేదు అని అద్వైతులు నొక్కి వక్కాణించుచున్నారు." ('ఈశ్వరప్రేరిత ప్రసంగములు'- "The Inspired Talks," C. W. VII. P. 48) అశాశ్వతములలో శాశ్వతమైన దానిని, పరిమితములలో అపరిమితమైన దానిని, అసంపూర్ణములలో సంపూర్ణమైన దానిని అన్వేషించుటకు స్వభావము ఉన్ముఖమైయుండు ననుట ప్రతివ్యక్తికి అనుభవమునం దున్నవిషయమే. సహజమైన యీ ప్రేరణమే పరమాత్మకు అభిముఖముగా పథము నేర్పరచుచున్నది. వేదములే సత్యమునకు సరియైన మార్గమును చూపుచున్నవి. అభ్యుదయ పతనములు, సుఖదుఃఖములు, ఆశా నిరాశలు మొదలగు వానితో నేర్పడుచున్న జనన మరణ చక్రము నుండి చేతనుఁడైన వ్యక్తి యీ మార్గము వలననే తప్పించుకొనఁ గలఁడు. ఏకారణము చేతనైనను సత్యమును అన్వేషించువాఁడు పైనచెప్పిన మార్గమును అందుకొనకపోయినచో జీవన్మరణములు, వృద్ధి క్షయములు, శ్రేయో వ్యసనములు, సంతోష దైన్యములు మొదలగు వాని మధ్యముననే యుండును. ప్రపంచము భేదాత్మకముగా నున్నది. "ప్రపంచ మనఁగా హెచ్చుతగ్గులు; లేక హెచ్చుతగ్గు లనఁగా ప్రపంచము" అన్న మాట. సౌందర్య వైరూప్యములు, కలిమి లేములు, లాభనష్టములు, మిత్రత్వశత్రుత్వములు, రాగద్వేషములు, మానావమానములు మొదలగు విరుద్ధ విషయములవలన మానవుఁ డెప్పుడును తీవ్రముగ చలించుచునే యుండును. మానవుని బంధనమునకు అతని రాగద్వేషములే నిజమైన కారణము. పరమాత్మను అన్వేషించుచు సంసారము నుండి ముక్తిని కోరువాఁడు ప్రపంచమునందు వ్యవహరించుచున్నను, ప్రపంచమును, అందలి తన యునికిని సత్యముగా తలంపఁడు. కావున అతడు ప్రపంచమునకు సంబంధింపఁడు.

ఏకత్వమును కనుగొనుటకు ముందు మనము వైవిధ్యమును పరిశీలింపవలసి యున్నది. మనము వైవిధ్యముతో ఏకీభవింపరాదు. బహుత్వమును మన స్వరూపమునుగా తలంపరాదు. అప్పుడు మనము భేదముల నడుమ అభిన్నత్వమును, బహుత్వమునందు ఏకత్వమును, విషమములలో సమత్వమును, అసంబద్ధములుగా కన్పించువానియందు పరస్పర సంబంధమును చూడఁగలుగుదుము. విజ్ఞానమునందు ఎల్లప్పుడును వర్గీకరణము, సాధారణీకరణమును ఇమిడి

యుండును. సర్వశాస్త్రములును, సకల విజ్ఞానశాఖలును తమ తమ విషయములలో ఏకత్వములను అన్వేషించుచున్నవి. సక్రమమైన విజ్ఞానమే శాస్త్రము అని చెప్పఁదగి యుండును. సరూపత్వమును నిరూపించు సిద్ధాంతములే ప్రకృతి ధర్మములు. శాస్త్రములకెల్ల శాస్త్రముగా తత్త్వశాస్త్రము ప్రసిద్ధమై యున్నది. కావున అదియే ప్రపంచము యొక్క యథార్థమైన స్వభావమును గుర్తింపఁగలదు.

భౌతికశాస్త్రము ప్రపంచము యొక్క యథార్థ స్వభావమును మనకు ఎప్పుడును తెలుపఁజాలదు. అది ముందుకు సాగుచునే యున్నది. అది యింకను తుది గమ్యమును చేరుకొనలేదు. దాని పరిమితులు దానికున్నవి. "శాస్త్రముచేత చూడఁబడుచున్నది ప్రపంచము యొక్క యథార్థస్థితి కాదు" అని జోసెఫ్ నీడమ్ 'సంశయాళువైన జీవశాస్త్రజ్ఞుఁడు' ('The Sceptical Biologist', Page 245) అను గ్రంథమున చెప్పుచున్నాఁడు. అనఁగా ప్రపంచమే లేదని యర్థము కాదు. శాస్త్రము అసత్యమనుట సరికాదు. కన్పించుచున్నంతవఱకు ప్రపంచ మున్నది. అనఁగా వంధ్యాపుత్రుఁడు, కుందేటికొమ్ము అనువానివలె అది అసలే లేనిది కాదు. సకల వ్యవహారమున కది సత్యమే. పరమాత్మయొక్క సాక్షాత్కారము కలిగినప్పుడు మాత్రమే అది అసత్యమగును.

తాను అనుభవించుచున్న సాధారణ సుఖములను వదలుకొనఁజాలని స్థితియందున్నను ప్రతివ్యక్తియు అద్వితీయబ్రహ్మమును గూర్చి మాటాడుటకు ఎల్లప్పుడు ఉన్ముఖుఁడగుచున్నాఁడు. ప్రతివ్యక్తియు తన హక్కులను గూర్చి, విశేషాధికారములను గూర్చి పట్టుఁబట్టునే కాని తన విధులను, బాధ్యతలను గుర్తింపఁడు. ప్రతివ్యక్తియు సమాజమున తన స్థానమును గుర్తింపవలయును. విశ్వాసమునందు ఏ ప్రాణికిని తన వలన సాధ్యమైనంత వఱకు హాని కలుగకుండునట్లు వర్తింపవలయును.

జీవితములోని యన్ని రంగములలో పవిత్రుఁడుగా ఎట్లుండవలయు నన్న విషయమును మతమే మానవునకు బోధించుచున్నది. విపత్తులందు అదియే మనకు మార్గమును చూపుచున్నది. అదియే తత్త్వాన్వేషణ మార్గమును ఏర్పఱచుచున్నది. తత్త్వము (వేదాంతము) మానవునకు తన్నుఁగూర్చి చెప్పునట్టి శాస్త్రము. నేఁడు సమాజమునందలి ప్రధాన వ్యక్తులు (నాయకులు) రాజకీయములలో చాల ముఖ్యపాత్రను వహించుచున్నారు. కావున మతము, తత్త్వశాస్త్రము, రాజకీయములు అనువానికిఁ గల సంబంధమును గమనింతము.

*

చతుర్థ పరిచ్ఛేదము

# మతము, వేదాంతము, రాజకీయములు

## (౧) మతమునకు, వేదాంతమునకు తారతమ్యము

మతమును, తత్త్వశాస్త్రమును భిన్నముగా భావించుట నేడు అలవాటుగా నున్నది. పాశ్చాత్య తత్త్వశాస్త్రమునందు ఈ రెండును భిన్నవిషయములుగానే భావింపఁబడుచున్నవి. పూజా విశ్వాసముల విధానము మత మని చెప్పఁబడుచున్నది. ప్రపంచము యొక్క గతచరిత్ర యందు మతము అను పదము మిగుల విశాలమైన యర్థమున నుపయోగింపఁబడినది. నేఁడు ప్రతి విషయము నందును గ్రుడ్డినమ్మకమును కలిగియుండుట మతముగా, సహేతుకముగా పరీక్షింపఁబడి నిరూపింపఁబడనంత వఱకును ఏ విషయమును నమ్మకుండుట తత్త్వశాస్త్రము యొక్క పద్ధతిగా చెప్పఁబడుచున్నది. మతము కన్న అధికముగా తత్త్వశాస్త్రము శాస్త్రీయముగ నుండు నని చెప్పఁబడుచున్నది. మతము ఎల్లప్పుడును సంప్రదాయములను, ఆచారములను గౌరవించుచుండును. అవి విమర్శింపఁబడి నిరూపింపఁబడిననేతప్ప వానిని ప్రమాణముగా స్వీకరించుటకు తత్త్వశాస్త్ర మంగీకరింపదు. జీవితము యొక్క గాఢ సమస్యకు, విశ్వము యొక్క గూఢ వైచిత్ర్యమునకు సమాధానము మతము వలన లభింపదని భావింపఁబడుచున్నది. విమర్శనాత్మకము, సృజనాత్మకము నైన యాలోచనతో తత్త్వశాస్త్రము, ఆత్మకు సంబంధించి కాని, విశ్వమునకు సంబంధించి కాని ఏ చిక్కు విషయమునం దైనను ప్రసరింపఁగలదు. అర్థము తెలిసికొనుచు కొన్నిసమయములలో, అర్థము తెలియకయే కొన్నిసమయములందును ప్రాచీన గ్రంథములను చిలుకపలుకులువలె వల్లించుచుండుటయే మతమని విమర్శించుచున్నారు. మహా పండితులయొక్క ఆశయములను లేక అభిప్రాయములను బలపఱచునట్టి వాదములను జ్ఞప్తియం దుంచుకొనుచు, వానిని నమ్ముటయే జరుగుచున్నది. కాని దానివలన నెట్టి ప్రయోజనము కలుగుట లేదు.

బోధపూర్వకమైన విశ్వాసము ఎవనికి ఎంత ఉండునో దానినిబట్టి ఆ వ్యక్తికి మతము నెడలఁ గల దృక్పథము నిర్ణయింపఁబడుచున్నది. సంప్రదాయములు, ఆచారములు మతము నందలి విశ్వాసమును స్థిర మొనర్చుటకు చాలవఱకు దోహద మొనర్చుచున్నవి. వీని యన్నింటికన్నను వ్యక్తిని మతధర్మపరాయణుని గావించుటలో పరిసరముల ప్రభావము ప్రముఖపాత్రను వహించుచున్నది. మొట్టమొదట ప్రతివ్యక్తియు ఇతర వ్యక్తులకు సంబంధించి యున్న తన స్థితిని గుర్తుంచుకొనవలసియున్నది. తన్ను ప్రేమించుచున్నట్లే తన పొరుగువానిని కూడ ప్రేమింప

వలయు నని మతము బోధించుచున్నది. అట్టి సంబంధము నతఁడు ఏర్పఱచుకొనఁ గలిగినచో నెమ్మదిగా నుండును.

నిరాశలు ఎదురైనప్పుడెల్ల మానవుఁడు సకల విషయములలో అనుస్యూతమై యున్న తన విశ్వాసమునే సంశయింప మొదలిడును.

కొన్ని యుదాహరణములను గైకొని మతమునకును, తత్త్వశాస్త్రమునకును గల సంబంధమును అర్థము చేసికొనుటకు ప్రయత్నింతము. ఈ విశ్వమున సాధ్యమైనంత వఱకు సుఖములను అనుభవింపవలయునని ప్రతివ్యక్తియు కోరుకొనుచున్నాఁడు. సంపన్నుఁడుగా జన్మించినవాఁడు తన సుఖమునకై దేనినైనను పొందఁగలిగియుండును. కాని పేదవాఁడు డబ్బు లేకపోవుటచే దేనిని పొందఁ జాలఁడు. కావున అతఁడు ధనముయొక్క విలువను గ్రహించుచున్నాఁడు. మానవునకు సుఖమును కలిగించునది ధనమే. అందువలన అతఁడు భగవంతుని ప్రార్థించుచు సాధ్యములైన సకలమార్గములలో డబ్బు సంపాదించుటకై భగీరథ ప్రయత్నములు చేయును. సామాన్యములైన యవసరములు తీరిన పిమ్మట అతఁడు పై సుఖములను గూర్చి ఆలోచించును. ఖర్చుపెట్టుట మొదలిడినంతనే, అతఁడు సంపాదించిన మూలధనము తఱిగిపోవును. కుటుంబములోని సభ్యుల సంఖ్యయు పెరుగును. అప్పుడు డబ్బును మిగిల్చి కూడఁబెట్టవలయు నను సహజ ప్రేరణము అతని మనస్సునందు ఉదయించును.

వెంటనే అతఁడు ముందు కలుగఁబోవు నక్కఱల కొఱకై డబ్బును మిగుల్చుకొనుటకు మార్గములను, ఉపాయములను అన్వేషించును. అప్పుడు డబ్బుకొఱకై సుఖములను త్యాగ మొనర్పవలయునా లేదా అను సంఘర్షణము సంభవించును. చిట్టచివరకు సుఖములమీఁదకన్న డబ్బుమీఁదనే ప్రేమ అధికమగును. డబ్బునకు సంబంధించినంతవఱకు మితమన్నది యుండఁ జాలదు. తన సుఖములనే మఱచిపోయి అతఁడు కూడఁబెట్టిన ధన సంచయములను తన తరువాత తన వారసులకు అందిచ్చుటకై ధనమును సంపాదించుచునే యుండును.

మానవుఁడు సుఖముల కొఱకై డబ్బు సంపాదింప మొదలుపెట్టెను, కాలక్రమమున ఆతనికి డబ్బుమీఁదనే ప్రేమ అధికమై సుఖములను వదలుకొనుచు తన దృష్టిని డబ్బును కూడఁబెట్టుటయందే కేంద్రీకరించుచున్నాఁడన్న ముఖ్యమైన యంశమును మన మీ సందర్భమున గమనింపవలసి యున్నది. మఱియొక యుదాహరణమును గైకొని రెండింటిని పోల్చి పరిశీలింతము.

ఒకఁడు అనారోగ్యముచేత బాధపడుచున్నాఁ డనుకొనుము. చికిత్సకొఱకై వైద్యునియొద్దకు పోవుటయే ఆతఁడు మొదట చేయు పని. వెంటనే వానికి నెమ్మది కలుగకున్నచో ఆతఁడు వివిధశాఖలకు సంబంధించిన పెక్కుమంది వైద్యుల యొద్దకు ఆరోగ్యము నొందవలయునని పోవుట సహజము. అప్పుడు కూడ అతని ప్రయత్నములు ఫలింపనిచో ఏమి చేయవలయునో తెలియక అతఁడు నిర్వేదము నొందును. తనకు తానుగాఁ గాని, హితుల ప్రేరణముచేఁ గాని అతఁడు ఆరోగ్యముకొఱకు భగవంతుని గూర్చి చింతింపవలసి వచ్చును. అప్పుడతఁడు జపములు మొదలగునవి చేయును. వ్యాధి నయమైనచో తిరుపతి వేంకటేశ్వరస్వామివారి యొద్దకుఁ బోయి పూజింతు నని

అతఁడు మ్రొక్కుకొనును. వెంటనే అతనికి వ్యాధి పోయి ఆరోగ్యము కలుగుచో అతనికి భగవంతుని యందు విశ్వాసము వృద్ధి నొందును. తరువాత కష్టము కలిగినప్పు డెల్ల అతఁడు అనేకవిధముల భగవంతుని ప్రార్థించుచు చిక్కులలో నుండి బయట పడుచుండును. కాని ఆ చిక్కులు ఒకటి తర్వాత నింకొకటి కలుగుచు మఱల మఱల బాధలకు గుఱియగుచుండుట చేత భగవంతుని వలన తాను పొందుచున్న యీ సుఖములు అశాశ్వతము లని అతఁడు కాలక్రమమున గ్రహించును. అందువలన తాను నిరంతరము సుఖముగా నుండుటకై ఆ భగవంతునే పొందఁగోరును. ధనమునే కోరువాఁడు ఎట్లు సుఖములను వదలుకొనుచున్నాఁడో, అట్లే ఇతఁడును అశాశ్వతములైన సుఖము లను వదలి శాశ్వతముగా సుఖముతో జీవించుటకొఱకై భగవంతునే పొందఁ గోరును.

పైన ప్రస్తావింపఁబడిన విషయములు మతము యొక్క పరిధిలోనివి. మత మన్నది యంతయు అంధవిశ్వాసమే యని విమర్శించుట నేఁడు పరిపాటిగా నున్నది. విశ్వాసమును అణఁచివేయరాదు. "ఇంక మనము ఆశించుచున్న విషయములకు సారభూతమైనదియు (Substance), మనకు కన్పించని వానికి నిదర్శన మైనదియు విశ్వా సమే" (హెబ్రూలు, Hebrews, Ch. II, Verse I). కావున విశ్వాసము వలననే మనము మన లక్ష్యములను సాధింపఁగలుగుచున్నా మని గ్రహింపవచ్చును. శాస్త్రమునందు పెక్కు యంత్రనిర్మాణములలో విశ్వాసమే ప్రారంభ స్థానమై యున్నది. దీని నెప్పుడును నిరాకరించుటకు వీలు లేదు.

జీవితములో సంభవించు నాశాభంగ ముల వలనఁ గూడ వ్యక్తి భగవంతునిగూర్చి, తన్నుగూర్చి, తమకుఁ గల సంబంధమునుగూర్చి తప్పక ఆలోచింపవలసివచ్చును. ఆవిధముగా అతఁడు సహేతుకముగా, విమర్శనాత్మకముగా ఆలోచింపఁగలిగిన సామర్థ్యమును పొందుచు, శాశ్వతమైన సుఖమును పొందవలయు నను నాశతో విశ్వాసముపై ఆధారపడిన యభి ప్రాయములను కూడ సంశయింప నారం భించును.

(బి) వేదాంతశాస్త్రము

వస్తుస్వరూపమును తెలిసికోవలయు నను కోరికతో మనము దేనిని గూర్చి ప్రశ్నింప నారంభించినను, ఆ క్షణమే మనము తత్త్వ శాస్త్రరంగమునఁ బ్రవేశించుచున్నా మన్న మాట. కాఁబట్టి మతము, తత్త్వశాస్త్రము రెండు భిన్నవిషయములని చెప్పుటకు వీలు లేదు. అవి పరస్పరాశ్రితములు. అంతే కాదు. అవి నిజముగా ఒకటే. రెండు కాదు. ఎప్పుడైనను, ఎక్కడైనను మన బుద్ధి మనకు సంతృప్తిని కలిగింపనప్పుడు, హేతువాదము తత్త్వవిరుద్ధములు, అనిశ్చితములు నైన భావముల సీమలో దింపుచున్నప్పుడు మనము సాధారణముగా బుద్ధిపూర్వకముగానే మత ముపై ఆధారపడుచున్నాము. గాఢమైన బాధలో, దుఃఖములో, ఆశాభంగములో భగవంతుని గూర్చిన తలంపే మనకు ఊరటను గలిగించును.

ఏది సత్యమో, ఏది అసత్యమో గుర్తింపఁ గలిగిన సామర్థ్యమే తప్పక శాశ్వతమైన సుఖమును పొందుటకు మార్గమును ఏర్పఱుపఁ గలదు. కావున తత్త్వశాస్త్ర మనఁగా సహేతుకముగా తత్త్వమును గుర్తించుటకు ప్రయత్నించుటయే. సయుక్తికము, సమన్వి

తము, సుసంగతము, సక్రమమును అయిన విశ్వమును గూర్చిన వివరణమును మొత్తము మీఁద మనము హేతువాదము వలననే గ్రహింపఁ గలుగుచున్నాము. సత్యము ఆహ్లాదకరముగా నుండునా లేదా యను నాలోచనయే లేకుండ తత్త్వజ్ఞుఁడు ఎప్పుడును సత్యమునందే శ్రద్ధ వహించుచుండును. అతఁడు తన మనోవికారములను నిగ్రహించుకొనుచు తన వ్యాపారముల నన్నింటిని సత్యమును, న్యాయమును సాక్షాత్కరించుకొనుటకే అభిముఖముగా ప్రవర్తింపఁ జేయును. నిర్దాక్షిణ్యముతో నతఁడు ప్రతి మతవిశ్వాసమును పరీక్షించును. విస్పష్టములు, నిస్సంశయములు నైన సూత్రములు ఆతనికి సత్య మను గమ్యమును చేరుటకు మార్గదర్శకములై యుండును. "అఖిల జ్ఞానమునకు పరమమైన యుత్పత్తి స్థానము, ప్రమాణముల కన్నింటికిని ఆధారము, మూలమును అయినది ప్రత్యక్షానుభవము ఒక్కటే" అని యోగవాసిష్ఠకారుఁడు చక్కఁగా నిర్దేశించి యున్నాఁడు. ప్రకృతి సత్యములను ప్రకృతి పరిశీలనముల వలననే గ్రహింపవలయునని ఫ్రాన్సిస్ బేకన్ చెప్పియున్నాఁడు. కాబట్టి ఈ విశ్వమున మనకుఁ గలుగుచున్న యనుభవము, మన విశ్వాసము అనునవియే తత్త్వమార్గమున ఆరంభ స్థానము. శాశ్వతమైన సుఖమును పొందుటయే హృదయపూర్వకమైన వాంఛయై యున్నది. "భగవంతుని వచనమువలన లోకములు నిర్మింపఁబడినవి అన్న విషయమును మనము విశ్వాస మూలమున అర్థము చేసికొనుచు, మనకు కన్పించుచున్న పదార్థములు మనకు తోఁచుచున్న వస్తువులతో ఏర్పడలేదు అని గ్రహించుచున్నాము" అని బైబిలులో చెప్పఁబడియున్నది. (Hebrews. Ch. II verse 3) భౌతికశాస్త్ర మొసఁగుచున్న జ్ఞానము ఇంద్రియగోచరములైన విషయములకు మాత్రమే సంబంధించియుండును గాని వాని వెనుకనున్న సత్యములకు సంబంధింపదు. "నిరంతరము మార్పు నొందుచు క్షణభంగురములైన యీ జగద్దృశ్యములకు ఆధారముగా మార్పులేనిది, శాశ్వతమైనది ఏదైన కలదా అన్నదే ప్రశ్న. జగద్విధానమునకు కర్త లేక పరిపాలకుఁడు ఎవఁడైన కలఁడా? మరణమునకు పిమ్మట కూడ జీవుని యాత్ర కొనసాగుచుండునా? మరణించిన వారు మరల ఈ ప్రపంచముననే జన్మింతురా? సహేతుకత్వము మార్గదర్శకముగా, చాలవిస్తృతముగా, వివిధాభిప్రాయ గ్రాహకముగా ఏర్పఱుపఁబడెడు తత్త్వశాస్త్రమే ఈ ప్రశ్నల కన్నింటికిని సమాధాన మొసంగఁగలదు. యథార్థము, సంభావ్యము నైన యనుభవము నందలి యంశము లన్నియు ఆ శాస్త్రమునందు ఇమిడి యుండవలయును. భౌతికశాస్త్రమునకు, మతమునకు, వెనుకటి తత్త్వదర్శనములకు సంబంధించిన సకల సిద్ధాంతములకు దాని యందు తగిన స్థానములను ఒసంగవలయును. బి. యల్. ఆత్రేయ: యోగవాసిష్ఠతత్త్వము. ('The Philosophy of the Yogavasisntha', T. P. H., Adyar. 1936. p. 567)

సహజ జ్ఞానము, సమ్యక్పరిశీలనము, సహజసమైన యాలోచనము అనునవి దృశ్యమానమైన జగత్తునుండి సత్యమును గ్రహించుటకు ఆవశ్యక సాధనములు. అంతరంగిక ప్రపంచము యొక్క అనుభవమును విశాలముగా, విస్తృతముగా నొసఁగించునట్టి

నియతమైన క్రమశిక్షణము నొసంగుటయందే మతముయొక్క సారము ఇమిడి యున్నది.

హిందూమతము యొక్క భావన తక్కిన యన్నిమతముల యొక్క భావనకన్న కేవలము భిన్నమైనది. హిందూమతము నందలి యీశ్వరభావన ఇతరమతములలోని యీశ్వరభావన కన్న భిన్నము. జీవుఁడు అనఁగా "తాను" నిత్యుఁడు. ఆతఁడే దేవుని చేతను సృష్టింపఁబడుట లేదు. మన యీశ్వరుఁడు కర్మఫలప్రదాత మాత్రమే. జీవులయొక్క పురాకృతములలోని సత్కర్మలు, దుష్కర్మలు మొదలగువాని ననుసరించి ఫలముల నొసంగు చుండుటయే ఆయన విధి. ఆయనకు ఈ సృష్టియందెప్పుడును కుతూహలము ఉండదు. సృష్టికర్తయగు బ్రహ్మ పూర్వ మెట్లున్నదో ఆ ప్రకారము ననుసరించియే జగత్తును సృష్టించెను. "ధాతా యథాపూర్వ మకల్పయత్." జీవుఁడు స్వతంత్రుఁడైన కర్త. అతఁడు ధర్మమును గాని, అధర్మమును గాని చేయఁగలఁడు. అతఁడు సత్కర్మలను గావించినచో ఈశ్వరుఁ డాతనికి సత్ఫలముల నొసంగును. తాను శాశ్వతుఁడు అని ప్రసిద్ధముగా తెలిసిన విషయమును గూడ మఱచిపోయి శరీరము, భార్య మొదలగువానితో అసత్యముగా తాదాత్మ్యమును పొందుచున్నాఁడు. అసత్యమైన యీ తాదాత్మ్యము లేక అజ్ఞానము అతని బాధలకన్నింటికి కారణము.

కర్మకాండ (పూర్వమీమాంస), జ్ఞానకాండ (ఉత్తరమీమాంస) అని మన వేదములు రెండు భాగములుగా విభజింపఁబడి యున్నవి. ఈ విశ్వవిధానము చక్కఁగా నిర్వహింపఁబడవలయు నన్నచో మనము వేదమతము నందలి కర్మపరముగా ప్రవృత్తి ధర్మమును, సన్న్యాసపరముగా నివృత్తి ధర్మమును అవలంబింపవలసి యున్నది. ప్రవృత్తి ధర్మము వ్యక్తికి ప్రాపంచికమైన యభ్యుదయమునకు నేరుగా మార్గమును చూపును. నివృత్తిధర్మము విముక్తి సూటిగా మార్గమును చూపును.

తాను చేసిన చెడ్డపనికి ఈ జన్మమునందుఁ గాని, పై జన్మమునందుఁ గాని ఫలమును పొందక తప్ప దని తెలిసికొనును. కావున వేదోపదేశము ననుసరించి వర్తించువాఁడు ఇతరునకు ఎట్టి హాని చేయుట కైనను వెఱచును. ఈ లోకమున, పరలోకమున లేదా మఱుజన్మమున అభ్యుదయము నొంద వలయు నన్నచో తన ప్రవృత్తి ధర్మము ఎట్లుండవలయునో తెలిసికొనుటకు అతఁడు ప్రయత్నించును. మానవుఁడు లేక జీవుఁడు తనకు, తన పొరుగువానికిని ఈ లోకమున, పరలోకమున, భవిష్యజ్జన్మలలో కూడ సుఖమును కలిగించునట్టి ధర్మ కార్యములనే ఆచరింప వలయును. అట్టికార్యమే ప్రవృత్తి ధర్మముగా గ్రహింపఁ బడును. ఇది యాతనికే కాక ఇతరులకును ఎల్లప్పుడు అభ్యుదయమును కలిగించు చుండును. అధర్మము నొనర్చువాఁడు ఈ జన్మమునఁ గాని, మఱు జన్మమునఁగాని దుఃఖము ననుభవింపక తప్పదు. సత్కర్మములు జీవుని స్వర్గమునకును, దుష్కర్మములు నరకమునకును చేర్చును.

మానవునకు మానవునకు మధ్య భేదములను సృజింపవలయు ననునభిరుచి సృష్టికర్తకేమియు లేదు. తన చిత్తము వచ్చినట్లుగా, భేదమయముగా ప్రపంచమును సృష్టించు బాధ్యతను ఆయన స్వీకరించి యున్నచో, మానవుని కర్మబద్ధుని గావించుట యుక్తము

గాదు. మానవుఁడట్లు భగవంతునిచే సృష్టింపఁబడుచో వానికి స్వాతంత్ర్యమే యుండదు. కావున విశ్వాతీతుఁడైన యొకానొక యీశ్వరునిచే జీవసృష్టి జరుగుచున్నదను సిద్ధాంతమును హిందూమతమెన్నఁడును అంగీకరింపదు. తక్కిన మతముల కన్నింటికి మన మతమునకుఁగల ముఖ్యభేద మిది. వేదప్రమాణము నవలంబించిన వానికి తన స్థితిని, సమాజమున ఇతర వ్యక్తులతో తనకుఁగల సంబంధము, భగవంతునితో తనకుఁగల సంబంధము మొదలగు విషయములను తెలిసికొనుటకు అవకాశము కలుగును. మరణించిన తరువాత తాను ఎక్కడను ఉండుట సంభవింపదు అని తలంచువానికి బ్రతికి యున్నప్పుడు మంచికి చెడ్డకు, ధర్మమునకు అధర్మమునకు భేదమును పాటింపవలసిన యక్కఱ యుండదు. అప్పుడు మనుష్యునకును జంతువునకును భేదమే మనకుఁగన్పింపదు.

ఈ జీవితమును గూర్చియు, భావి జన్మలను గూర్చియు విరక్తి నొందినవాఁడు వేదము నందలి నివృత్తి ధర్మమును అవలంబించును. సాధన చతుష్టయ సంపత్తి మూలమున నతఁడు యథార్థమైన సన్న్యాస భావమును అలవఱచుకొని మోక్షము నొందును. నిత్యానిత్య వివేకము, ఇహాముత్ర ఫల భోగ విరాగము, శమదయాది షట్క సంపత్తి, ముముక్షుత్వము అనునవి సాధన చతుష్టయముగా ప్రసిద్ధములై యున్నవి. అట్టివాఁడు సంఘమున మెలఁగుచున్నను, ఏ కార్యమునైనఁ జేయుచున్నను మోక్షమును పొందవలయు నను కాంక్షతో వర్తించునే కాని ఫలాపేక్షతో చేయఁడు. వైదికమైన నివృత్తి ధర్మమునకు అదియే ఫలము. జనన మరణ రూపమైన సంచార చక్రమునుండి ఏది మనలను తప్పించునో అదియే నివృత్తి ధర్మము.

అనాదిగా కర్మఫలముల ననుసరించి జీవుఁడు జనన మరణములను పొందుచున్నాఁడు అను ప్రాథమిక సూత్రమును నొక్కి చెప్పవలసిన యావశ్యకత శంకర రామానుజ మధ్వాచార్యుల వారి కాలములందు వారి కంతగ కన్పడలేదు. ఆధునిక నాగరికత ప్రబలుచున్న యీ దినములలో సమాజములో ప్రతివ్యక్తికిని జీవనిత్యత్వమునుగూర్చి బోధించి అది మనస్సునకు పట్టునట్లు చేయుట చాల ఆవశ్యకమై యున్నది.

## రాజకీయములు

ఈ నిత్యత్వభావమును మానవుల కెట్లు అందింపవలయు నన్నదే ప్రశ్న. నేఁటి ప్రపంచ నాగరికత అణ్వాయుధములు మొదలైన విధ్వంసక సాధనములను సృష్టించుటయందు నిమగ్నమై యున్నది. ఈనాఁడు కూడ భారతదేశము తనకు ఆయుధములయందు విశ్వాసము లేదని సగర్వముగా చెప్పుచున్నది. కావున భారతదేశము తన సంస్కృతిని కాపాడుకొనుటలో తక్కిన దేశములకన్న మేలైన స్థితియందున్నది. ప్రాచీనకాలమున భారత దేశములోని రాజులు రాజకీయములతో పాటు ధర్మము నందును శ్రద్ధ వహించెడివారు. రాజనీతి యను శాస్త్రమునకు ప్రాణమును, ఆస్తిని, పరిరక్షించుటయే ప్రాథమిక లక్షణము. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత స్వపరి

పాలనము ఏర్పరుపబడినది. హిందూ దేశము పెక్కు రాష్ట్రములతో ప్రజాతంత్ర రాజ్యముగా నేర్పడినది. మన యువజనుల కిప్పుడు ఎన్నుకొను హక్కు కలదు. మనము నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వము కలిగి యున్నాము. ప్రజాస్వామిక ప్రభుత్వమునందు మతమునకు తగిన స్థానము ఉండవలయును.

అనేక కారణముల వలన మన కిప్పుడు మతసంబంధ రహితమైన ప్రభుత్వ (Secular State) మేర్పడినది. ఏ కారణముల చేత మన కీ ప్రభుత్వ మేర్పడియున్నదో, ఆ కారణములే మతపరత్వమునకు, మత రహిత్వమునకు మధ్యస్థముగ నుండు ప్రభుత్వము అవశ్యకమని చెప్పుటకునూ చాలి యున్నవి. మతరహిత ప్రభుత్వమునందుఁ గాని, స్వపరిపాలనమునందుఁగాని మన దృష్టిని మతమునందుఁగాని, తత్త్వశాస్త్రము నందుఁగాని ప్రసరింపఁజేయ వలసిన యావశ్యకత యేమో పరిశీలింతము. మహాత్ములచే పరిపాలింపఁబడుటయే స్వపరిపాలనము. ప్రజలయందు వివేకవంతులలో శ్రేష్ఠులైనవారు, స్వార్థరహితులు, పరోపకారపరాయణులు అని యెన్నిక నొందిన పెద్దలే ప్రభుత్వ శాసనములను ఏర్పఱుప వలయును. మనుష్యుల హృదయములను కలుపునట్టి మతమునకు ఆధారముగా ఒక ప్రభుత్వ ముండవలయును. రాజకీయపాలన వ్యవస్థకు ముందుగా సార్వజనీనము, శాస్త్రీయము, తత్త్వశాస్త్ర సమ్మతము నైన మతమును నెలకొల్పవలయును. మన హిందూ దేశమున, పరస్పర విరుద్ధములైన మతముల మధ్యలో కూడ, ప్రవృత్తి నివృత్తి ధర్మ ద్వయాత్మకమైన వైదికమతమే, వర్ణముల యొక్క, సంప్రదాయములయొక్క, శరీర వర్ణములయొక్క, జాతులయొక్క భేదములు పైకి ఎన్ని కన్పించుచున్నను ప్రతి వ్యక్తికి సంతృప్తికరముగా యథార్థమైన శాంతిని, అభిన్నత్వమును, ఉత్తమ విధానమును సంపాదింపగలదు.

ప్రజాస్వామిక ప్రభుత్వమున సంపన్నులను, పేదవారిని సమానముగా చూడవలయుననుట యథార్థమే. కాని రాజ్య మెప్పుడు సంపన్నులతో, పేదవారితో కూడియే యుండు నన్న విషయమును కూడ గుర్తింపకుండ నుండరాదు. ప్రతివ్యక్తికిని ప్రభుత్వము సమానావకాశముల నొసంగుటకు యత్నించు నను కొనుఁడు. ఆ ప్రభుత్వమునకు ఎంత ఉదారత యున్నను, ప్రజలలో ప్రతివ్యక్తియు భారత ప్రజాస్వామిక ప్రభుత్వమునకు అధ్యక్షుఁడగుట భౌతికముగా సాధ్యము గాదు. చాలమందిలో ఒకా నొకఁడే అధ్యక్షుఁడగు నవకాశమును పొందఁగలడు. అందులకు అర్హత కలిగిన తక్కిన యభ్యర్థులకు తమ జీవితములలో ఆ పదవిని పొందు నవకాశము లభింపక పోవచ్చును. సమానావకాశములను ఇచ్చునప్పుడు, ఒక కుంటివానికి నృత్యకళను నేర్చుకొను నవకాశమును ఇచ్చెద మనుకొనుఁడు. నృత్య మొనర్చుట భౌతికముగా వానికి అసాధ్యము కావున వాఁ డా యవకాశమును ఎప్పటికిని వినియోగించుకొన లేఁడు. ఆశలను తీర్చుకోవలయు నన్నచో అందులకు తగిన పుణ్యము కూడ వానికి ఉండవలయును. పుణ్యమనఁగా నేమి ? అది దృశ్యమా, లేక అదృశ్యమా ? ఇప్పుడు ఒకనికి సంభవించుచున్న శుభాశుభ సంఘటనములే వాఁడు పూర్వ జన్మలలోఁ గావించిన సుకృతములను గుర్తించుటకు తగిన సాధనములు.

కాలము, సంసారము అనంతములగుటచే మన మతమునందు సమానావకాశము లున్నవని గ్రహింపవలసి యున్నది. గాఢముగ నభిలషించినచో ప్రతివ్యక్తియు తన వంతు వచ్చినప్పుడు సృష్టికర్తయైన ప్రజాపతి కూడ కావచ్చును. నిత్యుఁడు కావున ఒకప్పటి కాతఁడు ప్రజాపతి యగుటకు ఎట్టి యాటంకమును ఉండదు. ఒక జీవితమున తన ప్రయత్నములను ముగింపలేకపోయినచో అతఁడు మఱు జన్మమున కొనసాగించును. సహేతుకముగా ఆలోచింపఁగల మనుష్యునకు ఈ భూమిపై అసాధ్య మేదియును లేదు. ఎవ్వఁడైనను ఉత్కటమైన యిచ్ఛతో, శ్రద్ధతో ప్రయత్నింపవలయునన్నదొక్కటియే యిందు షరతుగా భావింపఁదగి యున్నది. కావున ఏ రాజ్యమందైనను ఒక్క జీవిత కాలమున ప్రతివ్యక్తికి సమానావకాశములను ఇచ్చెద రను నినాదము మిథ్యయే.

పరిపాలన యొక కళ. ప్రతివ్యక్తి ప్రజలను పాలింపఁజాలఁడు. వేదాంతమునకు రాజవిద్య అనుపేరు కూడ కలదు. అది ఉత్తమమైన కళ కూడ. పరిపాలకుఁడు వేదాంతియై యుండవలయును. తన యధికారము శాశ్వతమని తలంపరాదు. "దేశమును పాలించుట కన్న చేపలను పట్టుకొను వాఁడుగా నుండుటయే చాల మేలు" అని మురాత్ అను ఫ్రెంచి తత్త్వవేత్త చెప్పి యున్నాఁడు. పరమేశ్వరునకు, జీవునకు మధ్య ఎట్టి సంబంధమున్నదో అట్టి సంబంధమే ప్రభుత్వమునకు, పాలితులకు మధ్య నుండ వలయును. ఒక్క విద్యుచ్ఛక్తియే పెక్కు బల్బులలో ప్రసరించుచున్నది. కాని బల్బులలోని భేదములను బట్టి ఒక విద్యుచ్ఛక్తియే భిన్నభిన్నముగా కన్పించుచు భావింపఁబడుచున్నది. పాలితులైన ప్రజలను బల్బులతో పోల్చవచ్చును.

ప్రజాస్వామిక ప్రభుత్వమున పాలితులలో కొందఱు దేశములోని పాలితుల కందఱకును ప్రతినిధులనుగా కొంతమందిని ఎన్నుకొందురు. ఎన్నుకొనఁబడిన పాలితులు రాజ్యపాలకులు అగుదురు. ప్రభుత్వము ఏర్పడుట అన్నది, దాని పాటి కదియే పరమప్రయోజనము కాదు. ఒక జాతి ప్రజలయొక్క ధర్మములను అమలు జరుపుటకు అది యొక యేర్పాటు మాత్రమే. కావుననే ప్రభుత్వమును పరమేశ్వరునితో, పాలితుని జీవునితో పోల్చవచ్చును. పైకి ఇద్దఱుగా కన్పించుచున్నను పరమేశ్వరుఁడు, జీవుఁడు ఒకటే. అట్లే ఇద్దఱుగా వ్యవహారము జరుగుచున్నను ప్రభుత్వము, పాలితుఁడు ఒకటే.

"నే నెవఁడను" అను ప్రశ్నయే వేదాంతమునందును, ప్రభుత్వ వ్యవహారమునందును విచారింపఁబడుచున్నది. వేదాంతమునందు ఆత్మ, పరమాత్మ, అనాత్మ అను వానిని గూర్చి పరమాత్మకును, ఆత్మకును అనాత్మకును గల సంబంధమును గూర్చియు, ఆత్మకు ఇతర జీవాత్మలకునుగల సంబంధమును గూర్చియు ఈ విచారణ జరుగుచున్నది. ప్రభుత్వవిషయమునఁ గూడ న్యాయస్థానముల దృష్టిలో, ఆర్థిక పరిస్థితులను బట్టి రాజకీయములైన హక్కుల కొఱకు, సాంఘిక జీవనము నందును ప్రతివ్యక్తియొక్క తాహతు ఎట్టిదో మనము నిర్ణయించుచునే యున్నాము.

వేదములలో మనకు స్వధర్మములును, పరధర్మములును చెప్పఁబడి యున్నవి. జీవునకు సామాన్య ధర్మములును, విశేషధర్మములును కలవు. హిందూమతము ననుసరించి

జంతువులు కూడ జీవులే యని గుర్తింపవలసి యున్నది. కాని ప్రయోజనము కొఱకు అబుద్ధిపూర్వకమైన ప్రవృత్తి జంతువుల యందును, బుద్ధిపూర్వకమైన ప్రవృత్తి మానవులయందును భిన్నముగా నున్నది. మంచిదో, చెడ్డదో మఱియొక జన్మను కలిగించునట్టి కర్మను జంతువు చేయ లేదు. జంతువు జన్మము భోగ జన్మము మాత్రమే యగుచుండఁగా మానవునిది భోగ జన్మయే కాక కర్మ జన్మయు నైయున్నది. న్యాయ స్థాన పరిభాషయందువలె వేదాంతము నందుఁ గూడ పురుషునియందు స్త్రీ అంత ర్భూతమై యున్నది. ఆస్తి శాసనములు, శిక్షా శాసనములు, పురపరిపాలన శాసనములు మొదలగునవి ప్రతిరాజ్యమునందును ఉండును. వేదాంతమునందును, ప్రభుత్వ వ్యవహారము నందును ధర్మములవలన, లేక శాసనముల వలననే అధికారము పుట్టు చున్నది.

ప్రతివ్యక్తికి విముక్తిని లేక సుఖమును సంపాదించుటయే వేదాంతమునకు ఫలము. ప్రపంచము సుఖ దుఃఖ, శుభాశుభాది మయమై యున్నది. కావుననే జీవుఁడు నిరంతరము సుఖముగా నుండవలయునని ప్రయత్నించు చున్నాఁడు. దీనిని సాధింప వలయు నన్నచో వేదాంతి తన యింద్రియము లను నిగ్రహించుకో వలయును. ప్రపంచము సత్త్వ రజస్తమో గుణాత్మకముగా నున్నది. మనము తుది రెంటిని అణఁచివేయుచు మొదటి దానిని పైకి తెచ్చుకొనుచుండ వలయును. ఆంతరంగికముగా ఒక యింద్రియమునకు, మఱియొక యింద్రియమునకు నేరుగా పోరాటమే జరుగును. పాపము చేసినవాఁడు ఈశ్వరునిచే దండింపఁబడును.

పరమానందమే వేదాంతికి చరమ లక్ష్యము. అట్లే సుస్థితిని, శాంతిని నెలకొనఁజేయుచు ప్రజలకు ఐహికమైన సుఖము కలుగునట్లు చేయుట ప్రభుత్వ వ్యవస్థకు చరమ లక్ష్యము. ప్రతివ్యక్తియు తన విధులను విస్మరించి ఎల్లప్పుడు హక్కుల కొఱకు పోరాడుచుండును. కాఁబట్టి ప్రతి వ్యక్తియు ప్రాథమికములైన హక్కులను పొందునట్లు చేయుట ప్రభుత్వ విధి. తమ విధులను నిర్వహింపనివారి విషయమున ప్రభుత్వము జోక్యము కలిగించుకొని వారిని దండించును. కావుననే రాజ్యమునందు ఆస్తికి సంబంధించిన శాసనములును, శిక్షా శాసనములును విధింపఁబడుచున్నవి.

ప్రభుత్వ వ్యవస్థ శరీరము వంటిది. శరీర మంతయు సుసంగతముగా నుండుటకై వివిధములైన యింద్రియములు వివిధ కార్యములను ఎట్లు నిర్వహించుచున్నవో, అట్లే రాజ్యములో శాసనములు అమలు జరుగుచు సుస్థితి నెలకొనుట అందఱకును ముఖ్యమైన విషయమే అగుటచే, ఆ యుద్దేశ ముతో ప్రతివ్యక్తియు తనకు విహితమైన కృత్యమును శ్రద్ధతో చేయ వలయును. ఇంద్రియములలో గొప్పవి, కొద్దివి, ప్రధాన మైనవి, అప్రధాన మైనవి అను భేదములే లేవు. శరీరమునకుసంబంధించి నంతవరకు అన్నింటికిని సమానమైన హోదాయే కలదు. అట్లే ప్రభుత్వ వ్యవస్థకు సంబంధించినంతవఱకు వీధులూడ్చువాఁడును, రాజ్యపాలకుఁడును సమాన ప్రాముఖ్యమునే కలిగియుండును.

వీధు లూడ్చువాఁ డొక్కఁడు తనవిధిని నిర్వహింపకున్నచో ఆ లోపముచేత ప్రభుత్వ

వ్యవస్థ అంతయు విచలిత మగును. కావున నెల్లరును పరస్పర సంబద్ధులై యున్నారు.

వేదాంతమునందు అహంకార, మమ కారములను గూర్చి విచారణ జరుగును. నేను "ఇది నా యిల్లు" అని చెప్పు చున్నాను. అప్పుడు నాకును, ఇంటికి గల సంబంధ మేమి? రెండును పరస్పర భిన్నము లని మామూలు కంటికే గోచరించును. కాని సాధారణ మానవుఁడు తన యింటికి భంగము కలిగినచో తనకే భంగము కలిగి నట్లు భావించును. అతఁడు అట్లేల భావింప వలె? ఇల్లు తనకన్న భిన్నముగా నున్న దని నిస్సందేహముగా తెలిసికొనుచుండియు దానితో తాదాత్మ్యమును తా నేల పొంద వలె? "నేను" అను భావమునకు, శరీరము నకుఁ గల సంబంధ మేమి? అవి రెండును ఒకటియా లేక రెండా? ఇట్టి ప్రశ్నలు కొన్ని వేదాంతములో కుతూహలమును కలిగించు చుండును. ప్రభుత్వ వ్యవస్థలో కూడ మనము జిరాయితి హక్కులను గూర్చి చర్చించు చున్నాము. కొంతమంది యధీనములో ఆస్తు లుండును. ఆస్తిని కలిగియుండవలయు నను నాకాంక్ష మనుష్యునకు జన్మసిద్ధముగనే యుండును. కాఁబట్టి యథార్థముగ హక్కు కలిగిన వారికన్నను తనకే ఎక్కువ స్వామ్య మున్నట్లుగా నిరూపించుకొను తలంపుతో కూడ ఒక్కొక్కఁడు ఆస్తిని ఆక్రమింప గోరుచుండును. శాసనము వ్యక్తులను గౌర వించును. వ్యక్తి లేకుండ శాసనము ఉండదు. రాజ్యవ్యవస్థలో వ్యక్తితోపాటు వాని యాస్తులను గూడ రక్షింప వలయును. స్వామ్యమును గూర్చిన హక్కులను పరిశీలించు నప్పుడు కొన్ని సందర్భములలో వ్యక్తియొక్క అంతస్తును, ఇతరులతో అతనికిఁ గల సంబం ధమును, నందలి తారతమ్యమును కూడ నిర్ణయింపవలసి యుండును. "నేను, నాది" అన్నవి సహజ లక్షణములే. అవి మధ్యలో ఏర్పడుట లేదు.

వేదాంతమునందు "నే నెవఁడను" అను నదియే విచారణ. తాను చూచినను, చూడ కున్నను ఇతరులలో కూడ తన యాత్మవంటి యాత్మయే యున్నది కావున సంపన్నుఁడు ఇతరుల విషయమున దానపరుఁడు గావల యును. కావున రాజ్యమునందు ఆర్థికముగా, సాంఘికముగా, రాజకీయముగాతనస్థానమును తెలిసికొనుట ఆవశ్యకము. రాజ్యవ్యవస్థ యందు ఈ స్థానముల చర్చ జరుగుచునే యున్నది. కాఁబట్టి వేదాంతమునందు వలెనే రాజ్యవ్యవస్థయందు కూడ ఆస్తులను, సంపదను ఎల్లరకు సమానముగా పంచవలయు నను సూత్రము అంగీకరింపఁ బడుచున్నది.

మనుష్య జీవులందు, పశుజీవులందు కూడ మిగుల శ్రద్ధను చూపఁగలిగినవారే పరిపాల కులుగా నుండవలయును. పరిపాలకుఁడు తన లాభము కొఱకు పాలింపరాదు. ఆందోళన కారులు ఎన్నఁడును పాలకులు కాఁజాలరు. శాసనకర్తలు తాము చేయు శాసనమువలన లాభము నొందరాదు. ప్రభుత్వ మెప్పుడును ప్రజలను ధర్మానురక్తులుగాఁ జేసి వారు ఆ ధర్మమును అనుసరించునట్లు చేయవలయును.

ఎప్పుడు ఏ శాసనము చేయఁబడినను దాని నుండి తప్పించుకొనవలయు ననుటయే మనుష్య ప్రవృత్తి. శిక్షా శాసనముచే దండింపఁదగిన నేరమును ఒకఁడు చేసె ననుకొనుఁడు; లేక పరుల యాస్తులను తనవిగా ఒకఁడు న్యాయస్థానమున అభి యోగమును తెచ్చె ననుకొనుఁడు. ఇరువురును న్యాయస్థానమును మోసగించి తుదకు

గెలుపు నొందవచ్చును. ఒకఁడు నేరము చేసి శిక్షను తప్పించుకొనుచుండఁగా, మఱియొకఁడు తనది గాని యాస్తిని సొంత మొనర్చుకొనుచున్నాఁడు. తమ లక్ష్యములను సాధించుకొనుటలో ఇట్టి యపమార్గములను అవలంబించుటకు వీ రిరువురును చాల దుష్టములైన దృష్టాంతములను ఏర్పఱచుచున్నారు. ఈ జన్మమునఁగాని, మఱుజన్మమునఁగాని మనకు భగవంతునివలన శిక్షపడక తప్పదు అను భయమును ప్రజలయందు కలిగించునట్టి ధర్మమును లేదా శాసనమును నెలకొల్పుటకై ప్రభుత్వము శ్రద్ధ వహించినచో ప్రజలు తాత్కాలికములైన లాభముల కొఱకు ప్రభుత్వమును వంచింపవలయునని కుటిలోపాయములను అవలంబింపరు. మానవ నిర్మితములైన శాసనములు ఎన్నఁడును రాజ్యమునందు శాంతిని, సుస్థితిని నెలకొల్పఁజాలవు. శాసన మెప్పుడును లోపములు గలిగియే యుండును. అది ఎప్పుడును సమగ్రముగ నుండదు. దానిని సమగ్ర మొనర్చుట అసాధ్యము కూడ నగును. కాఁబట్టి రాజ్యమునందు మతము ఆవశ్యకము.

హిందూమతము చాల విశాలమైనది. జీవుఁడు నిత్యుఁడని, కాలక్రమమున సత్కర్మ యోగ సంసిద్ధివల్ల మోక్షము నొందఁగలఁడని హిందూమతము విస్పష్టముగా గ్రహించి యుండుటచే అది యితరమతముల నెన్నింటినైనను సహింపఁగలిగి యున్నది. ప్రతి వ్యక్తికి మతస్వాతంత్ర్యము నొసంగవచ్చును. ఆవశ్యకత ననుసరించి కొన్ని తెగలకు ప్రత్యేకాధికారముల నీయవచ్చును. రాజ్యముగా ఏర్పడియున్న తా మందఱము ఒకటే యని, కాని తమలో తాము ఎల్లరు సమానులు కారని ప్రతివ్యక్తియు గుర్తించునట్లు ప్రభుత్వము చేయవలయును.

హిందూదేశమున జనాభా పెరుగుచుండుట అను సమస్యను గైకొందము. జనాభాయొక్క పెరుగుదల వలన దేశమున మనకు లభించుచున్న యాహారము చాలుట లేదు. వస్తులవలన ప్రజలు చచ్చిపోవుదురనియు భయము కలుగుచున్నది. కావున అనేక వస్తువులపై వ్యాపారనియతి ప్రకటింపఁబడినది. పరిమితముగా వస్తువుల నొసంగు పద్ధతియు ప్రవేశపెట్టఁబడినది. అధికాహారము నుత్పత్తి చేయవలయునను నుద్యమమును ప్రభుత్వము చేపట్టినది. బంజరు భూము లనేకములు కృషిక్షేత్రములు గావింపఁబడినవి. ప్రతివ్యక్తికి ఆహారమును అందింపవలయునని ప్రభుత్వము మానవ ప్రయత్నమున చేయఁగలిగినంత చేయుచున్నది. జనాభా పెరుగుదలను ఆపుటకై జనన నియంత్రణ విధానము కూడ బాహాటముగ ప్రవేశపెట్టఁబడుచున్నది. తన యుద్రేకములను నిగ్రహించుకొనుట అసాధ్యమని తలంచుట వలన మానవుఁడు గర్భధారణమును తప్పించుటకై కృత్రిమపద్ధతులను అన్వేషించుచున్నాఁడు. ఇది యంతయు గమనించినచో మానవుఁడు జంతు దశకు దిగజాఱుచున్నాఁ డేమో అనిపించుచున్నది.

హిందూమతము యొక్క దృష్టిలో ఆహారము లేకపోవుట వలన మానవుఁ డెప్పుడును చావఁడు. చావ వలసి యున్నవాఁడు ఎట్లును చచ్చును. చావు తప్పదు. పుష్టిగా తినువారు సైతము చత్తురు. కొన్ని సమయములలో చావునకు కారణములైన పెక్కింటిలో ఆహారము లేకపోవుట కూడ ఒక కారణము కావచ్చును. వేదసంస్కృతిని

దృష్టియం దుంచుకొన్నచో, హిందూ సమాజమున ఏ వ్యక్తియు ఆహారము లేక పొరుగువాఁడు చనిపోవుటను చూచి యుపేక్షింపఁడు. హిందూ సమాజము చాల దాన శీలమైనది. హిందు వెప్పుడును సంతోషముతో త్యాగ మొనర్చుచుండును. జీవనము నందు మనము త్యాగమును చూచు చుందుము.

వేదవ్యాసమహర్షి పుత్రుఁడగు శుకునకు ఇట్లు చెప్పెను :

శ్లో. కిం తే ధనేన కిము బంధుభి రేవ వా తే
కిం తే దారైః పుత్రక యో మరిష్యసి ।
ఆత్మాన మన్విచ్ఛ గుహాం ప్రవిష్టం
పితామహా స్తే క్వ గతాః పితా చ.

"నీకు ధనముతో నేమి పని ? బంధువులతో నైన ప్రయోజన మేమున్నది ? మరణింపఁబోవుచున్న నీకు భార్యతో నేమి ? హృదయ గుహయందు ప్రవేశించి యున్న యాత్మను అన్వేషింపుము. నీ తండ్రి తాతలు ఎక్కడికి పోయినారు ! "
(మహాభారతము, శాంతి పర్వము, ccc xiii. P. 72)

ప్రాచీనకాలమున హైందవుఁడైన యొక తండ్రి కుమారునకు కావించిన యుపదేశ మది. ఆ కుమారుఁడు మహనీయుఁడైన తండ్రి కన్నను మహత్తరుఁ డయ్యెను. అట్టి పరిపాలితులు ఏ రాజ్యమునందు ఉందురో దాని కొక్కకీడు కలుగునని తలంపఁజాలము.

నీరు ఎప్పుడును ప్రవహితమైన తన మార్గముననే ప్రవహించును. ఈశ్వరునకు రక్షించు గుణముతో పాటు లయ మొనర్చు గుణమును కలదు. ఱాతి యందున్న కప్ప కూడ జీవింపఁగలుగుచున్నది. జీవించుట గాని, మరణించుట గాని వ్యక్తి యొక్క ప్రారబ్ధముపై నాధారపడి యుండును. "ప్రారబ్ధము శరీరమును పోషించుచున్నది" అను నానోక్తి కలదు. అనఁగా ప్రారబ్ధము శరీరమును నిలుపుచున్న దన్నమాట. ప్రారబ్ధము ననుసరించి శరీరము ఎంతవఱకు ఉండవలయునో అంతవఱకును ఉండును. ఇతర జీవులను దృష్టియందుంచుకొని మనుష్యుఁ డెల్లప్పుడును తన్ను తాను సంస్కరించుకొనుచు అభివృద్ధి నొందుచుండవలయును. మనుష్యుఁడు ధార్మికముగా, సాంఘికముగా, రాజకీయముగా చైతన్యవంతుఁడై యుండవలయును. కావున మనము జనాభాయొక్క పెరుగుదలను గూర్చి ఆందోళన నొంద నక్కఱలేదు.

హిందూమతమున మనకు గర్భాదానము, పుంసవనము మొదలగు సంస్కారము లున్నవి. పుత్రుని పొందుట కొఱకే దంపతులు సంయోగము నొందవలయును. వివాహము పవిత్రమైనది. వైవాహిక జీవితమున నీవు పొందు సుఖము అప్రధానము. గర్భాదాన సంస్కారము మూలమున మన మొక మంచి జీవుని జన్మింపవలసినదిగా ఆహ్వానింతుము. కావున హిందువు పుట్టుటకు పూర్వము, పుట్టిన తరువాత ; చావునకు పూర్వము, చనిపోయిన తరువాత ధర్మము ననుసరించియే యుండును. అనఁగా హైందవుఁడు రాజకీయ వ్యక్తిత్వము కన్న అధికముగా ధార్మికత్వమునకే ప్రాధాన్యము నిచ్చునన్నమాట. హిందూదేశ వీథులలో తిరుగాడు ప్రతిభిక్షుకుఁడును తత్త్వవేత్తయే.

సంతానము కొఱకై భర్త భార్యను పొందఁదగిన ఋతుకాలములను మన శాస్త్రములు నిర్దేశించుచున్నవి. మన శాస్త్రముల విషయమున మన కున్న యజ్ఞానము వలననే

మనము సంతాన నిరోధమునకై డాక్టర్ స్టోన్ నిర్దేశించిన "ఋతు విధానముల" కొఱకై పరువెత్తు చున్నాము. సంతాన నిరోధమును గూర్చి డాక్టర్ స్టోన్ కావించు చున్న ప్రసంగములను వినవలదని ప్రజలను నేను నిరుత్సాహ పఱచుట లేదు; కాని ప్రతి చోటను మన శాస్త్రములను గూర్చి ప్రసంగించుటకు అవకాశము నొసంగి మన ధార్మిక విద్వాంసులను ప్రభుత్వము ప్రోత్స హించుట లేదని నేను విచారించుచున్నాను. మనోహరములైన వివిధ పుష్పములతో సుందరమైన హారమును గూర్చినట్లుగా పవిత్రములైన వేదములు హిమాలయముల నుండి కన్యాకుమారి వఱకు, తూర్పునుండి పడమటికిని భారతదేశము నంతను ఏక సూత్రమున గ్రథిత మొనర్చుచున్నవి. భేద ములలో అభిన్నతను చూడవలసిన పద్ధతి యిదియే. భారతదేశ మెప్పుడును తన సంస్కృతిని కోల్పోదు. అది సకల ప్రపంచ మును నడుపఁగలదు. సంతాన నిరోధము వంటి చిన్న విషయములలో కూడ అది ఇతర జాతులపై నాధారపడఁజాలదు.

సూతసంహితయందు ఇట్లు చెప్పఁ బడినది: మనుష్యుఁడు ఏ పని నైనను ధర్మబుద్ధితో చేయువలయును. మనలను పరిపాలించుచున్న యీశ్వరుఁడు పైన నున్నాఁడని అతఁడు గ్రహింపవలయును. అతఁడు ప్రమాణబుద్ధితో అట్లు భావింప వలయును. అవైదికుఁ డైన యాస్తికుఁడు కాకుండుట మేలు. వేదములను ప్రమాణ ముగాఁ గైకొని వానిలో చెప్పఁబడిన విధుల ననుసరించి వర్తింప వలయును. అట్టి యాదర్శ ములను రాజ్యమునందు నెలకొల్పవలయును.

ఈవిధముగా మతము, తత్త్వశాస్త్రము, రాజకీయములు పరస్పర సంబంధముతో నున్నవని, భేదముల మధ్యలో సామరస్య మును నిలుపుటకు ఆవశ్యకము లగుచున్నవని మనము గ్రహింపవలయును. మన ప్రాచీన విజ్ఞానము గ్రీకుల తత్త్వశాస్త్రము లోనికి ఎట్లు ప్రసరించెనో ఇంక పరిశీలింతము.

*

పంచమ పరిచ్ఛేదము

# గ్రీకు తత్త్వశాస్త్రములో భారతీయ విజ్ఞానము

ప్రాచీన గ్రీకు విజ్ఞానమునకు, మన విజ్ఞాన మునకు చాల పోలికలు కన్పించుచున్నవి. మాక్సుముల్లరు ఇట్లు చెప్పెను: జలము సకల పదార్థములకు ఉత్పత్తి స్థాన మని థేల్సు చెప్పిన దానికి, సకల వస్తువు లందును దివ్యచైతన్యము వ్యాపించియున్న దని హెరాక్లిటస్ చెప్పిన యభిప్రాయ మునకు, జంతువుల శరీరములలో నుండి మానవుని యాత్మ కదలిపోవుచున్నదని పైథాగరస్ ప్లేటోయును చెప్పిన భావము నకు, అయిదు మూలపదార్థములు కల వని అరిస్టాటిల్ చెప్పినదానికి, పాశవిక

మైన యాహారము నిషేధింపఁ దగిన దని ఎంపెడొకిల్స్ ఆర్ ఫిక్స్ అనువారు చెప్పిన దానికి, వీని కన్నిటికిని సరిపోల్పఁ దగిన విషయములను ప్రాచ్యతత్త్వశాస్త్రమునందు చూపవచ్చును. కాని అవి ఎఱువు తెచ్చుకొన్నవని గాని, లేక నీతిరహితముగా తమ సొంత మొనర్చుకొన్నవని గాని నిరూపించుటకు ఇప్పటికి సమకూర్పఁబడిన హేతువుల కన్నను బలవత్తరములైనవి ఆవశ్యకమై యున్నవి." ('మనస్తత్త్వశాస్త్ర సంబంధియైన మతము'. 'PsychologicalReligion'. P. 85.) గ్రీకు విజ్ఞానముపై భారతీయతకుఁగల ప్రభావమును ఇంకను పై గ్రంథమున మనము చూడవచ్చును. పూర్వముకన్న అధిక శ్రద్ధతో తప్పక పరిశీలింపవలసిన విషయ మొకటి పై గ్రంథములో నున్నది. ఒక భారతీయ విద్వాంసుఁడు ఏథెన్సు నగరమునకు వచ్చి సోక్రటీసుతో చర్చ గావించెనని, ప్లేటోయొక్క తత్త్వమునుగూర్చి ఆరిస్టోగ్జెనస్ రచించిన గ్రంథమునుండి ఎన్సెబియస్ ఉదాహరించెను. ఆరిస్టోగ్జెనస్ ఆరిస్టాటిలునకు శిష్యుఁడు. ఇందు మనకు సందేహమును కలిగింపవలసినది లేదు. కాని ఆ హైందవతత్త్వవేత్త ఆరిస్టాటిలుతో చెప్పిన విషయమే ఆరిస్టోగ్జెనసు యొక్క వచనమును మిగుల సంభావ్య మొనర్చుచున్నది. తన తత్త్వశాస్త్రమంతయు మానవ జీవితమునకు సంబంధించిన పరిశీలనము గానే యున్నదని సోక్రటీసు చెప్పఁగా, ఆ హైందవ తత్త్వవేత్త మందహాస మొనర్చి "దివ్యములైన విషయములను ఎవ్వఁడును తెలిసికొనఁజాలడు" అని సమాధానము చెప్పెనని ఉటంకింపఁబడియున్నది. ఈ యాక్షేపము పూర్తిగా భారతీయమై యున్నది. కావున ఇది యథార్థమై యుండవచ్చు నను నభిప్రాయము నా మనస్సున గాఢమగుచున్నది. (పుటలు 83, 84) రెక్కలగుఱ్ఱముల జంటగల రథమందున్న వానిని ఉపమానముగా ప్లేటో వర్ణించిన విషయమును పేర్కొని మాక్సుముల్లరు కఠోపనిషత్తులో జీవాత్మను రథమందున్న వానినిగా, శరీరమును రథమునుగా, బుద్ధిని సారథినిగా, మనస్సు పగ్గములుగా, ఇంద్రియములను గుఱ్ఱములనుగా వర్ణించిన ప్రసిద్ధమైన యుపమతో సరిపోల్చినాఁడు.

పై గ్రంథమున మాక్సుముల్లరు ఇది కూడ చెప్పి యున్నాఁడు. "తత్త్వశాస్త్ర సంబంధములైన యభిప్రాయములలో గ్జెనోఫేన్స్, పర్మినైడిస్, జెనో, మెలిస్సస్ అను ఈలియా తత్త్వవేత్తలు వేదాంత తత్త్వజ్ఞులకు చాలసన్నిహితు లగుచున్నారు". ఆతఁడు ఇంకను ఇట్లు చెప్పియున్నాఁడు. "ఏది ఉన్నదో అది లేని దాని నుండి యుద్భవింపదు" అను ఉపనిషత్తులలోని వాదమును గ్జెనోఫేన్సు కూడ చేసినట్లు చెప్పఁబడుచున్నది. ఉపనిషత్తులలో కన్పించుచున్న విశేషణములతో పోల్పఁదగిన అజాతము, అవికార్యము, అవినాశ్యము, నిత్యము మొదలగు విశేషణములతో గ్జెనోఫేన్స్ ఉన్నదంతయు నొక్కటే, అదియే యథార్థముగా నున్నది అని చెప్పియున్నాఁడు. ఉపనిషత్తులలో వలెనే గ్జెనోఫేన్స్ సర్వాత్మకము, ఏకమునైన వస్తువు చేతనమైనదని నొక్కి చెప్పినాఁడు. ఒక వస్తువే సకల పదార్థములకు సారమైయున్న దను ముఖ్యమైన యంశమును ఉపనిషత్తులతో పాటు గ్జెనోఫేన్స్ కూడ అంగీకరించుచున్నాడు. పూర్వులైన ఈలియా తత్త్వవేత్తలు

చేరుకొన్న యాలోచనస్థాయి ఇంచుమించుగా ఉపనిషత్తుల స్థాయితో సమానముగా ఉన్నదని మనము గమనింప వచ్చును. ఈ రెండు పక్షములును మతధర్మభావములతో విచారణము నారంభించి తత్త్వసిద్ధాంతములతో ముగించుచున్నారు. వారు సంస్కృతమున "సత్" అని చెప్పఁబడుచున్న పరమోన్నతమైన వస్తుస్థితియే "టూన్" యథార్థము అన్న గమ్యమునకు చేరుకొన్నారు. అనుభవము యొక్క బహుముఖత్వము నామరూపముల వలన కలుగుచున్న పొరపాటు కాకున్నను దృశ్యమాత్రమై సంశయాస్పదముగా నున్నదని యిరుపక్షములవారును భావించుటకు అలవాటుపడియున్నారు. కాని యిరువురకును గల భేదములు కూడ గమనింపఁదగినవే. ఈలియాకు సంబంధించిన గ్రీకు తత్త్వవేత్తలు వ్యక్తిత్వమునందు దృఢమైన విశ్వాసమును గలిగియున్నారు. ఆత్మను గూర్చి, పరమాత్మతో ఈ యాత్మకుఁగల సంబంధమును గూర్చి వారు చెప్పునది చాల అల్పము. జీవాత్మ పరమాత్మతో ఐక్యము నొందుచు దానితో తన యభిన్నత్వమును గుర్తించుటకు తగిన యుపాయమును గూర్చి కూడ వారేమియు చెప్పరు.

సకలపదార్థములకు ఆద్యమైనది జలమని గ్రీకు తత్త్వశాస్త్రమునకు జనకుఁడైన థేల్సు చెప్పెను. అపొల్లోనియాకు సంబంధించిన డయోజనిస్ ఆత్మయే ఆద్యమని కనుగొనెను. ఆత్మకు బుద్ధియే కాక శక్తియు నున్నదని అతఁడు చెప్పినాఁడు. ఆద్యపదార్థము అనంతమైనదని మిలేటస్సునకు సంబంధించిన మాగ్జిమాండర్ కనుగొనెను. సంఖ్యలు పదార్థములకు కారణమని, అస్తిత్వము మార్పులేనిదని పైథాగరస్ చెప్పెను. జ్గెనోఫేన్సును గూర్చి ఆరిస్టాటిల్ ఇట్లు చెప్పెను. "అంతరిక్షము యొక్క అపరిమితత్వము వైపు దృష్టిని సారించుచు ఉన్న యొక్క వస్తువు ఈశ్వరుఁడే" అని అతఁడుద్ఘోషించెను. ఆత్మభవుఁడు, అచలుఁడు, బోధస్వరూపుఁడు, అనంతుఁడు అని భగవంతుని గూర్చి జ్గెనోఫేన్సు వర్ణించెను. ఉన్న వస్తువు ఒక్కటే అన్న విషయమును పర్మెనైడిస్ స్థాపించెను. అతని శిష్యుఁడు జెనో నానాత్వము యొక్క అభావమును నిరూపించెను. ఇంద్రియములు నిరంతరము వంచించుచున్నవని హెరాక్లిటస్ తలంచెను. ఇంద్రియములు పదార్థములను పరిశీలింపఁజాలకున్నవని ఎనెగ్జాగరస్ ప్రకటించెను. ఎంపెడొక్లిస్ హేతువాదమున సత్యమును గనుఁగొనఁజూచెను. ఇంద్రియగ్రాహ్యమైనది గ్రహించుచున్నవాని దృష్టితో సత్యమే కాని వస్తుస్థితి ననుసరించి యథార్థము కాదు అని డెమొక్రిటస్ చెప్పెను. నిర్వచనములను, అనుమాన ప్రమాణమును అనుసరించిన వారిలో మొదటివాఁడు సోక్రటీస్. ప్రాపంచిక విషయములు సత్యములు కావని, యథార్థవస్తుస్థితుల కవి ప్రతిబింబములని ప్లేటో వచించెను. ఈశ్వరుఁడు ఆలోచన స్వరూపుఁడని, విశ్వ మాయన యొక్క మనస్సులో ఒక యాలోచన మని ఆరిస్టాటిల్ చెప్పెను.

గ్రీకు తత్త్వవేత్తలలో తరువాతివారు సంశయాళువులు, భోగపరులు, వీతరాగులుగ నుండిరి. అలెగ్జాండ్రియాకు సంబంధించిన సిద్ధాంతపద్ధతి కూడ నుండెను. భగవంతుఁడు అనిర్వాచ్యుఁడు, అగ్రాహ్యుఁడని ఫైలో వచించెను. భగవంతుని యస్తిత్వమును తెలిసికొనవచ్చును గాని ఆయన

స్వభావమును తెలిసికొన వీలులేదని ఆతఁడు తలంచెను. భగవంతుని వచనమును గ్రహింపవీలగు నని ఆతఁడు చెప్పెను. ఇంద్రియగోచరమైన ప్రపంచము దృశ్య మాత్రమే యని ప్లాటినస్ వచించెను. అనంతమైన వస్తువును ఆనందపారవశ్యము ననే గ్రహింప వీలగునని యతఁడు చెప్పెను. 'ఈ యానందపారవశ్యమున జీవాత్మ భౌతిక బంధనమును సడలించుకొని వ్యక్తిత్వ భావన నుండి విడివడి, తాను ఏ యనంత చైతన్యమునుండి పైకి వచ్చెనో దానియందు లీన మగును. ఈ పారవశ్యమునందు జీవాత్మ యథార్థమైన వస్తుస్థితినిగూర్చి ధ్యానించును. అది దేనిని గూర్చి ధ్యానించునో దానితో ఏక మగును" అని ప్లాటినస్ వక్కాణించెను.

బ్రిటనులోను, ఐరోపాఖండము నందును తత్త్వవేత్తలు ప్రపంచమును గూర్చి భగవంతుని గూర్చి ఏమిచెప్పిరో పరిశీలింతము.



షష్ఠ పరిచ్ఛేదము

# ప్రపంచమును గూర్చి, భగవంతుని గూర్చి పాశ్చాత్య తత్త్వజ్ఞుల యభిప్రాయము

"ఆలోచనారంగమున ఆధునిక తత్త్వ శాస్త్రము అధిక్షేపవాదముగా నున్నది" అని ఎర్డ్‌మన్ చెప్పెను. అది పాండిత్యము నకు విరోధి. సృజనాత్మక ప్రయత్నమున మధ్యయుగము పూర్వయుగముతో పోల్చి నప్పుడు కదలికలేని కాలమనియే చెప్పవలసి యున్నది. మధ్యయుగములోని యుపాధ్యాయులు మొదలగు తత్త్వవేత్తలు ఈశ్వరుని యొక్క అస్తిత్వము, మూర్తిత్రయభావన, పరమేశ్వరుఁడు, సంకల్ప స్వాతంత్ర్యము మొదలగు వానికి సంబంధించిన సమస్యలను గూర్చి మిగుల ఆసక్తి కలిగియుండిరి. వస్తు తత్త్వవిచారణ వారి కంతగా పట్టలేదు. వారి సిద్ధాంతములు భగవద్వచనముపైనను విశ్వాసముపైనను ఆధారపడి యుండెను. యుక్తివాదమునకు స్వేచ్ఛ లేకుండెను. ఆధునిక తత్త్వశాస్త్రము యుక్తిపైన, కేవల వస్తు పరిశీలనము మీఁదను ఆధారపడి యున్నది.

డెస్కార్టెస్, బేకను ఆధునిక తత్త్వ శాస్త్రమునకు జనకులు. బ్రిటనులో అనుభవము మాత్రమే జ్ఞానమునకు మూలముగా భావింపఁబడుచుండఁగా, యూరపు ఖండమున యుక్తి జ్ఞానమునకు మూలముగా భావింపఁబడుచున్నది. సకల విజ్ఞానమునకు అనుభవమే మూలమనియు విషయగ్రహణమున మనస్సునకు వేఱొకసాధనము లేదనియు ఆంగ్లేయ తత్త్వజ్ఞులలో బేకను ఒక్కఁడే

తలంచెను. "మానవుని గ్రహణశక్తి అను వ్యాసమును, లాకీ సహజములని చెపఁబడు భావములను లేదా ధర్మములను అన్నింటిని నిరాకరించుటతో ఆరంభించెను. అనుభవమును పొందుటకు పూర్వము మనస్సు పూర్తిగా విషయశూన్యమై యుండు ననియు, ఇంద్రియములవలన మనము గ్రహించుచున్న విషయముల చేతను, ఊహల చేతను మొట్టమొదట భావములు ఏర్పడుచున్నవని లాకీ, బర్కిలీ, హ్యూమ్ అనువారు చెప్పుచున్నారు. హ్యూమ్ కాలమున ఈ కేవలానుభూతివాదము పరాకాష్ఠ నందెను. ఇంద్రియ జన్యములైన సంస్కారముల సంబంధము వలననే మనకు విజ్ఞానమంతయు కలుగుచున్నదని ఆతఁడు చెప్పెను. కార్యకారణభావము మొదలుగా, విశ్వజనీన సత్యములుగా సిద్ధాంతములుగా చెప్పఁబడుచున్న వన్నియు సంభావ్యములు మాత్రమే. ఇట్లు స్వానుభూతివాదము సంశయ శీలనముగా పరిణమించినది.

ప్రామాణికము, ఆవశ్యకమును అగు జ్ఞానమునకు అంతకును హేతువాదమే మూలమని యూరపు ఖండమున ప్రకటించిన మొదటి తత్త్వవేత్త డెస్కార్టెస్. హేతువాదము మనస్సునకు సహజము, ప్రాథమికమనియును చెప్పఁబడినది. యథార్థ జ్ఞానము యొక్క మూలమును చేరుటలో ఇంద్రియానుభవము తఱచుగా మనలను మోసగించుచుండును. గణితశాస్త్ర పద్ధతిలో అనుమతిచే జ్ఞానమును పొందుట డెస్కార్టెస్, స్పైనోజా, లేబ్నిజ్ అనువారికి లక్ష్యమై యుండెను.

"ఒక నిశ్చయమును సాధించునప్పుడు తర్కము ననుసరించి సందేహించుటకు అవకాశము లేనంతవఱకును సందేహించుచునే యుండవలయును" అని డెస్కార్టెస్ చెప్పెను. కాని తన యునికిని ఎవ్వఁడును సందేహింపఁజాలఁడు. ఇట్లు సందేహించుటకుకూడ ముందు సంశయించువాఁడు ఉండవలయునుగదా! "నేను ఆలోచించుచున్నాను, కావున నే నున్నాను", అని డెస్కార్టెస్ అనును. ఇది ఎవ్వఁడును నిరాకరించుటకు వీలు లేని స్వయంవ్యక్తమైన ప్రతిపాదనము. ఆలోచనము, ఉనికి అనునవి భిన్నములు కావని యాతఁడనును. మానవుఁడు ఆలోచించునట్టి ప్రాణిగానే అస్తిత్వమును కలిగి యున్నాఁ డనుట ఆతని యభిప్రాయము. "నేను" అను భావము దేహమునకు సంబంధింపక జీవశక్తిగా, చైతన్యముగా లేక ఆలోచనముగా ఉన్నదని యాతఁడు అనును. "నేను ఇక్కడ కూర్చుండి యున్నాను," "నేను నడచుచున్నాను" మొదలగు విషయములు శరీరలక్షణములే కాని, "నేను" అను నాత్మకు సంబంధించినవి కావు. ఈ లక్షణములను ఆత్మకు అన్వయింపఁజూచినచో అవి యసత్యము లగును.

భగవంతుఁ డుండుట ఆవశ్యకము అని డెస్కార్టెస్ నిరూపించినాఁడు. భగవంతుని యస్తిత్వమునకు అతఁడు నాలుగు ఉపపత్తులను చూపెను. సహజములు, ఆగంతుకములు, కల్పితములు అని భావముల నన్నింటిని అతఁడు విభజించెను. భగవంతుని గూర్చిన భావము చాల ముఖ్యమైన సహజ భావము. శూన్యమునుండి శూన్యమే తప్ప పదార్థము ఏదియు పుట్టదు అనుట సుప్రసిద్ధము. సహజమైన భగవద్భావమునకు కూడ వెనుక ఒక కారణము ఉండవలయును. మన యనుభవములో నున్న పరిమితములును, అసంపూర్ణము

లును అయిన విషయములు భగవద్భావము నకు కారణములు కాఁజాలవు. పరిమితము లైన పదార్థములయొక్క భావములు ఏర్పడుటకు ముందే అనంతమైన వస్తువు యొక్క భావము ఏర్పడియుండవలయునని తర్కము ననుసరించి నిర్ణయింపవలసి యున్నది. ఈవిధముగా అనంతమైన వస్తువు యొక్క భావనకు ఆ యనంతమైన వస్తువే కారణము అని అంగీకరింపవలసి యున్నది.

సహేతుకవాదమున డెస్కార్టెస్ మఱియొక పద్ధతిని ప్రవేశపెట్టెను. పరిమితము లైన పదార్థముల యస్తిత్వమునకు పరిమిత పదార్థముకన్న భిన్నమైనదే కారణమై యుండవలయునని అతఁడు వాదించెను. కావున భగవంతుఁడే విశ్వమునకు సృష్టికర్త యని అతఁడు చెప్పెను.

పరిమిత పదార్థములయొక్క మనుగడ కాలమునుబట్టి భగవంతునియొక్క అస్తిత్వమును నిరూపించుటకు మూఁడవ హేతువు ఏర్పడుచున్నది. "మనము ఇప్పు డున్నాము అనుట యథార్థమే. కాని దానివలన పైక్షణమున మనము ఉండవలయునని చెప్పఁజాలము. అట్లు చెప్పవలయు నన్నచో మనలను ఏది పుట్టించుచున్నదో ఆ మూల కారణమే నిరంతరము నిలిచి యుండి మనలను నిలుపుచుండవలయును." ('తత్త్వ శాస్త్రసూత్రములు.' 'Principles of Philosophy' ప్రతిప్రాణియు తన పుట్టుక కొఱకు మాత్రమే కాక జీవితమున ప్రతిక్షణము నందును భగవంతునిపై ఆధారపడుచున్నదని ఆతఁడనును. అనఁగా భగవంతుఁడు జగత్తును సృష్టించుటయే కాక దాని పోషణ మును కూడ జరుపుచున్నాఁ డన్నమాట. భగవంతునియొక్క ఉనికిని, ఆయన గావించు చున్న సృష్టిని నిరూపించుటకు డెస్కార్టెస్ తాత్త్వికమైన నాల్గవ హేతువు దీనిపై ప్రసక్తమగును. పూర్ణపురుషత్వ మను భావన యున్నప్పుడు దాని కాధారముగా ఒక పూర్ణపురుషుఁడు ఉండక తప్పదు అని యాతఁడు వక్కాణించును.

పదార్థము యొక్క అస్తిత్వమును కూడ డెస్కార్టెస్ విశ్వసించును. అతఁడిట్లు చెప్పును. "మనకుఁగల ప్రతిభావనయు మన మనస్సునకన్న భిన్నమైన యొక వస్తువునుండి కలుగుచున్నదని మనము నిస్సందేహముగా మొట్టమొదట అంగీకరింపవలసి యున్నది. ఎందువల్ల ననఁగా మన భావన మన యింద్రియములకు జ్ఞానమును కలిగించు నట్టి పదార్థముపైననే సంపూర్ణముగ ఆధారపడియుండుటచేత, ఒక భావనను కాదని వేఱొక భావనను అనుభవించునట్టి శక్తి మన కెప్పుడును లేదు." కొంత ప్రదేశమును ఆక్రమించుకొని యున్న పదార్థములు యథార్థములుగా మన భావనలకు ఆధారములై యున్నవి. ప్రతి పదార్థము పొడవు, వెడల్పు, మందము కలిగి విస్తృతమై యున్నది. ఈ విస్తృత పదార్థమునే ద్రవ్యము (Matter) అని చెప్పు చున్నారు. ఈ ద్రవ్యమునకు సారభూతమైన లక్షణము విస్తృతియే కాని బరువు కాదు; అవకాశమున నుండుటయే కాని కఠినత్వము కాదు. ద్రవ్యము అనంతమైన విభజనకు పాత్రమై యున్నది.

ఒక వస్తువునుండి మఱియొక వస్తువునకు అందింపఁబడిన చుఱుకు దనమే 'కదలిక' (Motion) అని డెస్కార్టెస్ చెప్పును. ఆత్యంతికము, ప్రాథమికము నైన కదలికకు కారణము భగవంతుఁడు. ఇట్లు డెస్కార్టెస్

ద్వైతమును ప్రతిపాదించెను. మనస్సు, పదార్థము పరస్పరము భిన్నములనుట, వాని మధ్యఁగల సంబంధము అనూహ్యమనుట ఈ ద్వైతమునకు ప్రధాన సూత్రము. మనస్సునకు సారము ఆలోచన యైనట్లు పదార్థమునకు సారము విస్తృతి. కావున భగవంతుఁడు ఈ రెండింటికిని మధ్యవర్తిగా నుండవలయును.

విస్తృతిలేని పదార్థము, ఆలోచన లేని మనస్సు ఉండుటకు వీలులేదు. భౌతిక లక్షణమైన విస్తృతి లేకుండ మనస్సు, ఆత్మ లక్షణమైన యాలోచన లేకుండ పదార్థము ఉండవచ్చును. ఇట్లు ద్వైతము నెలకొల్పఁబడినది.

స్పైనోజా ఈ ద్వైతమును నిర్మూలించుచు ఏకైకముగా భావింపఁదగినది తనయందే తాను ఉండునట్టి సారభూతమైన పదార్థము భగవంతుఁడే అని ప్రకటించెను. ఆ భగవత్పదార్థము ఏకము, అనంతము, పరిపూర్ణము. కావున అస్తిత్వము దానికి స్వభావమే. ఈ పదార్థమునకు మనస్సు, ద్రవ్యము విశేషణములు. సారభూతమైన భగవత్పదార్థమునందు సృజింపఁబడుచున్న వస్తువు లన్నియు వికృతి మాత్రములే. స్పైనోజా అద్వైతమును నియతముగ అవలంబించి విశ్వమే భగవంతుఁడని వాదించునట్టివాఁడు. అతని దృష్టిలో ప్రతి వస్తువు భగవంతుఁడే. అతఁడు భావించిన భగవంతుఁడు ఎంతగా ద్రవ్యమునకు సంబంధించి యున్నాఁడో అంతగా మనస్సునకుకూడ సంబంధించియేయున్నాఁడు. ఆ భగవంతుఁడు జీవుల స్వతంత్ర సంకల్పముల మూలమున ఇచ్ఛల ద్వారమున వర్తింపఁడు. ఆయన నుండి పరిమితిగల పదార్థము లన్నియు ఒక నియతి ననుసరించి వెలువడుచున్నవి. స్పైనోజా నియతివాదిగా కూడ ప్రసిద్ధుఁడే. యాంత్రికమైన ప్రపంచ సృష్టి పద్ధతిని ఆయన అభిమానించును. స్పైనోజా ప్రతిపాదించిన తత్త్వము కేవలము బుద్ధికి సంబంధించి యుండుటయే కాక, నీతికి కూడ సంబంధించి యున్నది. అతఁడు కామ క్రోధాదులను ద్వేషించును. అతఁడు భగవంతునియందే కాక మానవునియందు కూడ సంకల్పము యొక్క స్వాతంత్ర్యమును స్పష్టముగా నిరాకరించెను. సకలవస్తుసారమైన పదార్థమునకు కారణ మొకటి యుండుటకు వీలులేదని అతఁడనును. పరిమితిగల పదార్థములు, మనస్సులు సారభూతమైన యా తత్త్వము నుండియే వికృతి మాత్రములుగా వెలువడుచున్నవి. ఈ వికృతులయొక్క ఉనికి అశాశ్వతము. అవి జన్మ, క్షయము, మృత్యువు అనువానికి లోనగుచున్నవి. కాని వీనికి మూలమైన యా ప్రకృతి శాశ్వతమైనది. అది స్వచ్ఛము, సంపూర్ణము. వికృతులైన పదార్థములు స్వతంత్రములైనట్లు కన్పించుచున్నను, అవి యథార్థముగా ఆ ప్రకృతిపై ఆధారపడియే యున్నవి.

విస్తృతి ఆలోచన ద్రవ్యముయొక్క విశేషణములని స్పైనోజా చెప్పెను. మనస్సులు, వస్తువులు రెండు విధములైన వికృతుల పరంపరలు. దేనిని తెలిసికొనుట వలన పదార్థముయొక్క సారమును గుర్తింపనగునో అది ఆ పదార్థముయొక్క విశేషణమని అతఁడు నిర్వచించెను. ప్రకృతికి విశేషణములు అనంతములుగా నుండఁగా మానవుని మనస్సునకు ఆలోచనము, విస్తృతి అన్నవి రెండే యున్నవి. ప్రతి విశేషణము (ఆలోచ

నము కాని విస్తృతి కాని) దాని జాతి యందు అవి అనంతముగ నుండును.

బాహిరములైన వస్తువులు లేక ద్రవ్యము అన్నదానిని తొలఁగించి లేబ్నిజ్, బెర్క్లీ అనువారు తాత్త్వికమైన ప్రకృతిని మాత్రమే గ్రహించినారు. ఫాల్కన్ బర్సు అను నతఁడు ఈ పెంపును ప్రశంసనీయముగా సంగ్రహించి చెప్పినాడు. "వస్తువుయొక్క, మనస్సుయొక్క పదార్థత్వము (పరస్పరస్వాతంత్ర్యము), వానియొక్క పరస్పరక్రియ (పాక్షికమైన, పరస్పరమైన యాథార్థత్వము) పొసఁగవు. వీనిలో ఏదేనొకటి మిథ్యమై పరిత్యజింపఁబడవలసి యున్నది. హాబ్స మొదలైన లోకాయతికులు మనస్సుయొక్క స్వాతంత్ర్యతను, బెర్క్లీ, లెబ్నిజ్ ద్రవ్యము యొక్క స్వాతంత్ర్యతను, అనియతకారణ వాదులు వస్తుమనస్సుల పరస్పర క్రియను నిరాకరించుచున్నారు.

లెబ్నిజ్ దృష్టిలో ఒక పదార్థము కాదు, అనంతములైన పదార్థము లున్నవి. ప్రతి పదార్థము లేక మోనాడ్ ఒక సమగ్రమైన ఆత్మిక శక్తి కేంద్రము. దాని దశ లన్నియు దాని యందే ఇమిడి యుండును. అతని దృష్టిలో పదార్థము క్రియారహితమైన విస్తృతి మాత్రము కాక శక్తిరూప మగుటచే మోనాడ్ యొక్క అతని భావన గుణాత్మకమై, మౌలికమై యున్నది. ప్రతి మోనాడ్ స్వక్రియాత్మక మని, అనఁగా బాహిరమైన వేఱొక పదార్థము దానిపై పనిచేయుట లేదని, కావున అన్యపదార్థ సంబంధమే లేదని, దానియందే గర్భితములై యున్న దశలు సాంగముగా ప్రకటము లగుచున్నవని అతఁడు చెప్పెను.

మోనాడ్ కిటికీలు లేనిదని లెబ్నిజ్ అనును. ప్రతిపదార్థము ఒక మోనాడ్ లేక మోనాడుల సముదాయముగ నుండును. దానికి చైతన్యము, స్పృహయు నుండును. చైతన్య మనఁగా ఒక దృక్పథమునుండి విశ్వముయొక్క ప్రత్యేకమైన యనుకరణము. ఏ రెండు మోనాడులకు ఏకరూపమైన చైతన్య ముండదు. ఇచ్చట చైతన్య మనఁగా బుద్ధిపూర్వకముగా ఒక వస్తువును గుర్తించుట కాదు. అట్టి గుర్తింపు కొన్ని మోనాడులలో మాత్రమే విశిష్టలక్షణముగా గోచరించును. మోనాడుల పరంపరలలో ఈ విశదత్వమునందు తరతమ భేదములు కలవు. అల్పిష్ఠమైన మోనాడులో నామమాత్రముగా నుండు నీ చైతన్యము గరిష్ఠమైన మోనాడులో, అనఁగా భగవంతునియందు అత్యంతము విశుద్ధము, విశదమునై యుండును. దేనిచే మోనాడు ఒక చైతన్య దశనుండి మఱియొక చైతన్య దశకు చేరుచుండునో ఆ కార్యశక్తియే స్పృహ. అదియే మోనాడులోని చైతన్య దశలయొక్క మార్పునకు హేతువు. స్పృహ యందు కూడ తరతమ భేదములు కలవు.

లెబ్నిజ్ దృష్టిలో ప్రతిమోనాడు ఒక మూసివేయఁబడిన విశ్వము. భగవంతుఁడు మోనాడులను సృష్టించినప్పుడు, వానిలో వానికి పరస్పరప్రభావము లేకున్నను అవి ఆనుకూల్యముతో కొనసాగునట్లు ఆయన ఏర్పాటు గావించెను. ఈ సిద్ధాంతమునకు 'ప్రాఙ్నిశ్చితానుకూల్య పద్ధతి' అని పేరు. ఈ సిద్ధాంతము కూడ సమస్యను పరిష్కరింప లేదు.

ప్రాభవయుక్తమైన యొక మోనాడుచేత, అనఁగా ఆత్మచేత, నిగ్రహింపఁబడుచున్న

యల్పములైన మోనాడుల గుత్తులే పదార్థములు. తన భూత భవిష్య ద్వర్తమాన దశల నన్నింటిని మోనాడ్ తనయందే కలిగి యుండును. దానిపాటి కది యొక విశ్వము. ఆత్మికమైన యణువు లేక తత్త్వము యొక్క అంశము అని మోనాడును లేబ్నిజ్ పేర్కొనెను.

హేతువాదుల దృష్టిలో (డెస్కార్టెస్, స్పైనోజా, లేబ్నిజ్) సకలసూత్రములు ప్రామాణికమైన సర్వజ్ఞానము పూర్వసిద్ధమై విశ్లేషణాత్మకమై యున్నది. పూర్వసిద్ధ యనఁగా అనుభూతికి పూర్వమే సిద్ధమైనదని యర్థము. కావుననే అది అనుభూతిపై ఆధారపడక స్వతంత్రమై యుండును. అనుభూతికి అనంతరమున సిద్ధించు జ్ఞానమునకు ఇది విరుద్ధము.

స్వానుభవప్రమాణ వాదుల దృష్టిలో (లాక్, బెర్కిలీ, హ్యూమ్) సకల సాధారణ సిద్ధాంతములు సూత్రములు— ఏ చిన్న విజ్ఞానవిషయమైనను అనుభూతికి అనంతరము సిద్ధమై, సంయోగాత్మకమై యుండును. భిన్నములును, విశిష్టములును అయిన యింద్రియ జన్యజ్ఞానములు, భావములు సమకూడుట వలన ఇది సంభవించుచున్న దన్నమాట. మనఃఫలకము సహజముగా స్వచ్ఛమై యుండునని చెప్పుదురు.

తత్త్వవేత్తలలో మహనీయుఁడైన కాంట్ ఈ రెండు సిద్ధాంతములకు సమత్వమును నెలకొల్పినాఁడు. అనుభూతి జన్యములు కానట్టివి పూర్వసిద్ధములును అయిన సూత్రములను ఆయన అంగీకరించును. కాని ఆ సూత్రములన్నియు సంయోగాత్మకములే కాని విశ్లేషణాత్మకములు కావని ఆతడు వాదించును. ఇంద్రియజన్యమైన యనుభూతిని ఆతఁడెప్పుడును నిరాకరింపఁడు. ఇంద్రియ జన్యజ్ఞానపూర్వకము కాని కేవల భావనలు శూన్యములే అని ఆతడు నొక్కి వక్కాణించును. కేవల భావనలవలన మనకు వస్తుస్థితి అందదు. అయినను ఈ పూర్వసిద్ధములైన సూత్రములు లేకుండ అనుభూతి కలుగుట సాధ్యముకాదని ఆతఁడనును. భావనారహితమైన జ్ఞానము గ్రుడ్డిదని యాతఁడు చెప్పును. పూర్వసిద్ధమనఁగా విశ్వజనీనము, ఆవశ్యకమును అయిన జ్ఞానమని యాతని యభిప్రాయము. గణితము, సకల శాస్త్రములును పూర్వసిద్ధములును, సంయోగాత్మకములును అయిన సిద్ధాంతములే అని కాంట్ అనును.

(స్వానుభవ ప్రమాణవాదులు తలంచునట్లుగా) "అవకాశము బాహిరములైన యనుభూతులవలన ఊహించి ఏర్పఱుపఁబడిన భావన కాదు" అని కాంట్ హెచ్చరించును. ఆతఁడింకను ఇట్లు చెప్పెను. "ఇంద్రియ జన్యములైన కొన్ని జ్ఞానములను నాకు వెలుపల నున్న యొక పదార్థమునకు సంబధించినవిగా చెప్పవలయు నన్నచో, అట్లే వానిని వెలుపల ఒకదానిప్రక్క మఱియొకటి యున్నట్లుగాను, అవి గుణముల చేత మాత్రమే భిన్నములు కాక భిన్న ప్రదేశములందు ఉన్నవి అని నిరూపింపవలయు నన్నను అవకాశము పూర్వసిద్ధమై యున్నదని అంగీకరింపక తప్పదు. కావున బాహిరములైన యనుభూతుల సంబంధముల వలన ఊహామాత్రముగ (Second hand) అవకాశమును నిరూపించుట సాధ్యముకాదు. అవకాశము మూలముననే బాహిరమైన యీ యనుభూతి సాధ్యమగుచున్నది." అవకాశమునందు ఉన్న పదార్థములను

గూర్చి ఎట్లో ఊహింపఁగలము కాని అవకాశమునే ఊహింపఁజాలము. అనేకములైన యవకాశములు ఉండుటకు వీలులేదు. అనంతమైన యవకాశము ఒక్కటియే యున్నది. ఆలోచనలను, ఊహలను అనుసరించి విస్తృతమై యున్న యీ యొక్క యవకాశమునందే పరిమితములైన పెక్కు యవకాశములను గూర్చి అనుకొన వచ్చును. ఈ హేతువాదము లన్నియు ఆవశ్యకములైన కొన్ని మార్పులతో కాలమునకు కూడ అన్వయించును. అవకాశము, కాలము అనునవి బాహిరమైన సర్వభావమునకు రూపము నొసంగునవి యనియు, కావున అవి ఇంద్రియజన్యజ్ఞానములకు పూర్వసిద్ధము లనియు, మఱియును అవి అల్పములైన యంశముల కూడిక చేత ఏర్పడలేదని అనంతములుగా, అఖండములుగా నున్నవనియు ఆతఁడు నమ్మెను.

బహువిషయికమైన యాలోచనకు సంబంధించిన భేదములను పూర్వసిద్ధములైనవానిని ఆవిష్కరించుటకు కాంట్ ప్రమాణశక్తిని విమర్శించెను. భావనల సంయోగాత్మక నిరూపణముచేతనే అనుభూతి సాధ్యమగుచున్నది. అనఁగా భావనా భేదముల సంయోగము లేకున్నచో జ్ఞానమే సాధ్యము కాదన్నమాట. ద్రవ్యము, కార్యకారణభావము, పరస్పర సంబంధము అని యీ భేదములను మూఁడుగా ఆతఁడు విభజించెను.

మార్పు లన్నిటి యందును ద్రవ్యము శాశ్వతముగా నుండును. ప్రకృతిలో దాని మొత్తపురాశి పెరుగదు, తరుగదు. రెండవదియైన కార్యకారణ భావము ననుసరించి మార్పు లన్నియు కార్యకారణ సంబంధ సూత్రమును అనుసరించియే సంభవించును. మనము గ్రహింపఁగలిగినంతవఱకు అవకాశమునందు ఒకదాని ప్రక్క వేఱొకటిగా నున్న పదార్థము లన్నియు తప్పనిసరిగా పరస్పరసంబద్ధములై యున్నవని కాంట్ చెప్పెను. ఇట్లు కాంట్ పదార్థములను కేవలము అభిన్నత్వముతో కాక, ఇతర పదార్థములతో వానికిఁ గల సంబంధముల యందు వ్యక్తమగుచున్న "భిన్నత్వములో ఏకరూపత్వము" అను దృష్టితో గ్రహించును.

*

సప్తమ పరిచ్ఛేదము

# బ్రహ్మము, జీవాత్మ, విశ్వము అనువానిని గూర్చి హిందువుల భావన

## (అ) లోకాయతవాదము

"ప్రబోధ చంద్రోదయము" లోని ద్వితీయాంకమున ఈ లోకాయత సిద్ధాంతము యొక్క సారము చక్కఁగా వర్ణింపఁబడినది. ఎప్పుడైనను లోకాయత మొక్కటే శాస్త్రము. దానియందు ప్రత్యక్షమే ప్రమాణము. నేల, నీరు, నిప్పు, గాలి అనునవియే భూతములు. సంపద్భోగములే మానవ జీవితమునకు లక్ష్యములు. ద్రవ్యము ఆలోచింపఁగలదు. పరలోకము లేదు. మరణముతో సర్వము అంతము నొందును." ఈ లోకమే యున్నదని యుద్ఘాటించుటవలన ఈ శాస్త్రము లోకాయతముగా ప్రసిద్ధమైనది. ద్రవ్య ప్రాధాన్యవాదులను లోకాయతికు లందురు. వీరిని చార్వాకులనియు పేర్కొందురు. వారికి ఏది కన్పించునో అదే యుండును. ఏది కన్పింపదో అది యుండదు. అనుమానము వారికి ప్రమాణము కాదు. ద్రవ్య మొక్కటియే వారికి సత్యము. అది ఇంద్రియములకు గ్రాహ్యమై యుండును. నేల, నీరు, నిప్పు, గాలి వారికి పరమ సత్యములు. ఈ నాల్గు తత్త్వములయందు కలుగునట్టి యొక వికృతియే బుద్ధి శక్తి. వీనికి వినియోగము కలిగినప్పుడు బుద్ధి శక్తి నశించును.

లోకాయతికుల ప్రత్యక్ష ప్రమాణవాదమును అనేకమతములు విమర్శించినవి. సాంఖ్యతత్త్వకౌముదిలో అది యిట్లు విమర్శింపఁబడినది. "అనుమానము జ్ఞానమునకు ప్రమాణము కాదని లోకాయతికుఁడన్నప్పుడు, ఒకానొకఁడు అజ్ఞుఁడై యున్నాఁడో, సంశయించుచున్నాఁడో, పొరపాటు పడుచున్నాఁడో తాను ఎట్లు తెలిసికొనఁగలఁడు? అజ్ఞానము, సంశయము, భ్రమ అనునవి ఇంద్రియములకు గోచరించుట సాధ్యము కాదు కదా! కావున లోకాయతికుఁడు కూడ, ఇతరుని వర్తనము వలన, ప్రసంగము వలన వాని యందున్న యజ్ఞానము మొదలగు వానిని గ్రహింపవలసి యున్నది. కాఁబట్టి తనకు ఇష్టము లేకపోయినను లోకాయతికుఁడు అనుమానమును ప్రమాణముగా గుర్తింపవలసియే యున్నది." శూన్యవాదము, సంశయవాదము కూడ ప్రత్యక్ష ప్రమాణమును విశ్వసించును.

ఈ పద్ధతు లేవియును తర్కమునకు నిలుచునవి కావు; మనలను చరమ లక్ష్యమునకుఁ గొనిపోవు నట్టివియును కావు.

## (ఆ) జైనమతము

వేదమును ప్రమాణముగా అంగీకరింపక పోవుటచే జైనము అసంప్రదాయ పద్ధతి

మైనది. జినుఁడు లేక విజేత అను బిరుదము గల వర్ధమానుని యనుయాయులు జైనులు. హీనమైన ప్రకృతిని జయించుట, ఉన్నతతమమైన ప్రకృతిని సంపాదించుకొనుట జైనులకు లక్ష్యములు. అనుభూతి ననుసరించి పదార్థములను విభజించి జైనము అనేకాత్మభావమును స్థాపించు చున్నది. ప్రపంచమంతయు మోనాడులతో నిండి యున్నదని లేబ్నిజ్ ఎట్లు తలంచెనో, అట్లే జైనులును విశ్వమంతయు జీవులతో నిండి యున్నదని చెప్పుదురు. లేబ్నిజ్ యొక్క మోనాడుల విధానముతో, బెర్గ్సన్ యొక్క సృజనాత్మక పరిణామవాదముతో జైనమునకు సామ్యము లున్నవి. జీవుఁడు అస్తిత్వము గల పదార్థము.

వేదాంతము ననుసరించి ద్రవ్యము నుండి ముక్తుఁడైన జీవుఁడు ఆత్మయని చెప్పఁబడును. ఆత్మ ద్రవ్యసంబంధరహితమై, స్వచ్ఛమైన చైతన్యముగా నుండును. ఆత్మ అవకాశభావనకు అతీతము. ఆత్మ పవిత్రము, నిర్విశేషచిన్మాత్రము. నాస్తిత్వమునకు విరుద్ధమైనది ద్రవ్యము. జీవుఁడు ద్రవ్యాత్మల సంయోగ రూపుఁడు. ద్రవ్యభరితమైన యాత్మయే జీవుఁడు. జీవుఁడు సంసార బద్ధుఁడు. సర్వజ్ఞత్వముగల యాత్మయే సత్తు. జీవునకు పరిమితత్వమును గలిగించు నంశమే అసత్తు. అది ఆత్మయొక్క సర్వజ్ఞ ప్రకృతిని కప్పివేయుచున్నది. కావున అసత్తే వ్యక్తిత్వమునకు పునాది. శరీర భేదముల ననుసరించి అనేకవిధములుగా జీవులు, లోహములు, మొక్కలు, జంతువులు, మనుష్యులు, దేవతలు వున్నారని చెప్పుచున్నారు. పరమ కారణముగా ఆ శరీరముల యందున్న పరమాత్మ అన్నింటను సమముగా, ఏకముగా నున్నది. అయినను శరీరముల యందు తారతమ్య మున్నది. చేతనత్వము జీవుని ప్రకృతి.

కాని జైనము ఆత్మయొక్క పారమ్యమును నిరాకరించుచు అనేకత్వమును విశ్వసించుచున్నది. పరిశుద్ధమైన యాత్మయే వారికి పరమేశ్వరుఁడు. పరిమితులను తొలఁగించుకొనఁ గలిగినంతనే జీవునకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించును. జీవునకు అజీవ పదార్థముతో సంబంధము కర్మవలనఁ గలుగుచున్నది. అజీవపదార్థము నుండి పూర్తిగా బయల్పడుటయే జీవునకు మోక్షము. మోక్ష మనఁగా ఆత్మవినాశము కాదు. నిరంతరమైన యూర్ధ్వ గమనమే మోక్ష మని వారందురు. కర్మ ప్రభావము ఆగిపోయినప్పుడే ఇది సాధ్యమగును. తప్పుడు విశ్వాసము వలన బంధము కలుగుచున్నది. అదియే ఆత్మను శరీరముతో బంధించుచున్నది. జైనమునకు ప్రధాన లక్షణము అహింస.

### (ఇ) బౌద్ధము

బౌద్ధమతమునకు స్థాపకుఁడైన బుద్ధుఁడు సన్న్యాసావతారము. బౌద్ధమునకు ముఖ్య లక్షణము అహింస. ఇది కూడ వేద ప్రామాణ్యమును అంగీకరింపదు. పూర్వాభ్యాస బలమున వ్యావహారిక ప్రపంచము సత్యముగా గ్రహింపఁబడుచున్నదని ఆ మతమునందు చెప్పఁబడుచున్నది. సకల వ్యథలకు మనస్సే మూలము. బాధ, వ్యథ, సుఖము, సంతోషము అవిద్యాకార్యములు. వస్తు స్థితికి సంబంధించిన యసత్యములైన యభిప్రాయములను మనము ఎప్పుడు అంత మొందించుకొనఁగలమో అప్పుడు నిర్వాణము లభించును. సంసారముయొక్క నిజ

స్థితిని గ్రహించుటయే నిర్వాణమని వారందురు. ఈ సత్యము పరమమైనది. శూన్యమును గూర్చి చెప్పిన దంతయు నిర్వాణమునకు అన్వయించును. నాగార్జునుఁడు ఇట్లు చెప్పెను. "ఏది అసంపూర్ణము కాదో, ఏది సంపాదితము కాదో, ఏది సాంతరము కాదో, ఏది నిరంతరము కాదో, ఏది వర్ణింప వీలు లేనిదో, ఏది సృష్టింపఁబడ లేదో అది నిర్వాణమని చెప్పఁబడును." నిర్వాణము అప్రాప్యమనికూడ చెప్పఁబడినది. అజ్ఞానము మాత్రమే తొలఁగింపఁబడవలయును. ముక్తిని గోరువారు దానము, నీతివర్తనము, క్షమ, ఉద్యోగపరత్వము, ధ్యానము, పరమవివేకము అను గుణములను అభ్యసించుచు వానియందు సంపూర్ణతను సాధింపవలయును.

అద్వైత వేదాంతములోని నిర్గుణ బ్రహ్మము, నాగార్జునుని శూన్యము ఒకటిగా తోఁచును. నిజమునకు అవి ఒకటి కాదు. బౌద్ధము శూన్యముతో ముగియును. అద్వైతము సచ్చిదానందమున ముగియును.

(ఈ) షడ్దర్శనములు

హిందూతత్త్వశాస్త్రమున సాంప్రదాయికములైన దర్శనములు ఆఱు కలవు. న్యాయము, వైశేషికము, సాంఖ్యము, యోగము, మీమాంస, వేదాంతము అని అవి ప్రసిద్ధములై యున్నవి. సాంప్రదాయికమైన విధానమునకు వేదములయందు ప్రమాణబుద్ధి ఉన్నదా, లేదా అనునదియే మొదటిపరీక్ష. భగవంతుని యస్తిత్వమునందు విశ్వాసము కలిగియుండుటలో విశేషము లేదు. తత్త్వదృష్టియందు మానవుఁడు సాధింపవలసిన లక్ష్యమును స్పష్టముగ నిర్ణయించి, దానిని చేరుకోఁదగిన విధానము ప్రతి తత్త్వశాస్త్రముచేతను నిరూపింపఁబడినది. సాధింపఁదగిన లక్ష్యము మోక్షము. మోక్షమునకు సంబంధించిన యభిప్రాయము ప్రతి శాస్త్రమునందు భిన్నముగ నున్నది. ఐనను అఖిలశాస్త్రములు ముక్తుఁడైన జీవుఁడు మానసిక శారీరక బాధలనుండి విడివడునని అంగీకరించుచున్నవి. ముక్తులైన జీవులు జన్మమృత్యువులనుండి విడివడుదురు. జనన మరణ చక్రమే సంసార బంధమని ప్రసిద్ధమై యున్నది. ఈ బంధమునుండి విముక్తి పొందవలయును.

మోక్షసిద్ధికై ఆవశ్యకమైన, నిశ్చితమైన క్రమశిక్షణ విధానమును గూర్చి ప్రతి శాస్త్రము నొక్కి చెప్పుచున్నది. సాంఘికములు, నైతికములు అయిన గుణములను అభ్యసింపవలసిన యావశ్యకత కలదు. కొన్ని శాస్త్రములు భగవంతుఁ డున్నాఁడని అంగీకరించినను మఱికొన్ని అంగీకరింపవు. వైశేషికము, సాంఖ్యము, మీమాంసయు స్పష్టముగ ఈ విషయమున నాస్తికములే. కుమారిలభట్టు మతమున భగవంతుని యునికికి తావు లేదు. కాని భట్టప్రభాకరుఁడు అనేక దేవతల నంగీకరించెను. నాస్తికమతము జీవుఁడు తనకు సహజమైన సంపూర్ణతను మఱల సంపాదించుకొనుటయే ముక్తి యని విశ్వసించును. న్యాయము, వేదాంతము భగవంతుఁడున్నాఁడని అంగీకరించుచున్నవి. మనము భగవంతుని యనుగ్రహముచేతనే మోక్షమును పొందఁగలమని అవి చెప్పుచున్నవి. యోగాభ్యాసముతో కూడ భగవంతునియందు భక్తి యుండవలయునని యోగమతము సూచించుచున్నది.

ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అను మూడు ప్రమాణములను శాస్త్రములు సాధారణముగా అంగీకరించుచున్నవి. ప్రమాణములను గూర్చి అనేక సిద్ధాంతములు కలవు. జ్ఞానము అను పదము యొక్క అర్థము గూర్చి చర్చింపబడినది. ఆ జ్ఞాన సంపాదనమునకై మార్గములు ప్రదర్శింపబడినవి. న్యాయశాస్త్రములోని తర్క పరిభాషలు అన్ని శాస్త్రముల యందును ఉపయోగింపబడి యున్నవి.

ఈ విశ్వము సువ్యవస్థితమే కాని అవ్యవస్థితము కాదని ప్రతిశాస్త్రము విశ్వసించుచున్నది. విశ్వమునందు ఒక నీతివిధానమున్నది. ఒక నీతియొక్క లక్ష్యముతో విశ్వము పరిపాలింపబడుచున్నది. మన మీ జన్మములో చేయు మంచిపనికి మంచి ఫలము లేకుండ పోదు. చెడ్డపనులకు శిక్షయును తప్పదు. పునర్జన్మము, పూర్వజన్మము ఉన్నవని అంగీకరింపబడుచున్నది. ప్రతిశాస్త్రము కర్మసిద్ధాంతము తప్పనిసరి యని అంగీకరించుచున్నది. ప్రతివ్యక్తియు తాను చేయుచున్న మంచిపనులకు, చెడుపనులకు బాధ్యుడగుచున్నాడు. మానవుని యొక్క చేష్టలు ఏదేని ఒక యనూహ్యమైన విధివలన సంభవించుట లేదు. ప్రతి జీవునియొక్క జన్మాదికములైన పరిస్థితులు పూర్వకర్మచే నిశ్చితములు అగుచున్నవి. కాని కర్తయైన జీవునియొక్క సంకల్పము మాత్రము అట్లు నిశ్చితమగుట లేదు. పూర్వజన్మ కర్మ యిప్పటి జన్మముయొక్క పరిస్థితులను మాత్రమే నిశ్చయించును. వ్యక్తియయిన జీవుడు స్వతంత్రుడు, కర్త. ఇంచుమించుగ శాస్త్రము లన్నియు స్వర్గ నరకము లున్నవని, వానియందు జీవుడు సుకృత దుష్కృత ఫలములను అనుభవించునని నమ్ముచున్నవి.

## 1. న్యాయశాస్త్రము

న్యాయ వైశేషికములు సమానముగ నుండును. అవి హిందువుల తాత్త్విక చింతనములోని బహుత్వ వాస్తవికత్వ విభాగములను ప్రదర్శించుచున్నవి. శాస్త్రీయము, విమర్శనాత్మకము అయిన విచారణ విధానమును మిగుల వివరమైన పద్ధతిలో నెలకొల్పుటయందు న్యాయశాస్త్రము ప్రసిద్ధమై యున్నది. జ్ఞాన ప్రమాణములను గూర్చిన సమస్యలు స్పష్టతతో, విమర్శనతో ఇందు నిరూపింపబడి యున్నవి. జ్ఞానము యొక్క ప్రమాణములు, వానిలోని దోషములు చాల సరళమైన పద్ధతిలో వివరింపబడినవి. తక్కిన శాస్త్రముల యభ్యాసమునకు, న్యాయశాస్త్రాభ్యాసము తప్పనిసరి యని చెప్పుదురు. ద్రవ్యము, జీవుల బహుత్వమును, ఈశ్వరుని న్యాయశాస్త్రము అంగీకరించుచున్నది. ఇవి అన్నియు ఒక కాలమున ప్రవర్తించినవి. ఈ శాస్త్రమున ప్రతిపాదింపబడిన పదునారు విధములైన పదార్థముల పరిజ్ఞానముతోపాటు, నియతమైన నీతివర్తనమును కలిగియున్నచో జీవుడు ముక్తి నొందగలడు. ఈ న్యాయశాస్త్రమునకు అనుమితిజ్ఞానము పునాది. భగవంతుని వాక్యము లగుటచే వేదములు ప్రమాణములని వీరు చెప్పుదురు. ద్రవ్యమునకు ఆత్యంతిక రూపమైన యణువు విశ్వమునకు ఉపాదాన కారణము కాగా ఈశ్వరుడు నిమిత్త కారణము అగుచున్నాడు. సంతోషములు, దుఃఖములు తొలగిపోయి నిశ్చలమైన సమస్థితిని కల్గియుండుటయే ముక్తి యని యీ శాస్త్రమున ప్రసిద్ధమై యున్నది.

## 2. వైశేషికశాస్త్రము

వైశేషికశాస్త్రము అష్టవిధములైన పదార్థములను మాత్రమే ప్రతిపాదించుచున్నది. విశ్వములోని యవయవ విభాగముల యొక్క, ఈ పదార్థముల యొక్క పరిశీలనమే వైశేషిక శాస్త్రములో ప్రధాన సిద్ధాంతములుగ నున్నవి. ద్రవ్యమునకు సంబంధించిన మొట్టమొదటి శాస్త్రీయ వర్ణనమైన యణు సిద్ధాంతము ఈ శాస్త్రమున కన్పించుచున్నది. ఈ శాస్త్రము తక్కిన శాస్త్రముల కన్నను విమర్శనాత్మకముగ, శాస్త్రీయముగ నుండును. ఈ శాస్త్రము బహుత్వ లక్షణమును నిరూపించుచున్నది. ఇది ఏకరూపమైన పదార్థమునందు అనేకత్వమేర్పడుచున్నదని నొక్కి చెప్పుచున్నది.

## 3. సాంఖ్యశాస్త్రము

సాంఖ్యశాస్త్రము చాల కళాత్మకమైనది. ఈ శాస్త్రము జీవుల బహుత్వమును, అచేతనము అవ్యక్తము నైన ప్రకృతిని ప్రతిపాదించుచున్నది. ఈ శాస్త్రము చలనము అను దానిని గుర్తించినది. జీవనము, బుద్ధిపూర్వకమైన చేష్ట ప్రకృతి వలన సంభవించునవి కావు. జీవునకు ప్రకృతి తోడి తాదాత్మ్యము వలన పరిణామము సంభవించుచున్నది. విశ్వమంతయు ప్రకృతి పరిణామ కార్యమే. పరిణామ యోగ్యములైన పదార్థములు ఇరువదిమూఁడున్నవి. ప్రకృతి పురుషుల యసత్యరూపమైన తాదాత్మ్యమువలననే మానవులకుదుఃఖములు కలుగుచున్నవి. ప్రకృతి మాత్రమే పరిణమించుచున్నది కాని పురుషున కెట్టిమార్పును సంభవించుట లేదు అను వివేకజ్ఞానము వలన ముక్తి కలుగును. యథార్థ జ్ఞానమే మోక్షమునకు సాధనము. భగవంతుని యొక్క యునికిని అంగీకరింప వలసిన యక్కఱ లేదని సాంఖ్యులు భావించుచున్నారు. ముక్తుఁడైన జీవుఁడు దుఃఖ విముక్తుఁడగును. ఈ శాస్త్రము హిందూ తత్త్వచింతనములోని ద్వైతపద్ధతిని నిరూపించు చున్నది.

## 4. యోగశాస్త్రము

పతంజలియొక్క యోగమతము సాంఖ్య శాస్త్రములోని తత్త్వ విచారణమును దాని లక్ష్యమును అంగీకరించుచున్నది. అష్టాంగమైన యోగమును పతంజలి స్థాపించెను. ఈ యోగము వలన ప్రకృతి పురుషులకు సంబంధించిన వివేకమును పొందవచ్చును. భౌతికములు, మానసికము లైన గుణములను అభ్యసింప వలయును. ప్రాణాయామము ఆవశ్యకము. గాఢమైన యేకాగ్రత ముఖ్యము. ఇంద్రియ విషయములపై వాంఛను ఖండింప వలయును. నిరంతర యోగాభ్యాసముచేత సత్యమును సాక్షాత్కరించుకొనవలయును. భగవంతునియందు భక్తికూడ ఇందు సూచింపఁబడినది. సంపూర్ణత నొందిన మానవ వ్యక్తియే భగవంతుఁడని యిందు ప్రతిపాదింపఁబడుచున్నది. ఈశ్వరుఁడు విశ్వమునకు కర్త కాదు; పోషకుఁడు కాదు; శాంతి చాల విలువకలదని యోగశాస్త్రము వక్కాణించుచున్నది. వ్యక్తియందుండు పెక్కు శక్తులను యోగము నిర్దేశించుచున్నది. నిరంతరాభ్యాసముచేత మహాకార్యములను సాధింప వచ్చును. యోగాభ్యాసమునందు విశ్వాసమును, నైపుణ్యమును గల మానవునకు అసాధ్య మేదియును లేదు.

## 5. మీమాంసాశాస్త్రము

సకలశాస్త్రములలో జైమిని యొక్క మీమాంస అత్యంతము విపుల మయినది. ధర్మములు, నీతులు ఈ శాస్త్రమునకు పునాదులు. ఇది భగవంతుని యస్తిత్వము నంగీకరింపదు. వేదములు నిత్యము లని, అవి ఎవనిచేతను కూర్పఁబడలేదని మీమాంసకులు చెప్పుదురు. విశ్వమున ఒక నైతిక వ్యవస్థ ఉన్నదని వారందురు. వేదమున చెప్పఁబడిన దేవతలు ఈ వ్యవస్థను నిర్ణయించుచు పాలించుచుందురు. సత్కార్యము వలన పుణ్యము, దుష్కార్యము వలన పాపము కలుగును. కృత్యముల స్వభావము ననుసరించి సత్ఫలములను, శిక్షలను, అదృష్ట మను సంశము ఇచ్చుచుండును. క్రియ, ప్రతిక్రియ అనువానిచే జీవితము పరిపాలింపఁబడుచున్నదని వీరు చెప్పుదురు. ఇది అత్యంతము ప్రయోజనాత్మకమైన శాస్త్రము.

## 6. వేదాంతశాస్త్రము

వేదాంతశాస్త్రమున అయిదు మతము లున్నవి. శంకరుఁడు, రామానుజుఁడు, నింబార్కుఁడు, మధ్వుఁడు, వల్లభుఁడు అనువారు ఈ మతమును ప్రవర్తింపఁజేసిరి. (అ) ఏకమైన బ్రహ్మ మొక్కటియే సత్యము గాని అనేకత్వ మంతయు మిథ్య అని శంకరుఁడు చెప్పెను. తక్కిన యాచార్య పురుషు లందఱికన్నను ఆదిశంకరాచార్యుల వారు ఉపనిషత్తులలోని తత్త్వమును మిగుల విశదముగ, తార్కికముగ వివరించినారనుట సుప్రసిద్ధము, కేవలాద్వైతము. ఈతని సిద్ధాంతము బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య అను నాలుగు సంస్కృత పదములతో దీనిని సులభముగ వివరింపవచ్చును. శంకరులవారు విశ్వము యొక్క అస్తిత్వము నిరాకరింపలేదు. విశ్వము ఉన్నదానివలె కనఁబడుచున్నదని ఆయన చెప్పెను. సత్యమైనది బ్రహ్మమే. తక్కిన దంతయు ఉన్నట్లు కనఁబడుటయే. ఉన్నదానిపై లేనిదానిని కల్పించుటకే మాయ యని పేరు. అద్వైతము సృష్టియంతయు మనోవృత్తులే యని చెప్పు సిద్ధాంతము కాదు. అయథార్థము, అసత్యము, కల్పితము. దీనిని బ్రహ్మముపై ఆరోపించుట జరిగినది. జీవుఁడు బ్రహ్మమే తప్ప అన్యము కాదు. తన్ను గూర్చి అనఁగా బ్రహ్మము గూర్చి తెలిసికొనుటయే మోక్షము. అనఁగా ఆత్మజ్ఞానమే మోక్షమన్నమాట.

(ఆ) ఏకత్వ, బహుత్వములు రెండును వాస్తవములే యని రామానుజుఁడు అనును. జీవులు, విశ్వము వాస్తవముగ, సహజముగ పరబ్రహ్మము కన్నను భిన్నములే మైనను అభిన్నముగ కూడ నుండునని ఆయన వచించును. జీవులు, ప్రాణి, ప్రపంచము బ్రహ్మము కన్న భిన్నముగ స్వతంత్ర స్థితిని కల్గి యుండవు. చిత్తు, అచిత్తు అనఁగా చిత్ప్రపంచము, అచిత్ప్రపంచము పరబ్రహ్మమునకు శరీరమని, కావున ఆయనకు విశేషణములని యిందు ప్రతిపాదింపఁబడుచున్నది.

(ఇ) పరబ్రహ్మమును గుర్తించుటకు జీవులు, అచేతన ప్రపంచము తప్ప వేఱేమియు లేకుండుటచే అవియే ఆయనను నిరూపించు విశేషణములనియు కావున భిన్నత్వము, అభిన్నత్వము యథార్థములేయని నింబార్కుఁడుద్ఘాటించును.

(ఈ) మధ్వాచార్యుఁడు ఏకత్వమును పూర్తిగ నిరాకరించి ద్వైతమే సత్యమని

ఉద్ఘాటించెను. ఉపాసన కొఱకు లేదా ధ్యానము కొఱకు మాత్రమే ఏకత్వము నిరూపింపఁబడినది. 'ఆయన తత్త్వమసి' అను వాక్యమునకు 'అతత్త్వమసి' అను నర్థమును చెప్పుటకు గూడ సాహసించెను.

(ఉ) వల్లభాచార్యుఁడు మాయా సిద్ధాంతమును నమ్మక అత్యంత పవిత్ర స్థితియందు జీవుఁడు పరబ్రహ్మముతో ఏకరూపత్వము నొందునని ప్రతిపాదించెను.

విశ్వమునకు పరమ కారణము బ్రహ్మమని, అది నిత్యమై సర్వవ్యాపకముగ నున్నదని, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, గీత తమ సిద్ధాంతమునకు పునాదులు అని యీ యయిదు మతములవారు అంగీకరింతురు. వీరందఱును వేదములను ప్రమాణముగ స్వీకరింతురు. వేదవాక్యముతో విరోధము లేనంతవఱకు తర్కము అంగీకరింపఁబడును. వైదిక కర్మలు మోక్షసంపాదనమున చిత్తపారిశుద్ధ్యము కొఱకై ఉద్దేశింపఁబడినవని వీరు చెప్పుదురు. శంకరులవారిట్లు చెప్పుచున్నారు :

శ్లో. చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే
వస్తు సిద్ధి ర్విచారేణ న కించిత్ కర్మకోటిభిః ॥

"చిత్తముయొక్క శుద్ధి కొఱకే కాని, వస్తువుయొక్క ఉపలబ్ధికొఱకు కర్మ ఉపయోగ పడదు. వస్తువుయొక్క సిద్ధి విచారణముచేతనే కలుగును. కాని కోట్లకొలఁది కర్మలచేత కొంచెము కూడ కలుగదు."

వస్తుసిద్ధి అనఁగా మోక్షసిద్ధి నిత్యానిత్య విచారణచేతనే ప్రాప్తించునని శంకరులవా రుద్ఘాటించుచుండఁగ ఇతర మతములవారు మోక్షము కొఱకు భక్తిపై ఆధారపడుచున్నారు. ఈ యయిదు మతములును మోక్షసంపాదనమునకు సన్న్యాసము ఆవశ్యకమని నొక్కి వక్కాణించుచున్నవి.

మోక్షమనఁగా జననమరణ రూపమైన యనాది సంసారము నుండి విముక్తి నొందుటయే యని వీరు ప్రతిపాదించుచున్నారు.

*

# మోక్షమనఁగా నేమి? దాని నెట్లు పొందవచ్చును?

ప్రశ్న : మోక్ష మనఁగా నేమి?

సమాధానము : "ముచ్" అను ధాతువు నుండి మోక్ష శబ్దము ఏర్పడుచున్నది.

ప్రశ్న : దేనినుండి అని ప్రశ్నింపవలసి యున్నది.

సమా : బంధమునుండి విడుదల.

ప్రశ్న : ఏది బంధము?

సమా : సంసారమే బంధము.

ప్రశ్న : ఎందువలన?

సమా : సంసారము జనన మరణాత్మక మగుట వలన.

సాధారణమైన యర్థమున సంసార మనఁగా జీవునియొక్క జనన మరణ రూప చక్రమే. ఈ చక్రమునుండి విడివడుటకే ప్రయత్నింపవలె. ఇట్టివానిని ముముక్షు వందురు.

ఆత్మవిచారణ ఎప్పుడును ఉత్తమ పురుషలో ఏకవచనమున "నేను" అనియే జరుగవలయును.

ప్రశ్న : ఈ సంసారము ఎవనికి?

సమా : ఈ సంసారము నాకే యున్నది. కావుననే ఈ బంధమునుండి విడఁబడవలయు నని కోరుచున్నాను. మోక్షము అనునది సంపాదించుటకు, అది యొక పదార్థముగాదు. ఈ బంధమునుండి విడివడఁగోరుచున్న నే నెవఁడో తెలిసికోవలసి యున్నది. దానికై బ్రహ్మమునుగూర్చి తెలిసికోవలయు ననియు, ఆ బ్రహ్మ విచారణమునకు మొదట సాధనచతుష్టయ సంపత్తి కలవాఁడై యుండ వలయుననియు శాస్త్రములు చెప్పుచున్నవి. కావుననే "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అని మొట్టమొదటి బ్రహ్మసూత్రమే చెప్పు చున్నది. ఇచ్చట "పిదప" అనఁగా సాధన చతుష్టయ సంపత్తి కలిగిన తరువాత అని యర్థము. ఆ సంపత్తి కలిగిన తరువాత బ్రహ్మ విచారణమునకు అధికారము ఏర్ప డును. అనఁగా బ్రహ్మమును తెలిసికోవలయు నను నిచ్ఛకలుగునన్నమాట. విచారణమున అధికారము కలుగవలెనన్నచో సాధన చతుష్టయము ఆవశ్యకము. అవి యివి,

1. నిత్యానిత్య వస్తువివేకము,
2. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము,
3. శమ దమాది షట్క సంపత్తి,
4. ముముక్షుత్వములోను నిండి నిబిడమై

యున్నప్రతివ్యక్తి యాత్మబ్రహ్మమే యగుట చేత బ్రహ్మముయొక్క ఉనికి సహజముగానే తెలియుచుండును. ప్రతివ్యక్తియు తన యునికిని గుర్తించుచునే యున్నాఁడు. ఎప్పుడును "నేను లేను" అని యను

కొనుట లేదు. ఆలోచించువాఁడు ఎప్పుడును ఉండి తీరవలసినదే. మనము దేనినైనను సంశయింప వచ్చును గాని, సందేహించుచున్నవాని యునికి మాత్రము సంశయింపఁ జాలము. నిజమునకు ఈ యాత్మయే బ్రహ్మము. నిత్యముగా, శుద్ధముగా, బుద్ధముగా, స్వతంత్రముగా నుండుటయే దీని స్వభావము. ఆ బ్రహ్మమే తమ యాత్మయని అందఱకు తెలియుచున్నచో విచారణ అవసరమే లేదు. అజ్ఞానముచేత అటుల తెలియుట లేదు. కావుననే విచారణ అవసరమైనది.

భగవద్గీతలో అర్జునుని దృష్టాంతమును గైకొని బ్రహ్మవిచారము ఎట్లుండునో పరిశీలింతము. అన్నింటిలో గీతలోని మొదటి యధ్యాయము ముఖ్యమైనది. అర్జునుఁడు ముముక్షువై బ్రహ్మవిచారమునకు ఎట్లు అధికారి యయ్యెనో దీనియందు స్పష్టముగా తెలియును. శస్త్రప్రయోగము జరుగఁబోవుచుండఁగా అర్జునుఁడు విల్లు గైకొని "ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః" అన్నదానితో అర్జునుని దైన్యము ఆరంభమగుచున్నది. తాను ఎవరితో యుద్ధము చేయవలసి యున్నదో వారిని పరిశీలించుటకు రథమును రెండు సైన్యముల మధ్యకు తీసికొని పొమ్మని అర్జునుఁడు శ్రీకృష్ణుని కోరెను. తాను ఎవరితో పోరాడవలసి యున్నదో ఆ శత్రువులలో వ్యక్తులందఱును అర్జునునకు తెలియనివారని కాదు. అయినను అతని కేదో అంతుచిక్కని సందేహము ఆవరించినది. ఆతని దృక్పథమునందు మార్పు కలుగుటలో ఇది మొదటి దశ. తనకు ఆత్మీయులైనవారి నందఱను చూచుటతోడనే శోక మాతనిని ముంచివైచినది. ఆతని శరీరము కంపించినది. గాండీవము జాఱిపోఁ జొచ్చినది. ఆతనికి శకునములు తోఁచెను. ఆతఁడు విజయమునందుఁగాని, రాజ్యమునందుఁగాని, భోగమునందుఁగాని కాంక్ష లేనివాఁడయ్యెను. ఈ రాజ్యములతో, భోగములతో, జీవితముతో నైన ఏమి ప్రయోజన మని యాతఁడు తుదకు ఆక్రోశించెను. యుద్ధము చేయవలయునా లేదా అని తనలో తాను వితర్కించుకొని, శ్రీకృష్ణునకు తనకు కలిగిన సంకటమును వివరించి శోకముచే మనస్సు కలఁత నొందఁగా శర చాపములను వదలి యుద్ధరంగ మధ్యమున రథమునందు వెనుకకు చతికిలఁబడెను.

శ్లో॥ ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః ॥
(గీత. 1-47)

అర్జునుని దైన్యమున ఇది రెండవ దశ. ఈ మార్పు యతి యొక్క దృక్పథమునకు అనుగుణమైనది. తా నెందులకై యుద్ధము చేయుటకు వచ్చెనో ఆ విషయమును విస్మరించెను. ఆతఁడు శోకసముద్రమున మునిఁగిపోయెను. యుద్ధరంగ మధ్యమున ఉన్నప్పటికిని అతఁడు శర చాపములను వదలిపెట్టెను.

అతఁడు కన్నీరు కార్చఁజొచ్చెను. శ్రీకృష్ణుఁడు ఆతనిని ఓదార్చి, దైన్యము నొందవలదని ఉద్బోధించెను. ఐనను దానివలన ప్రయోజనము కలుగలేదు. అర్జునుఁడు కర్తవ్యవిమూఢుఁడై యుండెను. ఆతఁడు మంచిని, చెడును, ధర్మమును, అధర్మమును విభజించి గుర్తింప లేకుండెను. అతఁడు నిస్సహాయుఁడయ్యెను. విభ్రాంతుఁడయ్యెను. అందువలననే ఆతఁడు శ్రద్ధాళువైన శిష్యుని

వలె శ్రీకృష్ణునకు సంపూర్ణముగ శరణాగతి నొంది తనకు కర్తవ్యమును శాసింపుమని ప్రార్థించెను.

తుట్టతుదకు అర్జునుఁడు 'నేను యుద్ధము చేయను' అని పలికి ఊరక యుండెను.

శ్లో. న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ॥
(గీత. 2-9)

ఇది మూడవది యైన తుది దశ. దీనియందర్జునుఁడు యతి యొక్క ఉత్తమ లక్షణమైన సర్వసంసార పరిత్యాగము నొనర్చెనని చెప్పవచ్చును. సన్న్యసించి శ్రవణ మొనర్పవలయును; "సన్న్యస్య శ్రవణం కుర్యాత్." ఇట్లు ఆతఁడు సన్న్యసించి, శ్రీకృష్ణుఁడు చెప్పఁబోవు దానిని వినుటకు అధికారి యయ్యెను.

మొదటి దశయందు అర్జునుని మానసమున ఒక సంశయ ముదయించెను. రెండవ దశలో ఆతఁడు శర చాపములను వీడి విలపింపఁజొచ్చెను. చివరి దశయందు ఆతఁడు తాను యుద్ధము చేయనని ప్రకటించుట సంపూర్ణ సన్న్యాసముగ చెప్పఁదగియున్నది.

శృంగి యను మునికుమారుని శాపము చేత సర్పదష్టుఁడై తాను వారము దినములలో చనిపోవలసి యున్నదని పరీక్షిన్మహారాజు తెలిసికొనినంతనే ఆతఁడు మృత్యువును చూచెను. ఆ స్థితియం దాతఁడు శుక మహర్షి పాదములపైఁబడి ఉపదేశము నర్థించెను.

అర్జునుఁడు కూడ మృత్యువును చూచు చుండుటచే ఆతని విషయము కూడ పరీక్షిత్తు యొక్క సంకటమువంటి దయ్యెను. శరీరము తోడి తాదాత్మ్యమే అర్జునుని శోకమునకు కారణము. దీనివలననే అతఁడు సర్వమును పరిత్యజించి ఉపదేశము కొఱకై శ్రీకృష్ణుని పాదములపై బడెను. గీతయందు ఇది కూడ చెప్పఁబడి యున్నది.

శ్లో. జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖ దోషాను
దర్శనమ్॥
(గీత. 13-8)

"జన్మమున, మృత్యువునందు, ముసలితనములో, వ్యాధి యందును, దుఃఖము నందును దోషమును గమనించుచుండుట వివేకవంతుని లక్షణముగ గీతయందు చెప్పఁబడి యున్నది."

బుద్ధభగవానుఁడు పైని పేర్కొనఁబడిన సిద్ధాంతములకు చరిత్రాత్మకమైన దృష్టాంతమై యున్నాఁడు. వాస్తవమైన యాత్మసాక్షాత్కారమునకు సన్న్యాసము ఆవశ్యకమైన సాధనము.

**మోక్షమును పొందుటెట్లు ?**

అర్జునుని స్థితిని గమనించిన శ్రీకృష్ణ భగవానుఁ డాతనికి జ్ఞానభిక్ష నిడి ఎట్లు సచేతను నొనర్చినది పరిశీలింతము. స్వధర్మమును మఱచి అర్జునుఁడు విభ్రాంతుఁడై, విమూఢుఁడై యుండెను. ఆతఁడు బలిష్ఠమైన శోకసముద్రమున గాఢముగ మునిఁగి యుండెను. అట్టి స్థితినుండి అర్జునుని తప్పింపవలెనన్నచో ఆత్మజ్ఞానము తప్ప మఱియొక ఉపాయము నిష్ఫలమని గ్రహించి శ్రీకృష్ణుఁడు దయతో అతనిని మెల్లమెల్లఁగ ఆత్మజ్ఞానము నొద్దకు ఈక్రింది విధమున చేర్చెను:

శ్లో. అశోచ్యా నన్వ శోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥
(గీత. 2-11)

"శోకింపఁ దగని వారి కొఱకై నీవు శోకించుచున్నావు. పైఁగా ప్రజ్ఞావాద

ములను పలుకుచున్నావు. పండితులు బ్రతికి యున్నవారి కొఱకుఁగాని, గత ప్రాణుల కొఱకుఁగాని శోకింపరు."

దయాళువైన శ్రీకృష్ణుఁడు అర్జునుని పరిస్థితిని అర్థము చేసికొనెను. అందువలననే ఆయన అర్జునునియందున్న శరీరముతోడి తాదాత్మ్యమును తొలఁగించుటకే మిగుల ప్రయత్నించెను. మిథ్యాజ్ఞానమునకు లోనైన వాఁడు ఆత్మ నెఱుఁగఁ జాలఁడు. మిథ్యాజ్ఞాన మున్నను శాస్త్రవచనములను, అధ్యాత్మవిదులైన గురువుల వాక్యములను శ్రద్ధతో వినువాఁడు సరియైన జ్ఞానమును పొందఁగలఁడు. పెద్దల యొక్క, శాస్త్రముల యొక్క బోధలను చక్కఁగా సమన్వయించుకొనుచు పదార్థముల స్వభావమును ఉన్నది ఉన్నట్లుగ పరిశీలించుటకు శ్రద్ధ కలిగి యుండవలెను. అందఱి యందును ఉన్న యాత్మ మరణము లేనిది అను నిత్యసత్యమును అర్జునునకు బోధపడునట్లు చేయుటకు శ్రీకృష్ణుఁడు ప్రయత్నించెను.

ప్రశ్న : భీష్మాదులు ఎందువలన శోకింపఁదగని వారు?

సమా : వారు నిత్యులు కావున.

ప్రశ్న : ఎందువలన?

సమా: భగవంతుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:

శ్లో. నత్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్ ॥
( గీత. 2-12 )

"నేను ఇంతకు పూర్వము లేను అను మాట లేదు. నీవు గాని, యీ రాజులు గాని లేదనుటయు లేదు. మన మందఱము ఇంక మీఁద ఉండమనుటయు లేదు."

"నేను నిత్యుఁడను. నేను గతమున ఉన్నాను, ఇపు డున్నాను; ఇఁకముం దుండఁగలను. నీ విషయము, ఈ రాజుల విషయము నిట్టిదే. మన మందఱము నిత్యులము. పూర్వ జన్మములలోని శారీరకములైన జనన మరణములతో మన మెప్పుడును ఉండియే యున్నాము. ఇప్పటి యీ శరీరములు పోయిన పిమ్మట కూడ మనము ఉండుచునే యుందుము. మనము నిత్యులము. భూత భవిష్య ద్వర్తమానములు అను మూఁడు కాలములలో మనము ఉండుచున్నాము."

ఈ శ్లోకమున ఉపయోగింపఁబడిన 'మనము' (వయమ్) అను పదము వివిధములైన శరీరములకు మాత్రమే సంబంధించినది. ఈ బహువచనమును బట్టి ఆత్మలు అనేకములుగా నున్నవని యర్థము కాదు. భిన్నములైన దీపములతో అనేకములైన విద్యుద్దీపము లుండవచ్చును. కాని ఆ దీపము లన్నిటియందును ప్రసరించునట్టి విద్యుచ్ఛక్తి యొక్కటియే. అట్లే ఎన్ని విధములైన శరీరము లున్నను, అన్నింటి యందును వ్యాపించియున్న యాత్మ ఒక్కటే. ఇంక ఆత్మ నిత్య మనుట ఎట్లు అను ప్రశ్న ఉదయించుచున్నది. దానికి నిదర్శనము——

శ్లో. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం
యౌవనం జరా ।
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥
( గీత. 2-13 )

"ఈ దేహమునందు జీవునకు కౌమారము, యౌవనము, ముసలితనము, ఎట్లు వచ్చి పోవుచున్నవో అట్లే మఱియొక దేహము వచ్చుచున్నది. ధీరుఁడా విషయమున భ్రాంతినొందఁడు."

ఈ శరీరి (నేను) ఎట్టి మార్పు తనలో లేకుండగనే కౌమారము, యౌవనము, వృద్ధత్వము లేదా పతనకాలము అను వేఱు వేఱు అవస్థలు గల ప్రస్తుత శరీరములో ఒక దాని తర్వాత మఱియొకదానిలోనికి పోవు చుండును. ఈ యవస్థ లన్నియు ఒకదాని కన్న ఒకటి భిన్నములు. ఇవి యన్నియు ఒకే ఒక సమయమున ఉండవు. కాఁబట్టి ఒక యవస్థలో ఉన్న శరీరమునకు, మఱియొక యవస్థలో ఉన్న శరీరమును తెలిసికొనుట లేదు. కౌమారము ముగిసినపుడు జీవుఁడు చచ్చిపోవుటలేదు. యౌవనము ఆరంభ మైనప్పుడు మరల బ్రతుకుటయు లేదు. ఇట్లే తక్కిన యవస్థల యందును జీవుఁడు మార్పు నొందుట లేదు. మఱియును జీవుఁడు ఒక యవస్థనుండి మఱియొక యవస్థకు చేరు చుండుట స్పష్టముగనే తెలియుచున్నది. ఇట్లే జీవుఁడు మార్పులేకుండ ఒక శరీరమును వదలి మఱియొక శరీరమును పొందు చున్నాఁడు. కావున మాఱుచున్న శరీరము లను తెలిసికొనుచున్నవాఁడు జీవుఁడు. "జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ." పుట్టినవానికి చావు తప్పదు ; చచ్చినవానికి పుట్టుకయు తప్పదు అని చెప్పఁబడుచున్నది.

పై వాక్యమును పరిశీలించినచో, పుట్టిన వాఁడు చావక తప్పదనుట యథార్థ మైనను చచ్చినవాఁడు మరల తప్పక పుట్టు నన్న విషయమును మనము తెలిసికొన లేకు న్నాము. దీనిని తెలిసికొనకుండ పై వాక్య మును సత్యమని మన మెట్లు గ్రహింపఁ గలము ?

ప్రతిప్రాణియు కుటుంబజీవనమున అత్యధిక మైన సంతోషమును పొందుచు చావునకు మాత్రము అత్యంతము భయ పడును. సంసారము వలన కలుగునట్టి అత్యధిక మైన సంతోషము కూడ క్షణికము, వినశ్వరము. కావున ఎవఁడైనను దానిని నిరాకరించును. ముముక్షువు దానిని ఇంకను దృఢముగా నిరాకరించును. నిత్యమైన సుఖము కావలయు ననియే ప్రతివానికి కోరిక. భూత భవిష్య ద్వర్తమానములలో ఏది ఎల్లప్పుడు ఉండునో అదియే నిత్యసుఖము నిత్యమైన సంతోషము నెఱుంగని వానికి అనిత్యమైన సంతోషము ఎట్లు తెలియుచున్నది అను ప్రశ్న కలదు. నిత్యము, అనిత్యము అనునవి "పగలు, రాత్రి", "తండ్రి, కొడుకు" అనువానివలె సాపేక్షము లైన పదములు. పుత్రుఁడు గాని, పుత్రిక గాని ఉన్నారన్నచో తండ్రి తప్పక యుండు నని గ్రహింప వలసి యున్నది. ఈ సంబంధమును తెలిసికొనిననే తప్ప మనము తండ్రి, కొడుకు అనుపదముల కర్థము గ్రహింపఁ జాలము. ఈ సాపేక్షము లైన పదములు ఎప్పుడును ఒకదానిపై నొకటి యాధారపడి యుండును. తండ్రి యెవఁడో తెలిసికొన్నవాఁడు పుత్రునియొక్క గాని, పుత్రికయొక్కగాని యునికిని ఊహించు నని చెప్పవచ్చును. ఇట్లే ఒకఁడు అత్యున్నత మైన సౌఖ్యమును, అది అనిత్యమని వదలి పెట్టె నన్నచో, వానికి నిత్యసుఖ మేదియో తెలిసియుండు నని మన మూహింపవచ్చును. ఐనను అనాదియైన జ్ఞానముచేత నిత్యసుఖ స్వరూపము తనకు తెలియు నను విషయము కూడ అతఁడు తెలిసికొనుట లేదు. కావుననే విచారణ అవసరము.

తన స్వరూపము నిత్య మైననే తప్ప అది యీ జన్మలోఁగాని, యితర జన్మలలోఁ గాని శరీరములయొక్క మార్పును తెలిసికొనఁ

జాలదు. ఆత్మ నిర్వికార మని చెప్పఁబడు చున్నది. ఈ కారణము చేతనే శ్రీ కృష్ణ భగవానుఁడు, ఎల్ల జీవులును నిత్యు లగుట వలన మృత్యువు ఆత్మకు సంబంధింపక పోవుట చేతను, మృత్యువు నుద్దేశించి బంధువులను గూర్చి దుఃఖింప వలదని అర్జునుని ప్రబోధించు చున్నాఁడు. ఈ కారణము చేతనే ఆత్మ జ్ఞానము కలవాఁడు బ్రతికియున్న వాని కొఱకు గాని, మరణించినవాని కొఱకుఁ గాని కలఁతపడుట లేదు.

దీని కిట్లు హేతువును చెప్పవచ్చును. ఒకానొకఁడు జీవుఁడు నిత్యుఁడు అని తెలిసి కొన్నప్పుడు, జీవుఁడు చనిపోవును అను హేతువు ననుసరించి దుఃఖింప నవసరము లేదు. జీవుఁడు శీతోష్ణములకు, సుఖ దుఃఖములకు లోనగుచుండుట ఎల్లరకు అనుభవములో నున్నదే. ఈ సంశయము నకు శ్రీకృష్ణుఁడు ఇట్లు సమాధానము చెప్పుచున్నాఁడు :

శ్లో. మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽ నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత॥
[ గీత. 2-14 ]

"ఓ కౌంతేయా! ఇంద్రియానుభవములు శీతోష్ణములను, సుఖదుఃఖములను కలిగించు నవి. అవి వచ్చుచు, పోవుచు నుండును. అవి యనిత్యములు. వానిని సహింపుము."

ఆత్మ సాక్షాత్కారము నొందినవాఁడు శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు వానికి లోనుకాఁడు అని కొందఱు తలంతురు. అది సరికాదు. ఎంతవఱకు భౌతికశరీర ముండునో అంతవఱకును జ్ఞానులకు కూడ ఇంద్రియ విషయ సంబంధ ముండును. కావుననే అట్టి సుఖ దుఃఖముల నన్నింటిని సహింపుమని శ్రీకృష్ణుఁడు అర్జునునకు బోధించెను. ఆత్మజ్ఞానము కలిగినప్పటికిని, భౌతిక శరీరమునందు మార్పేమియు కలుగదు. అప్పుడు శీతోష్ణములు మొదలగు వానిని సహించుచున్న వానికి ఏమి లాభము కలుగును అని ప్రశ్న ఉదయించును. దానికి ఇది సమాధానము :

శ్లో. యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥
( గీత. 2-15 )

ఏ పురుషుని ఇవి కలఁతపెట్టుట లేదో, ఎవనికి సుఖము దుఃఖము సమానముగ నున్నవో అట్టి ధీరుఁడు అమృతత్వము నొందుటకు అర్హుఁడగుచున్నాఁడు.

వివేకవంతుఁడు జయము కలిగినపుడు పొంగిపోరాదు ; అట్లే అపజయము కల్గినపుడు క్రుంగిపోరాదు. ఈవిధముగ ఆతఁడు సుఖ దుఃఖములను సమానముగ గ్రహించుట అభ్యసింపవలయును. తితిక్షామాత్రమున మోక్షము లభించునని చెప్పుటకు వీలు లేదనుట నిజమే. ఐనను ఆ తితీక్షకు వివేకము, వైరాగ్యము తోడైనచో అది సరియైన జ్ఞానము కల్గించుటకు సాధనమై ముక్తికి త్రోవ చూపును. ఇంకను ఇట్లు చెప్పఁబడినది :

శ్లో. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥
( గీత. 2-16 )

అసత్తునుండి పదార్థ మేదియు కలుగదు. సత్తునకు అభావమును సంభవింపదు. ఈ రెండింటియొక్క నిశ్చయమును తత్త్వ దర్శనము కలవారు తెలిసికొనియే యున్నారు.

వెండి కమండలువుయొక్క గాని, మట్టి కుండయొక్క గాని దృష్టాంతమును గైకొని యీ శ్లోకమును వివరింపవచ్చును. మనము వెండి కమండలువును ఉపయోగించు చున్నప్పుడు కమండలువే సత్యమని తలచు చుందుము. కాని వెండికన్న కమండలువు భిన్నము కాకుండుటచే ఈ యభిప్రాయము సరికాదు. ఇట్లే ఏ కార్యమైనను కారణము కన్న భిన్నముగ కన్పింపదు కావున సత్యము కాదు.

మన యీ దృష్టాంతమున మొదట వెండి యున్నది. వెండి కమండలువుగ చేయఁ బడినది. వెండి కమండలువుగ ఐనదని అను కొని చెప్పెదము. ఈ కమండలువును కరగించినచో మరల వెండి యేర్పడును. ఆరంభమున వెండి యున్నది. చివఱకును వెండి యున్నది. మధ్యలో వెండి కమండలు వున్నది.

మనము వెండి కమండలువును యథార్థముగ చూచుచున్నప్పుడు వెండిని చూచు చున్నామా ? కమండలువును చూచు చున్నామా, లేక రెండింటిని చూచు చున్నామా అని ప్రశ్న యుదయించుచున్నది. రెండింటిని చూచుచున్నచో కమండలువును వెండినుండి వేఱుచేయఁగలమా ? వీనిలో నేది సత్యమైనది ? వెండితో సంబంధము లేకుండ కమండలువునకు స్వతంత్రమైన యస్తిత్వము లేదు. కాని కమండలువు కరఁగింపఁబడినపుడు కూడ వెండి యుండును. కావున మనము ఆరంభమున, మధ్యమున, అంతము నందును వెండినే చూచుచున్నాము. కమండలువు మధ్యలో మాత్రమే యున్నది. వెండి లేకుండ కమండలువును మనము స్వతంత్రముగ చూచుచున్నామా ? లేదు. మఱి కమండలు వనఁగా నేమి ? వెండి కమండలువుగ అయినదని మన మను చున్నాము. అట్లైనచో వెండిలో ఏదేని మార్పున్నదా ? వెండి కమండలువుగ అయినపుడు కమండలువులో వెండి లేకుండుటను ఎవ్వఁడేని చూచుచున్నాఁడా ? లేదు. వెండి ఎప్పుడును ఉన్నది. మఱి కమండలు వేమిటి ? కమండలువు వెండి తప్ప మఱేమియును కాదు. వెండి కమండలువుగ అయినదా ? లేదు. మఱి కమండలు వేమిటి ? ఒక ప్రత్యేకమైన రూపమునకు మన మొసఁగిన పేరది. రూపము, నామము ఒకటియే. ఇదియే కమండలువుగ తెలిసికొనఁబడుచున్నది. ఇది కార్యము. కారణ మేది ? వెండి కారణము. వెండి కన్న దానికి కార్యమైనది భిన్నముగ కన్పింపక పోవుటచే ఆ కార్యమైన కమండలువును సత్యమని చెప్పుటకు వీలు లేదు. మధ్య సమయములో మనము కమండలువును ప్రత్యక్షముగ చూచుచున్నను అది వెండియే కాని కమండలువు కాదు. కావుననే మాండూక్యోపనిషత్కారికలలో గౌడపాదాచార్యుల వారు,

“ఆదా వంతే చ యన్నాస్తి వర్తమానే చ తత్తథా”

ఆదియందును, అంతమునందును ఏది లేదో వర్తమానమునందు కూడ అది లేనిదే యని చెప్పిరి. కావున మొదట, చివఱ ఏది లేదో, మధ్యలో కూడ అది లేనట్లే. మనము ప్రత్యక్షముగ కమండలువును చూచుచున్నను అది వెండియే తప్ప మఱేదియును కాదు. ఈ స్థితికి ‘పారమార్థిక సత్తా’ అని పేరు. వెండితో సంబంధము లేకుండ నీవు కమండలువును గూర్చి చెప్పుచున్నచో అప్పుడు కమండలు వున్నది. దానిని మనము ఉపయోగించుచున్నాము. ఈ స్థితిని ‘వ్యావహారిక సత్తా’ అని చెప్పు

చున్నాము. అనఁగా వ్యావహారిక ప్రయోజనముల కొఱకు మనము కమండలువును ఉపయోగించుచున్నామన్నమాట. అజ్ఞానము వలన వెండి కమండలు వైనదని ఎల్లరు చెప్పుచున్నారు. నిజమునకు వెండి కమండలువు కాదు. ఎందువలన ననఁగా కమండలువును చెడఁగొట్టినచో కమండలువుతో పాటు వెండి పోవుటలేదు. వెండి కమండలువుగ అయినదని మనము చెప్పుచున్నప్పుడు, వెండిలో ఎట్టి మార్పు కలుగుటలేదు. వెండి యెల్లప్పుడును వెండిగనే యున్నది. దానిని కమండలువుగ మార్చుటకే వీలులేదు. వెండికే ఒక రూపము, నామము ఏర్పడుచున్నది కాని యథార్థముగ వెండి నామరూపములను పొందుచున్నదా? లేదు. వెండి కమండలువుగా అయినట్లు తోఁచుచున్నదన్నమాట. అపుడు మఱి కమండలువనఁగనేమిటి? అది యేదియో చెప్పుటకు వీలులేదు. అది అనిర్వచనీయము. అది ఒక దృశ్యమాత్రము. అది మిథ్య, అది అసత్యము. వెండి నిర్వికారమైన మూల పదార్థము. కమండలు వసత్యము, రూపములు, నామములు వచ్చుచు పోవుచుండును.

ఇచ్చట వెండి ఆత్మతో పోల్చఁబడుచున్నది. నామరూపములు శరీరములతో పోల్చఁబడుచున్నవి. అచేతనమైన వెండి "నేను కమండలువును" అని చెప్పుట సంభవించిన ఎట్లుండునో జీవుఁడు "నేను శరీర" మనుటయు నట్టిదే. కమండలువు చెడఁగొట్టఁబడినపుడు వెండి ఆ వినాశముతో తాద్మాత్యమును పొంది "నేను నాశన మయినాను. నేను చచ్చిపోయినాను" అని చెప్పిన ఎటు లుండునో యీ జీవుల వ్యవహార మట్లే యున్నది. వెండిని పళ్ళెముగ, యితరవస్తువులుగ మార్చినపుడు వెండి ఆ పళ్లెముతో, ఆ పదార్థములతో తాదాత్మ్యము నొందుచు, "నేను పళ్ళెమును లేదా వేఱొక వస్తువును" అని చెప్పునని యనుకొనుఁడు. జీవుని విషయము కూడ ఇటులే ఉన్నది. అనాదియైన యజ్ఞానము చేత జీవుడుఁ శరీరము యొక్క నామముతో తాదాత్మ్యము నొందుచు "నేను ఫలాన వాఁడను. నేను పుట్టితిని, నేను చనిపోయినాను. ఇది నాది" అని చెప్పుచున్నాఁడు. వెండి కమండలువగుట ఎట్లు అసంభవమో అట్లే ఆత్మ నామరూపాత్మకమైన శరీరమగుటయు నసంభవము.

శిశువు జన్మించిన తరువాత పదునొకండవ దినమున ఆ శిశువునకు ఒక పేరు పెట్టుచున్నారు. ఒక శిశువునకు కృష్ణమూర్తి యను పేరు పెట్టినా రనుకొందము. అప్పటి నుండి ఆ శిశువు కృష్ణమూర్తి యగును. తరువాత నతఁడు కృష్ణమూర్తిగా పెరుగుచు, విద్యాభ్యాస మొనర్చుచు జీవితాంతము వఱకు సకలవిధముల కృష్ణమూర్తిగానే యుండును. కాని ఆతనికి కృష్ణమూర్తి అను పేరు పెట్టుటకు పూర్వము అతఁడు ఏమై యుండెను? ఆతఁడు ఒక పేరు లేని బిడ్డగా నుండెను. ఉన్నది యున్నట్లు చెప్పవలసివచ్చినచో, ఆతఁడు కృష్ణమూర్తి కాదు. అతఁడు తన పేరును నరసింహమూర్తిగా మార్చుకొనవలె ననుకొన్నచో, ప్రభుత్వము విధించిన కొన్ని పద్ధతులను అవలంబించి అతఁడు తన పేరును మార్చుకొన వచ్చును. కాని నిజమున కతఁడు కృష్ణమూర్తి కాఁడు, నరసింహమూర్తియు కాఁడు. అనఁగా కృష్ణమూర్తి కానివాఁడు కృష్ణమూర్తియై తరువాత నరసింహమూర్తియు

అయ్యేనన్నమాట. కావున అతఁడు కృష్ణమూర్తి కాలేదు ; నరసింహామూర్తియు కాలేదు. "నేను" అని వ్యవహరించుచున్న జీవుఁడు శరీరముతో, పేరుతో తాదాత్మ్యమును పొందుచు, "నేను కృష్ణమూర్తిని", "నేను నరసింహామూర్తిని" అని చెప్పుచున్నాఁడు. అంతే.

నిజమునకు జీవుఁడు శరీరము కాదు, పేరును కాదు. పొరపాటునవలననే జీవుఁడు "నేను ఫలానా వాఁడను" అని ఆలోచించుచున్నాఁడు. విచారణ మూలముననే ఈ పొరపాటును తొలఁగించుకొనవలయును. పరమేశ్వరుఁడు కూడ ఆత్మను నశింపఁజేయఁజాలఁడు. ఎందువల్ల ననఁగా ఆత్మయే పరమేశ్వరుఁడు. తనమీఁద తాను ఎవఁడైనను ఏమి చేసికొనఁగలఁడు ? బ్రహ్మము సత్యము అవినాశ్యము. కాఁబట్టి బ్రహ్మము తన్ను తాను నశింపఁజేసికొనఁజాలదు. సద్రూపమై యున్న యాత్మ అవినాశి. అది యింద్రియములకు గోచరము కాదు. అది అవిజ్ఞేయము. జ్ఞానముచే తప్ప మఱియొక విధముగా దానిని తెలిసికొనుటకు సాధ్యము కాదు. అది స్వతస్సిద్ధము.

**ఇచ్చట దేనినిగూర్చి విచారణ ?**

దేనిని గూర్చి విచారించుచున్నామో దానిని ముందు నిర్ణయించవలె. మనము విచారించుచున్న వస్తువు ఎక్కడో వున్నదని తలంపరాదు. అది మనయందే వున్నది. జీవుఁడనైన నేను పరమాత్మయైన "నేను" ను గూర్చి విచారింతును. ఇందులో కర్త "నేను", కర్మకూడ "నేనే." కావున నేను ఏదిగా ఉన్నానో అదే నేను. అనగా "నేను నేనే."

ఆత్మ అవిజ్ఞాతమనియు, అవిజ్ఞేయ మనియు చెప్పఁబడుచున్నది. అనఁగా దానిని మనము తెలిసికొనవచ్చును ; తప్పక తెలిసికోవలయు నని కూడ దాని యర్థము. శ్రుతి ప్రకారము అసలు వస్తువు ఆత్మ ఒక్కటియే. తక్కిన వన్నియు మిథ్య, అసత్తులు. కమండలువు దృష్టాంతమున వెండియే వస్తువుకాని, కమండలువు మొదలైన రూపము లన్నియు మిథ్యలని, అసత్తులని మనము గ్రహించి యున్నాము. కావున ఆత్మ స్వతస్సిద్ధము. "ఏది దూరము కాదో, ఏది అత్యంతము సన్నిహితమో, ఏది సర్వమునం దున్నదో, ఏది ఆత్మయో అది బ్రహ్మము" అని బృహదారణ్యకోపనిషత్తునందు కలదు.

తనకు సంబంధింపని వానిని, "నేను కృష్ణమూర్తిని" మొదలగు విశేషములను తనయందు ఆరోపించుకొనుటకు తొలఁగించుకొనుట ఆత్మసాక్షాత్కారమునకు ఆవశ్యకము. ఇది యేదో మనకు బొత్తిగా తెలియని విషయము తెలియుట వంటిది కాదు. ఇది స్వతస్సిద్ధముగా ఎప్పుడును ఉన్నది.

శోక మోహ రూపమైన సంసారబంధము నుండి తొలఁగించుటయే గీతాశాస్త్రమునకు ప్రయోజనము కాని, పూర్వమీమాంసా శాస్త్రవిషయమైన కర్మకాండ యందు ముంచుట కాదు అన్నవిషయమును మనము గుర్తించుట ఆవశ్యకము. శరీరము సంహరింపబడుచున్నప్పుడు, "నేను చంపుచున్నాను", "నేను చంపఁబడుచున్నాను" అని తలంచుట సహజము. ఈ సందర్భములలో నిజముగా జరుగుచున్న దేమనఁగా ఆత్మ అహంకారముతో తాదాత్మ్యమును పొంది "నేను చంపుచున్నాను", "నేను చంపఁబడు

చున్నాను" అని పలుకుచున్నది. కాని అవిక్రియమైన యాత్మతత్త్వమును వారు తెలిసికొనుట లేదు. ఆత్మ కర్తకాదు, కర్మయుకా దనుట నిశ్చితమైన సత్యము.

శ్లో. న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.
[ గీత. 2-20 ]

"ఆత్మ ఎప్పుడును పుట్టుట లేదు. చచ్చుట లేదు. ఇప్పుడు ఉండి ఇఁకముందు ఉండకపోవుటయు లేదు. అది జన్మ లేనిది. నిత్యము, శాశ్వతము, పురాణము. శరీరము చంపఁబడుచున్నను అది చంపఁబడుట లేదు."

శ్లో. వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్॥
[ గీత. 2-21 ]

"ఎవఁడు ఈయాత్మను అజమునుగా, అవ్యయముగా, అవినాశినిగా, నిత్యముగా తెలిసికొనుచున్నాఁడో వాఁడు, ఓ పార్థ! ఎట్లు ఎవనినైనను చంపింపఁగలఁడు, చంపఁగలఁడు?"

శరీరము సంహరింపఁబడు చున్నను వాఁడు సంహరింపఁబడుట లేదు. ఆత్మ అవిక్రియము అగుటవలననే ఆత్మ నెఱింగినవానికి సకలకర్మలు నిషేధింపఁబడుచున్నవి. ఇచ్చట చంపుట అను కృత్యము ఉదాహరణము కొఱకు మాత్రమే ఉద్దేశింపఁబడినది. అవిక్రియమైన యాత్మకన్న జ్ఞాని భిన్నుఁడు కదా! ఆత్మయొక్క అవిక్రియత్వమునుబట్టి జ్ఞానికి కర్మ లేవియు లేవని ఎట్లు చెప్పవచ్చును? కదలించుటకు వీలులేని యొక స్తంభమును గూర్చి ఒకఁడు తెలిసికొన్నంత మాత్రమున వాఁడు దానివలె నిష్క్రియుఁడగునా? ఆత్మజ్ఞాని (Enlightened) అనఁగా ఆత్మయే అని రూఢిగా, సూటిగా చెప్పుటయే యీ పూర్వపక్షమునకు సరియైన సమాధానము. జ్ఞానము శరీరేంద్రియాదులకు సంబంధించినది కాదు. అజ్ఞానమువలన, బుద్ధివృత్తులనుండి ఆత్మను భిన్నముగా గ్రహింపకుండుటవలన ఆత్మను శబ్దాది విషయములకు జ్ఞాతనుగా ఊహించుచున్నారు. నిజమునకు ఈ శబ్దాది విషయములు బుద్ధిచేత గ్రహింపఁబడుచున్నవి. ఇట్లే అవిద్యతో సంబంధము కలిగియుండుటవల్ల ఆత్మయే తెలియఁబడినట్లుగా కొందఱచే ఊహింపఁబడుచున్నది. ఇది శరీరమున కంతకును సంబంధించిన బుద్ధియొక్క హేతుపూర్వక మానసికజ్ఞానము మాత్రమే. ఇది యథార్థము కాదు. యథార్థముగా ఆత్మ ఎట్టి మార్పును పొందలేదు. సుశిక్షితమైన బుద్ధితో శాస్త్రాచార్యోపదేశములను చక్కఁగా పొందినవాఁడు ఎవఁడైనను ఆత్మసాక్షాత్కారము నొందఁగలఁడు. ఆత్మజ్ఞానమనఁగా తన్నుఁ గూర్చి తాను తెలిసికొనుటయే. ఆత్మ ఇంద్రియములకు గోచరమగు విషయము కాదు. ఆత్మయొక్క అవిక్రియత్వమును ఈ క్రిందివిధముగ కూడ నిరూపింపవచ్చును :

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే
[ గీత, 3-27

"ప్రకృతియొక్క గుణములచేత కర్మలన్నివిధముల జరుగుచున్నవి. అహంకారముచేత విమూఢమైన బుద్ధికలవాఁడు నేనకర్తనని తలంచుచున్నాఁడు."

సత్త్వము (మంచితనము), రజసు (చుఱుకుదనము), తమస్సు (అలసత్వము లేక అజ్ఞానము) అను మూఁడు గుణములతో

ప్రకృతి (విశ్వము) రూపొందు చున్నది. ప్రధానము, స్వభావము అనునవి ఒక యర్థమునే చెప్పునట్టి పర్యాయ పదములు. ప్రకృతి సహజముగా మూఁడు గుణముల సామ్యస్థితిని గల్గి యుండును. మన కృత్యము లన్నియు ఈ మూఁడు గుణముల కార్యముల వలననే సంభవించుచున్నవి. సత్త్వము ప్రబలమై తక్కిన రెండును దాని కంగములై యున్నప్పుడు సాత్త్వికమైన కృత్యము సంభవించును. ఉదాహరణమునకు, నే నిప్పుడు ఆత్మను గూర్చి వ్రాయు చుండుటను గ్రహింపవచ్చును. అనఁగా ఇప్పుడు నా యందు సత్త్వగుణము ప్రబలముగ పనిచేయుచున్నదన్న మాట. కావున ఈ మంచిపని జరుగుచున్నది. అజ్ఞానము చేత, వివేకము లేకపోవుట వలన వ్రాయు చుండుట అను నీ పనితో తాదాత్మ్యమును పొంది "నేను రచయితను", "నేను కర్తను" అని నేను చెప్పుదును. అహంకారము బుద్ధిని మందగింపఁజేయును. కావున మూఢుఁడు తాను ఏ పనిచేయుచున్నను, తన్ను కర్తనుగా తలంచును. కాని జ్ఞాని అట్లు తలంపఁడు.

శ్లో. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తన్తే ఇతి మత్వా న సజ్జతే ॥
(గీత. 3-28)

"ఓ అర్జునా ! గుణముల యొక్క, కర్మల యొక్క భేదముల తత్త్వమును తెలిసికొన్న వాఁడు గుణములు గుణములయందు వర్తించు చున్నవి అని తలంచి వాని యం దాసక్తి నొందఁడు."

ఆత్మసాక్షాత్కారమును పొందిన జ్ఞాని తాను చేయుచున్న యే పనితోఁగాని, తాను నియోగించిన వానితోఁగాని తాదాత్మ్యమును పొందఁడు. అంతేగాక అతఁడు సాక్షి మాత్రుఁడై గుణములను, వాని యొక్క వ్యాపారములను విభజించి గ్రహించుచు ఇంద్రియములు విషయములయందు ఒక దాని తరువాత నొకటిగా ప్రవర్తించుచున్నవే కాని, ఆత్మ వర్తించుట లేదు అను నిశ్చయముతో నుండును. కావున జ్ఞాని కర్మలతో సంగము నొందఁడు. ఇంకను వివరముగా, స్పష్టముగా చెప్పవలయునన్నచో, అజ్ఞాని అహంకారము చేత విమూఢుఁడై తన్ను కర్తనుగా తలంచుచుండఁగా, జ్ఞాని తన్ను కర్తనుగా ఎప్పుడును తలంపఁడు.

వేదబోధితమైన యాత్మతత్త్వమును అర్జునునకు విశదముగా వివరింపవలయు నను తలంపుతో శ్రీకృష్ణుఁడు కర్మముయొక్క, అకర్మయొక్క స్వరూప మేమి అను నత్యంత క్లిష్టమైన విషయమును గైకొనెను.

శ్లో. కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥
(గీత. 4-16)

"ఏది కర్మ, ఏది అకర్మ అను విషయమున పండితులు కూడ తెలిసికొనలేనివా రగుచున్నారు. దేనిని తెలిసికొన్నచో అశుభము నుండి ముక్తుఁడ వగుదువో అట్టి కర్మను గూర్చి నీకు బోధింతును."

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః।
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥
[గీత. 4-17]

"కర్మను గూర్చి, అశాస్త్రీయమైన కర్మను గూర్చి, అకర్మను గూర్చియును తెలిసికోవలసి యున్నది. కర్మపద్ధతి తెలిసికొనుటకు సులభమైనది కాదు."

కర్మ యనఁగా శరీరముయొక్క కదలిక యని, అకర్మ యనఁగా కదలకుండ కూర్చుండుట యని ఎల్లరు ఎఱింగినదే. ఇది యింత స్పష్టమై యుండఁగా దీనిని గూర్చి తెలిసికోవలసిన దేమున్నది అని అనుట సరికాదు. ఇందు తెలిసికొనవలసినది చాల కలదు. మన శాస్త్రములు మనము చేయవలసిన కర్మలను గూర్చి, చేయరాని కర్మలను గూర్చి, అకర్మను గూర్చియు చెప్పుచున్నవి. నిజమునకు కర్మయొక్క, అకర్మయొక్క, శాస్త్రీయమైన కర్మయొక్క స్వరూపమును తెలిసికొనుట చాల కష్టము. శ్రీకృష్ణుఁ డిట్లు వివరించుచున్నాడు :

శ్లో॥ కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ
కర్మ యః ।
సబుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్న
కర్మకృత్ ॥
[గీత. 4-18]

"కర్మయం దకర్మను, అకర్మయందు కర్మను ఎవఁడు చూచుచున్నాఁడో మనుష్యులలో వాఁడు బుద్ధిమంతుఁడు, వాఁడు యోగి. అతఁడే సకల కర్మలు చేసినవాడును అగుచున్నాఁడు."

ఏది చేయఁబడుచున్నదో అది సాధారణముగ కర్మ యగుచున్నది. ఒకఁడు ఊరక కూర్చుండినను ఏదియో ఆలోచించును. అదియును కర్మ యగును. కాని వాఁడు ఏమియు చేయుచుండుటలే దని మన మందుము. రెండును కర్మములుగనే చెప్పఁబడు చున్నవి. అజ్ఞాని ఏదేని పనిచేయక, ఒక్క క్షణ మైనను ఉండఁజాలఁ డనుటయు యథార్థమే. కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను చూచుటకు వీలగు నని చెప్పఁబడుచున్నది. కర్మ లేకపోవుటయే అకర్మ యగుచుండఁగ ఇది యెట్లు సాధ్యమగును? నివృత్తికి కాని, ప్రవృత్తికి కాని కర్త ఉండక తప్పదు. ఒకఁడు కొన్ని వేళలందు పనిచేయును; మఱికొన్ని వేళలం దేమియు చేయఁడు. కొంత చేయుట, ఏమియు చేయకుండుట, రెండును పనులుగనే చెప్పఁబడుచున్నవి. ప్రతికర్మకు ఒక కర్త ఉండును. కర్త లేక కర్మగాని, కర్మ లేక కర్త కాని ఉండుటకు వీలులేదు. అవి రెండును పరస్పరాశ్రయములు; సాపేక్షములు. కాని కర్త కర్మకన్న భిన్నుఁడు. విధిముఖముగ (Positive), నిషేధాత్మకముగ (Negative) అనేకము లైన కర్మ లుండును. వాని కన్నింటికిని కర్త ఒకఁడే యుండవచ్చును. అన్ని కాలములలో నుండవు. ఒక్క సమయముననే అన్ని కర్మ లుండుట సంభవము కాదు. ఒక కర్త అన్ని కర్మలను చేయుచు, అతఁడు అన్ని కాలములలో నుండును గావున వాని నన్నింటిని గమనించుచుకూడ నుండును. కర్త కర్మ అనునవి సాపేక్షము లైన పదములు. ఎప్పు డాతఁడు పనిచేయునో అప్పు డాతఁడు కర్త యగును. జ్ఞానియే నిజముగ కర్తను, కర్మను తెలిసికొనుచున్నాఁడు. వస్తుతత్త్వమును గుర్తించిన వివేకశాలి మాత్రమే కర్మయం దకర్మను, అకర్మయందు కర్మను చూడఁగల్గును. అతఁడే మనుష్యులలో వివేకి. అతఁడే యోగి. అతఁడే సర్వకర్మలను చేసినవాఁడు. కర్మ ఎప్పుడును అకర్మ కానేరదు. లేక అకర్మ ఎప్పుడును కర్మ కానేరదు. కావున ఇట్టి యసంబద్ధమైన విషయమును ఎవఁడైనను ఎటుల తెలిసికొనును? అజ్ఞానికి ఇట్లు తోఁచుట యథార్థమే. ఈ కారణము చేతనే కర్మయం దకర్మను చూచువాఁడు బుద్ధిమంతుఁడని

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు. కావున ఇందు పరస్పరవిరోధ ముండుటకు వీలులేదు. సకలప్రాణులచే పొరపాటుగ గ్రహింపఁబడు చున్న కర్మను గూర్చి, అకర్మను గూర్చి సుశిక్షితమైన బుద్ధిగలవాఁడు చక్కఁగ అర్థము చేసికొనఁగలఁడు. కర్మయందు అకర్మగాని, అకర్మయందు కర్మగాని నెలవు కొనియుండునని చెప్పుటకు వీలు లేదు. ఎందువల్ల ననఁగా కర్మ లేకుండుటయే అకర్మ. కావున కర్మ, అకర్మ అనునవి సరిగ జనులచే అర్థము చేసికొనఁబడుట లేదు అనుట స్పష్టము. ఎండమావులను చూచి నీరుగా, ముత్తెపుచిప్పలను చూచి వెండిగా ఎట్లు గ్రహించుచున్నారో వీని విషయమునను ఒకదానిని మఱొకటిగా భ్రమించు చున్నారు.

ఒక ఓడగాని, రైలుగాని కదలుచున్న పుడు తీరమునందుఁగాని, త్రోవయందుఁగాని నిశ్చలముగ నున్న వృక్షములు ఓడలోఁగాని, రైలులోఁగాని ఉన్నవానికి ఎదురుగ కదలి వచ్చుచున్నట్లు తోఁచును. ఇట్లే చాల దూరమునందు కదలుచున్న వస్తువులు మనకు నిశ్చలముగ కన్పించుటయు కలదు. ఈవిధముగానే ఆత్మవిషయమున కూడ అకర్మ కర్మగ, కర్మ అకర్మగ పొరపాటున గ్రహింపఁబడుచున్నది. ఆత్మ నిష్క్రియమని శ్రుతి, స్మృతి, హేతువాదము సైతము మనకు స్పష్టముగ బోధించు చున్నవి. ఐనను మనకు దీనిని గ్రహించుట కష్టముగ నున్నది. ఆత్మయొక్క యథార్థ స్వభావమునకు విరుద్ధ ముగ, ఆత్మకు కర్మసంబంధ మున్నట్లు భావించుట మనస్సునకు చాల గాఢ మగు నభ్యాసముగ నున్నది. గీతలోనే తృతీయా ధ్యాయమునందు ( 27, 28 శ్లోకములను పరిశీలించునది. ) కర్మ దేహేంద్రియాదులకు మాత్రమే సంబంధించుచున్నది. కాని మానవుఁడు దానిని ఆత్మకు తప్పుగ అన్వ యించు చున్నాఁడు. కావుననే అతఁడు "నేను కర్తను", "ఇది నాది" "నేను ఫలమును అనుభవించుచున్నాను" అని యీ విధముగ ఊహించుచున్నాఁడు. ఈ విధముగనే అతఁడు దేహేంద్రియాది సముదాయమునకు సంబంధించిన కర్మయొక్క నిలుపుదలను కూడ ఆత్మకు అసత్యముగ నారోపించు చున్నాఁడు. మఱియును, కర్మలను నిలిపి వేయుటవలన కలుగు సుఖమును కూడ ఆత్మకు ఆరోపించుచు దిగులు లేకుండ, ఏ పనియు చేయనక్కఱ లేకుండ సుఖముగ నుండుట కొఱకై, "నే నూరక యుందును, నే నిపుడేమియు చేయుట లేదు. నేను ఇపుడు చాల సుఖముగ నున్నాను" అని తలచు చున్నాఁడు. పై యుదాహరణములలో తీర మందుఁగాని, త్రోవలోఁగాని నిశ్చలముగ నున్న చెట్లకు, మనకుఁ గన్పించుచున్న గమన మెట్లుల సంబంధింపదో అట్లే దేహేంద్రియా దులకు సంబంధించిన కర్మయు ఆత్మకు సంబంధింపదు అని జ్ఞాని గుర్తించును. అట్టి వాఁడు అకర్మయందును కర్మను చూచును. ఎందువల్ల ననఁగా లోకులు శారీరకములు, మానసికములు నైన కర్మలు ఆగిపోవుటయే అకర్మయని తలఁచుచున్నారు. అదియు కర్మయే యని జ్ఞాని గ్రహించును. కర్మ ఎట్లు ఆత్మకు అసత్యముగా ఆరోపింపఁబడు చున్నదో అట్లే యీ అకర్మయు ఆరోపింపఁ బడుచున్నది. అందువలన "నే నేమియు చేయుట లేదు, నేను సుఖముగ నున్నాను" అను నహంకారము కల్గుచున్నది. ఎవఁడు ఈ రెండింటిని యథార్థముగ గ్రహించు

చున్నాఁడో వాఁడు యోగి. వాఁడు సకల కర్మలను చేసినవాఁ డగుచున్నాఁడు. వాఁడు అశుభమునుండి ముక్తుఁ డగుచున్నాఁడు. తుట్టతుదకు వాఁడు సర్వమును సాధించినవాఁ డగుచున్నాఁడు. వాఁడు మోక్షమును చూఱగొనును. గీతలో ఇంకను ఇటుల చెప్పఁబడి యున్నది.

శ్లో. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వ న్నపి న లిప్యతే ॥
( గీత. 5-7 )

"యోగమునందున్న వాఁడు విశుద్ధాత్ముఁడు. మనస్సును, ఇంద్రియములను జయించిన వాఁడు. సర్వభూతములందు ఉన్న యాత్మయే తన స్వరూపమని తెలిసికొన్నవాఁడు. కర్మలను చేయుచున్నను, వానిచే కలుషితుఁడు కాఁడు. చూచుచున్నప్పుడు, నిలుచున్నప్పుడు, తాఁకుచున్నప్పుడు, వాసన చూచుచున్నప్పుడు, భుజించుచున్నప్పుడు, నడచుచున్నప్పుడు, గాలి పీల్చుచున్నప్పుడు, నిద్రించుచున్నప్పుడు, మాటాడుచున్నప్పుడు, వదలిపెట్టుచున్నప్పుడు, గ్రహించుచున్నప్పుడు, కన్నులు మూయుచున్నప్పుడు, తెఱచుచున్నప్పుడు ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నవి అని నిశ్చయించుచు తత్త్వవేత్త యోగము నవలంబించి "నే నేమియు చేయుచుండుట లేదు" అని తలఁచుచుండును. అనఁగా తెలిసికొనును.

శ్లో. నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్
గచ్ఛన్ శ్వసన్ స్వపన్॥
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్
నిమిష న్నపి ।
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంతే ఇతి ధారయన్॥
[గీత. 8, 9]

సకలభూతములందున్న యాత్మ తన స్వరూపమనియే జ్ఞాని తెలిసికొనును. కావున ఆతఁడు బ్రహ్మమునుండి గడ్డిపరకల వఱకును గల జీవకోటితో చేసికొని హాని కల్గింపఁడు. అట్టివాఁడు ఏదేని ఒక కార్యము చేసినను మానవ సమూహములను రక్షించుటకొఱకు, వారికి ఒక దృష్టాంతము నెలకొల్పుటకు ఆతఁ డటుల చేయును. ఆ కర్మలచేత అతఁడు బద్ధుఁడు కాఁడు. పరమాత్మయొక్క యథార్థతత్త్వమును ఎవఁడు గ్రహించుచున్నాఁడో అట్టివాఁడు మాత్రమే కర్మయం దకర్మను, అకర్మయందు కర్మను చూచుచున్నాఁడు. ఈవిషయ మిదివఱకే విశదముగ చర్చ చేయఁబడినది. మఱియును గీతలో నిట్లు చెప్పఁబడినది.

శ్లో. సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్ నకారయన్ ॥
[గీత.5-13]

"మానసికముగా సర్వకర్మలను వదలిపెట్టి యోగి తొమ్మిది ద్వారములు కలిగిన యీ శరీరపురమందు ఏ పనియు చేయక, చేయింపక సుఖముగ నుండును."

సత్యము నెఱిఁగినవాఁడు ఎల్ల విషయములను విస్మరించుచు, ప్రపంచ వ్యవహారములందాసక్తి నొందఁడు. వాని మనస్సు శాంతముగ నుండును, కాని తనకు స్వరూపమైన ఆత్మయందు ఎల్లప్పుడును ఏకాగ్రత కల్గి యుండును. మానవశరీరము తొమ్మిది ద్వారములు గల నగరముతో పోల్పఁబడినది. ఆత్మ యీ శరీరమునకు రాజు. ఇంద్రియములు, మనసు, బుద్ధి పౌరులకు పోల్పఁబడినవి. ఇవి అన్నియును తమకు ప్రభువైన యాత్మ

యొక్క ప్రయోజనము కొఱకే పనిచేయు చుండును. శరీరములోని తొమ్మిది రంధ్రము లును, తొమ్మిది ద్వారములతో పోల్పఁబడు చున్నవి. అజ్ఞాని దేహేంద్రియ సము దాయముపై తాదాత్మ్యము చెందును. ఆత్మ జ్ఞానముగల వివేకి అటుల తలపఁడు. ఆత్మ సాక్షాత్కారము నందినవాఁడు చేయుట, చేయించుట ఆత్మకు సహజము కాకపోవు టచే తానేమియు చేయుచుండుటయే గాక, శరీరేంద్రియముల చేతను ఏ పనియు చేయిం పఁడు. ఆత్మ అవికార్యము. శ్రుతియం దిటుల చెప్పబడినది :

"అది ఆలోచించుచున్న దానివలె, కదలు చున్న దానివలె తలంచును"

[ బృహదారణ్యకోపనిషత్తు. 4. 3. 7. ]

మోక్ష మనఁగ నేమియో, దాని నెట్లు పొందవచ్చునో అను విషయమును మనము కొంతవఱకు చర్చించినాము. ఇఁక విశ్వము యొక్క సృష్టిని గూర్చి కూడ తెలిసికొను టావశ్యకమే. ఏ ప్రయోజనము కొఱకై ఎవఁడీ సృష్టిని చేసినాఁడు ? సృష్టికి ద్రవ్య మేది ? హెచ్చు తగ్గుల భేదములు ఈ విశ్వ మున ఎటుల ప్రవేశించినవి ? పరమాత్మను గూర్చి సరిగ తెలిసికొనుటకు ఈ ప్రశ్నలకు సమాధానములు ఆవశ్యకము.



## నవమ పరిచ్ఛేదము

# ఈశ్వరతత్త్వమేది ?

దేవీ ప్రకృతినుండి యీ విశ్వ మెట్లు పరిణమించినది ? శ్రీకృష్ణుఁ డిటుల ప్రకటించు చున్నాఁడు :

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యా
మ్యశేషతః ।
యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య
మవశిష్యతే ॥
[ గీత. 7-2 ]

"అనుభూతి సహితమైన యీ జ్ఞానమును నీకు సమగ్రముగ బోధించుచున్నాను. దీనిని తెలిసికొన్నచో ఇఁక తెలిసికోవలసిన దేదియు నుండదు."

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో
బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥
[ గీత. 7-4 ]

"భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము— ఈ యెనిమిది విధములుగ నున్న యిది నా ప్రకృతి."

పృథివీ తన్మాత్ర సూక్ష్మభూతమైన భూమికి పర్యాయము. ఇట్లే జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనునవి కూడ ఆ యా తన్మాత్రలను సూచించును. మనస్సు అహం

కారమునకు సూచకము. బుద్ధి అహంకారమునకు కారణమైన మహత్తత్త్వమును సూచించుచున్నది. అవిద్యతో కూడి యుండిన యవ్యక్తమును అహంకారము సూచించుచున్నది. విషముతో కూడిన యాహారము విష మనియే చెప్పఁబడుచున్నది. ఇదియే సకల సృష్టికి కారణము. అహంకారమే ప్రతికార్యమునందు కారణమై యుండుట మనకును అనుభవమున నున్న విషయమే. అష్టవిధముగ భిన్నమై యున్న యీ ప్రకృతి ఈశ్వరునకు సంబంధించి మాయ యని చెప్పఁబడుచున్నది. శ్రీకృష్ణుఁడింకను ఇట్లు చెప్పుచున్నాఁడు :

శ్లో. అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥
( గీత. 7-5 )

" ఇది అపరమైన ప్రకృతి. జీవభూతమైన దేనిచేత ఈ జగత్తు అంతయు ధరింపఁబడుచున్నదో అట్టి నా ప్రకృతిని పరమైన దానిని, దీనికన్న అన్యమైన దానిని తెలిసికొనుము. "

వెనుకటి శ్లోకమున పేర్కొనఁబడిన ప్రకృతి హీనము, మలినము, అశుభమును కల్గించునది. ఇదియే సంసారబంధ మగుచున్నది. కాని ఇప్పు డీ శ్లోకమున పేర్కొనఁబడిన ప్రకృతి ఉత్కృష్టమైనది. పవిత్రమైనది. "క్షేత్రజ్ఞుఁడ నైన నాకు స్వరూపము ఈ ప్రకృతి." దీని వలననే జీవితము జరుగుచున్నది. శ్రీకృష్ణుఁడు దీనినే ఇంకను చెప్పుచున్నాఁడు :

శ్లో. ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా ॥
( గీత. 7-6 )

"ఈ రెండు ప్రకృతుల వలననే సకలభూతములు సంభవించుచున్నవని గ్రహింపుము. కావున నేను సమస్తమైన యీ జగత్తుయొక్క ప్రభవమునకు, ప్రళయమునకు కారణమై యున్నాను.

" నా అపరా ప్రకృతియే క్షేత్రము. పరా ప్రకృతియే క్షేత్రజ్ఞుఁడు. ఇవియే సకలభూతముల సంభవమునకు కారణములై యున్నవి. నా ప్రకృతియే సకలభూత సంభవస్థాన మగుటచే, నేనే సమస్త విశ్వమునకు, ఉత్పత్తికి, ప్రళయమునకు హేతు వగుచున్నాను. నేను సర్వజ్ఞుఁడ నైన యీశ్వరుఁడను. నేను విశ్వకారణుఁడను. కావుననే,

శ్లో. మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥
( గీత. 7-7 )

" ఓ ధనంజయ ! నాకన్న అధికమైనది ఏదియును లేదు. సూత్రమునందు మణుల వలె నాయందు ఈ జగత్తు అంతయు కూర్పఁబడి యున్నది.

"నే నొక్కఁడనే విశ్వమునకు కారణము. పరమేశ్వరుఁడను, పరమాత్మను. నాకన్న అన్యమైన కారణము లేదు. కావుననే సకల ప్రాణి సహితమైన యీ విశ్వమంతయు వస్త్రమునందు నూలువలె, లేక మణిగణములు సూత్రమునందు వలె నా యందు కూర్పఁబడియున్నది.

పరమాత్మ స్వభావము చేతనే నిత్యము, శుద్ధము, బుద్ధమై సకలభూతములకు స్వరూపమై యుండఁగా ప్రాణులు అజ్ఞాన వశమున ఆ పరమాత్మను సరిగా గ్రహింపలేకుండుట విచారకరము. ఈ యజ్ఞానము ఎందువలన కలుగుచున్నది ?

శ్లో. త్రిభి ర్గుణమయై ర్భావైః ఏభి స్సర్వ మిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర
మవ్యయమ్ ॥
( గీత. 7-13 )

"గుణమయములై మూఁడు విధములైన యీ పదార్థములచేత ఈ జగత్తు అంతయు మోహితమై వీనికి పరమందు అవ్యయుఁడనుగ నున్న నన్ను తెలిసికొన లేకున్నది."

గుణవికారములైన ప్రేమ, ద్వేషము, సంగము మొదలగువానిచేత ప్రాణులన్నియు మోహితము లగుచున్నవి. అందఱును ఇంద్రియవిషయముల కొఱకు ప్రాకులాడుచున్నారు. ప్రాపంచికములైన సకల పదార్థములకన్న భిన్నమై అవ్యయముగా నున్న తమస్వరూపమును గుర్తింపఁజాలకున్నారు. ఇట్లు సకలజీవులు ఇంద్రియములకు బలియగుచున్నారు. జన్మాదులు ప్రపంచమునందు సకల పదార్థములకు సంభవించును గాని ఆత్మకు సంబంధింపవు.

జన్మ నొందుచున్న యీ జీవు లందఱు తమ స్వరూపముకన్న భిన్నము కాని యాత్మతత్త్వమును తెలిసికొనుటకు ఏది అవరోధముగా నున్నది? అనఁగా ఈ యనాది యైన యజ్ఞానమునకు కారణమేమి?

శ్లో. ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప ॥
( గీత. 7-27 )

"ఇచ్ఛా ద్వేషములచే కలుగుచున్న ద్వంద్వముల వలని మోహముచేత, జన్మ సమయముననే సకలభూతములు, ఓ పరంతపా! సమ్మోహమును పొందుచున్నవి."

మనము ప్రాణులను గూర్చి ప్రసంగించునప్పుడు పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల జీవులను ఉద్దేశించు చున్నాము. మానవులు తప్ప సాధారణముగా ఇతర ప్రాణులు ఆత్మ విచారము చేయుటకు, మోక్షమును పొందుటకు సమర్థములు కావు. మానవుఁడు మాత్రమే స్వతంత్రుఁడైన కర్త, స్వతంత్రుఁడైన భోక్తయై యున్నాఁడు. అతఁడు తన స్వరూపమును గూర్చి తాను విచారించుకొనఁగలఁడు. ఇతర ప్రాణులు, దేవతలు కూడ మానవ జన్మలలో తాము చేసిన సుకృత దుష్కృతముల ఫలములను అనుభవించునట్టి వారు మాత్రమే అగుచున్నారు. మానవ జన్మను పొందినప్పుడు మాత్రమే వీరు తమ్ము గూర్చి విచారించుకొనఁ గలుగుదురు. కావున మానవుఁడు అమూల్యమైన జీవితమును వ్యర్థమొనరించు కొనక, మహోన్నతములైన యాశయములను లక్ష్యముగాఁ గైకొని వాని నందుకొన నభిలషించుచు తన శీలమును చక్కదిద్దుకొనుటకు జాగరూకుఁడై యుండ వలయును.

ఎల్లరకును ద్వంద్వము లని చెప్పఁబడుచున్న సుఖ దుఃఖము లున్నవి. ఇవి ఇచ్ఛా ద్వేషముల చేత కలుగుచున్నవి. శీతోష్ణములవలె ఇచ్ఛా ద్వేషములు పరస్పర విరుద్ధములు. సుఖ దుఃఖముల వలన ఇచ్ఛా ద్వేషములు కలిగినప్పుడుగాని, లేక ఇచ్ఛా ద్వేషములవలన అవి కలిగినప్పుడుగాని అవి ప్రాణులయందు మోహమును పుట్టించి పరమాత్మను గూర్చిన జ్ఞానము కలుగకుండునట్లు అవరోధము కల్గించుచున్నవి.

జన్మ నొందుచున్న సకలప్రాణులును ఈ విమోహము నొందుచున్నవి. ప్రతిమానవుని బుద్ధియు ద్వంద్వముల వలని మోహము చేత అంధకారమయ మగుచున్నది. ఈ మాయవలన ఎవఁడును ఆత్మను గ్రహింపలేకపోవుటయేగాక ప్రతివాఁడును "నేను

శరీరమును", "నేను ఫలాన వాఁడను" అని యీవిధముగ నాలోచించుచున్నాఁడు.

అజ్ఞానమునకు ఆది లేదు. కాని అంత మున్నది. జ్ఞానము కలిగిన క్షణముననే అజ్ఞానము నశించుచున్నది. అవి ఒకదాని వెంట నొకటి వచ్చునవి కావు. పరబ్రహ్మము నకు అజ్ఞాన మెట్లు కలిగినది అని విమర్శకులు సాధారణముగ ప్రశ్నించుచుందురు. బ్రహ్మ మునకు అజ్ఞాన మెప్పుడును లేదు, రాలేదు అని చెప్పుటయే దీనికి సరియగు సమా ధానము, అసలు ఈ ప్రశ్నయే అంగీకరింపఁ దగినది కాదు. సూర్యునకు చీఁకటి ఎటుల వచ్చినది అని ప్రశ్నించుట ఎట్టిదో యిదియును నట్టిదే. చీఁకటి, వెలుఁగు పరస్పర విరుద్ధ ములు. మేఘములు సూర్యుని కప్పుటవలన చీఁకటి కలుగుచున్నదని కొంద ఱందురు. కాని నిజమునకు సూర్యుఁడు ఉండుట వలననే మనము మేఘములను, వెలుఁగు తగ్గిపోవుటను చూడఁగల్గుచున్నాము. సూర్యున కెపుడును మార్పు సంభవింపఁజాలదు. సూర్యుని స్వరూ పమే వెలుఁగు. పరమాత్మయైన బ్రహ్మము స్వరూపము చేతనే నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తము. అనాదియైన యజ్ఞాన ముతో కూడిన యాత్మ మోహితమై యింద్రియములతో, వాని విషయములతో తాదాత్మ్యమును పొంది తన్ను కర్తనుగ, భోక్తనుగ తలఁచుచున్నది. జీవాత్మయొక్క యీ కార్యము పరమాత్మకు ఏవిధముగను సంబంధింపదు. మేఘముల యొక్క అవరోధముచేత ఎట్లు సూర్యుఁడు మార్పు నొందుట లేదో అట్లే అనాదియైన యీ యజ్ఞానముచేత పరమాత్మ ఎప్పుడును మార్పు నొందుట లేదు.

సాధారణముగ ప్రసిద్ధమైన "నే నెవఁ డను" అను ప్రశ్నను గైకొని పరిశీలింతము. నన్ను గూర్చి నాకేమియు తెలియదు అనుట స్పష్టమగుటచే విచారణ మావశ్యకమగు చున్నది. ఇందు కర్తనైన 'నేను' కర్మ మైన 'నేను' గూర్చి విచారించుచున్నది. అనఁగా కర్తమైన 'నేను' కు కర్మమైన 'నేను' గూర్చి తెలియదన్నమాట. శ్రుతి యొక్క, ఆచార్యునియొక్క ఉపదేశముల సాయమున "నేను ఇదికాదు, నే నిదికాదు" అని కర్తమైన నేను, కర్మమైన నేను గూర్చి తెలిసికొనుచున్నదనుకొనుము. అపుడు కర్తమైన నేను యొక్క అజ్ఞానము నశించి, అది కర్మమైన నేనును గూర్చి తెలిసికొన్నది యగును. కర్మమైన నేనును గూర్చి అజ్ఞాన ముతో నున్న కర్త యైన నేను, కర్మమైన నేను విషయమున జ్ఞానము కలది అగు చున్నది. కర్తయైన నేను యొక్క అజ్ఞానము గాని, జ్ఞానము గాని కర్మమైన నేను యొక్క స్థితియం దెపుడును మార్పును కలిగింపవు. కర్మమైన నేను ఎల్లప్పుడు కర్మమైన "నేను, నేను" గనే యుండును.

మఱియొక యుదాహరణము గైకొని పరిశీలింతము. నాకు విద్యుచ్ఛక్తిని గూర్చి తెలియదు. ఇందు కర్తను నేను, కర్మ విద్యుచ్ఛక్తి. కొంత పరిశోధన చేసిన తరువాత నేను విద్యుచ్ఛక్తిని గూర్చి తెలిసి కొందును అనుకొనుము. నా యజ్ఞానము గాని, లేక విజ్ఞానము గాని ఏ సమయమందును కర్మమైన విద్యుచ్ఛక్తికి మార్పును కల్గింపఁ జాలదు. విద్యుచ్ఛక్తి ఎప్పుడును విద్యుచ్ఛక్తియే. దానియం దెపుడును మార్పులేదు. కర్తయైన నాయందు మాత్రమే మార్పు వచ్చినది.

కర్మమైన నేను అనఁగా పరమాత్మ నిష్క్రియము. శ్రుతి, స్మృతి, హేతువాదము ఈవిషయమును స్పష్టముగ బోధించుచున్నవి. ( పాఠకులు భగవద్గీతలోని ద్వితీయాధ్యాయమున 20 నుండి 24 వఱకు గల శ్లోకములను పరిశీలింతురు గాక ) ఇవి యిట్లుపదేశించుచున్నను మనస్సున నెలకొని యున్న యభ్యాసము చేత ఎల్లరును నిష్క్రియమైన యాత్మయందు క్రియను ఆరోపించుచున్నారు. ఈ యభ్యాసము నుండి తత్త్వవేత్త తప్ప ఎవఁడును తప్పించుకొనఁజాలఁడు. ( భగవద్గీతలోని మూఁడవ యధ్యాయమునందలి 27, 28 శ్లోకములను గూర్చి ఇంతకు ముందువ్రాసిన విషయములను గమనింపుఁడు.)

అనాది అజ్ఞానమును గూర్చి చక్కఁగ తెలిసికొనుటకై మనకు చాల సన్నిహితమైన యొక దృష్టాంతము తీసికొని పరిశీలింతము. కష్టము, క్లిష్టము అయిన గణితశాస్త్రమునందలి లెక్క నొక విద్యార్థికి చేయుమని యిచ్చితి మనుకొనుము. అతఁడు తన శక్తినంతటిని వినియోగించి ప్రయత్నించినప్పటికిని ఆ లెక్కకు సమాధానమును పొందలేకపోయినాఁడు. అతఁడు తనయజ్ఞతను ప్రదర్శించుచు ఉపాధ్యాయుని వంక చూచుచున్నాఁడు. ఆ స్థితియందు సమాధానమును గూర్చిన యజ్ఞానము నీకు ఎప్పటినుండి వచ్చినది అని ఉపాధ్యాయుఁడు విద్యార్థిని ప్రశ్నింపఁ గలఁడా? ప్రశ్నింపలేఁడు. ఈ యజ్ఞానమునకు మొదలేమున్నది? వానికి అది తెలియలేదు. ఆ తెలియక పోవుటకు మొదలు లేదు. ఉపాధ్యాయుని వలన అతఁడు ఆ లెక్కను చేయు పద్ధతి తెలిసికొనునపుడు వానికి, దానికి సంబంధించిన జ్ఞానము ఆరంభ మగును. దానితో వానికున్న యజ్ఞానము ముగిసినదని వ్యక్తమొనర్చును. ఈ యుదాహరణమును చక్కఁగ అర్థము చేసికొనఁగల్గినచో మోక్షమును కోరువాఁడు ఆత్మనుండి అజ్ఞానమును వేఱుపఱచునట్టి హేతువులను సులభముగ, స్పష్టముగ గ్రహింపఁ గలఁడు. శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెను :

శ్లో. అక్షరం బ్రహ్మ పరమం స్వభావో ఽ ధ్యాత్మ ముచ్యతే ।
( గీత. 8-3 )

"బ్రహ్మము అక్షరము, పరమము, స్వభావము, అధ్యాత్మ మని చెప్పఁబడుచున్నది."

బ్రహ్మము అక్షరము అనఁగ వినాశము లేనిది. అదియే పరమాత్మ. శ్రుతి యిటుల చెప్పుచున్నది : "ఓ గార్గీ! అక్షరము అవినాశ్యము అయిన పరమాత్మ యొక్క శాసనము చేతనే భూమ్యాకాశములు తమ స్థానములందు నిలుపఁబడి యున్నవి." (బృహదా. 3-8-9 )

ఇచ్చట అక్షర మనఁగా ఓంకారము కాదు. ( ఇఁక అహంకారము సంగతి విచారింతము ) ప్రతివ్యక్తి శరీరమందు ప్రత్యగాత్మ రూపములో ఉన్న యా పరబ్రహ్మమే శరీరమం దుండుటచే అధ్యాత్మమని, స్వభావమని చెప్పఁబడుచు తుట్టతుదకు సాక్షాత్కార సమయమున పరతత్త్వముగ, సాక్షాత్పరబ్రహ్మముగా గుర్తింపఁబడుచున్నది.

ఉదాహరణమునకు : నే నిపుడు వ్రాయుచున్నాను. కావున నేను రచయితను. నేను రచయితను అగుచున్నానా అనునది ప్రశ్న లేదు. వ్రాయుటను ఆపినచో నేను ఇంకేదియో అగుచున్నాను. నిజముగ మాటాడినచో వ్రాయుచున్నప్పుడు కూడ

నేను రచయితను కాను. కాని నేను రచయితను గూర్చి తెలిసికొనుచున్నవాఁడను అగుచున్నాను. ఈ తెలిసికొనుచున్నవాఁడు వ్రాయువాని కన్నను, వ్రాయుట కన్నను కేవలయు భిన్నుఁడు. ఈ తెలిసికొనుచున్న 'నేను' అహంకారముగ, గూఢముగ నున్నాఁడు. విచారణవలన అత్యంతము గూఢముగ లోపలనుండి తెలిసికొనుచున్న యీ 'నేను' తుదకు పరతత్త్వమైన బ్రహ్మ మనియే నిరూపిత మగుచున్నది. అధ్యాత్మము అను పదము వలన ఈ విషయము తెలియు చున్నది. ధ్యానయోగముచేత బ్రహ్మ జ్ఞానము కల్గుచున్నదని శ్రీకృష్ణుఁడు గీతలోని ఎనిమిదియవ యధ్యాయమున ప్రకటించు చున్నాఁడు. శ్రుతియందు, స్మృతియందు ఉద్ఘా టింపఁబడినట్లు మోక్షమునకు అవి ప్రత్యక్ష సాధనములు కావు అని, ప్రదర్శించు దృక్పథ ముతో ధ్యానయోగముకన్న జ్ఞానయోగమే ఉత్తమమైనదని, భక్తులకు నొక్కి చెప్పుట కొఱకై శ్రీకృష్ణుఁడు ఇంకను ఇట్లు చెప్పు చున్నాఁడు :

శ్లో. ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్ ॥
(గీత. 9-1)

"దేనిని తెలిసికొన్నచో అశుభమునుండి ముక్తిని పొందఁగలవో ఆ జ్ఞానమును విజ్ఞాన సహితముగ మిగుల రహస్యమైన దానిని అసూయలేని నీకు చెప్పుచున్నాను."

వివేకశాలి జ్ఞానమును పొందిన తరువాత ఆ జ్ఞానమునకు ఫలమైన సంతృప్తిని, సంతోష మును పొందవలయును. శ్రుతి, స్మృతుల యం దిట్లు చెప్పఁబడినది : "సర్వము వాసుదేవుఁడే" (గీత. 7-19). "ఇదంతయు ఆత్మ" (ఛాందోగ్య 7-25-2). "రెండవది లేకుండ ఒకటియే యున్నది" (ఛాందోగ్య 6-2-1).

జ్ఞానమును పొందిన పిమ్మట ఎవఁడైనను సంసారబంధము నుండి ముక్తుఁ డగును. పరమాత్మ స్ఫురణ మాత్రముగనే కాక ప్రత్యక్షముగ కూడ తెలిసికొనఁబడుచున్నది. అది స్వతఃప్రకాశము. అది సాక్షాత్కారము. సకలభూతములతో సమస్త విశ్వము బ్రహ్మమునందు విశ్రాంతి నొందుచున్నది.

శ్రీకృష్ణుఁడు వివరించుచున్నాఁడు :

శ్లో. మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః॥
(గీత. 9-4)

"అవ్యక్తమైన మూర్తిగల నాచేత నీ జగత్తు అంతయు వ్యాప్తమై యున్నది. సకలభూతములు నాయం దున్నవి కాని వాని యందు నేను లేను.

"నా యుత్తమోత్తమ స్థితిచేత విశ్వ మంతయు వ్యాప్తమై యున్నది. ఇది అక్షర బ్రహ్మము. నా రూపము ఇంద్రియము లకు గోచరము కాదు. బ్రహ్మము మొదలు కొని చిన్న మొక్కవఱకు సకలభూత ములు అవ్యక్తమూర్తినైన నాయందు వసించుచున్నవి. ఆత్మనైన నా వలననే సకలభూతములు జీవించుచున్నవి.

[గీత. 7-7 శ్లోకమును చూడుఁడు]

"సకలభూతములకు నేను ఆత్మ నగుటచే ఇంద్రియములకు, ఇంద్రియార్థములకు లోనైన వారికి నేను వాని యందు ఉన్నట్లుగా తోఁచుచుందును. భౌతికపదార్థములను వలె నాకు ఇతరభూతములతో సంబంధము

లేకుండుటవలన, నేను ఆ భూతముల యందు ఉండుట లేదని ప్రకటించుచున్నాను."

అవకాశముకన్నను పరమాత్మ అంతరతమ మైనదని ఇంతకు పూర్వమే నొక్కి వక్కాణింపఁబడి యున్నది. ఏ పదార్థముతో సంబంధము లేని వస్తువు, ఒక పాత్రలో వలె, ఒక పదార్థమునం దిమిడియుండుట సాధ్యము కాదు. ఇది యింకను బాగుగా అర్థమగుటకై వెండి కమండలువునే ఉదాహరణముగాఁ గైకొని పరిశీలింతము. వెండి అచేతనమే. అయినను దృష్టాంతము కొఱకు వెండి ఇట్లు భావించుచు మాటాడు ననుకొనుఁడు. వెండి పళ్ళెములు, గ్లాసులు, కమండలువులు మొదలగునవి యున్నవి. వెండి ఇట్లు అనుచున్నది. "కమండలువు, పళ్ళెములు, లోటాలు నాయం దున్నవి. నేను వానియందు లేను. ఎందువల్ల ననఁగా వానిని కరఁగించినచో అవి యన్నియు పోవును. నేను పోను. వాని యునికి నాపై ఆధారపడి యున్నది." ఇట్లే భగవంతుఁడును చెప్పుచున్నాఁడు :

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్యమే యోగ మైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥
[ గీత. 9-5 ]

"భూతములు నాయందు ఉండుట లేదు. ఈశ్వర సంబంధియైన నా యోగమును చూడుము. భూతములను భరించుచున్నవాఁడను నేనే అయినను నేను వానియందు లేను. నా స్వరూపము భూతకారణమై యున్నది."

శ్రుతి యిట్లు చెప్పుచున్నది : "అసంగమగుటచే ఆత్మ ఎందును సక్తమగుట లేదు"
[ బృహదారణ్యక. 3-9-26 ]

ఆత్మ దేనితోను సంసర్గము నొందదు. ఆత్మయొక్క అసంగత్వమును గమనింపుఁడు. ఇంకను మఱియొక విచిత్రము కలదు. "అసంగమైనను నా యాత్మ సకల భూతములను భరించుచున్నది. కాని వానియందు ఉండుట లేదు." ఆత్మకు ఏ పదార్థముతో సంసర్గము లేకుండుటచే ఈ స్థితి సంభవమగుచున్నదని ఇంతకు ముందే సహేతుకముగా వివరింపఁబడినది.

భగవంతుఁడు "నా యాత్మ" అని చెప్పుట ఎట్లు సమంజస మగుచున్నదో నిరూపించుట ఇచట కష్టమైన విషయము. భగవంతునకు ఒక ఆత్మ ఉన్నట్లు ఆయన పరమాత్మకన్న భిన్నుఁడైనట్లు తోఁచును. మనము జీవాత్మను, పరమాత్మను వేఱు పఱచి గ్రహింపవలయును. భౌతికములును, ద్రవ్యసంబంధములును అయిన పరిస్థితులకు జీవాత్మ ప్రాతినిధ్యము వహించుచున్నది. ఈ సందర్భమున భగవంతుఁడు "జీవాత్మ నా యాత్మ" అని పేర్కొనుచున్నాఁడు. జీవాత్మను గూర్చి యీ యభిప్రాయము ప్రజలలో ప్రసిద్ధమై యున్నది. శరీరావయవ సముదాయమునకు, ఆత్మకు చెప్పఁబడిన సంబంధము మిథ్యయని జాగరూకతతో గుర్తింప వలయును. వెండి ఇట్లు చెప్పుచున్నది. "పళ్ళెము, లోటా, కమండలువు నా యందు లేవు. కాని నా వలననే ఇవి యన్నియు అస్తిత్వమును కలిగి యున్నవి. అవి నాచేత భరింపఁబడుచున్నవి. కాని నేను వాని యందు వసించుట లేదు. అయినప్పటికిని నేనే వానికి కారణమై యున్నాను." కార్యమైన కమండలువు కారణమైన వెండియే కాని దాని కన్న భిన్నముగా లేదని మనము గుర్తింపవలసి యున్నది. అనఁగా

వెండి కమండలువుగా అయినట్లు కన్పించుచున్నదే కాని నిజముగా ఏమియును కాలేదు. వెండి ఎప్పుడును వెండిగానే యున్నది. దానియందు మార్పులేదు.

శ్రీకృష్ణభగవానుఁడు ఒక దృష్టాంతముతో పై రెండు శ్లోకములను వివరించుచున్నాడు.

శ్లో. యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్థ్సానీ త్యుపధారయ ॥
(గీత. 9-6)

"ఎల్లయెడలను చరించు మహావాయువు ఆకాశమునందు ఎట్లు ఉన్నదో అట్లే భూతములన్నియు నాయందున్నవని యెఱుంగుము.

"మహావాయువు ఎల్లయెడల చరించుచు ఎల్లప్పుడు ఆకాశమునందు ఉండునని ఎల్లరు ఎఱిఁగినదే. అట్లే సకల భూతములు నాయందున్నవి. నేను ఆకాశమువలె సర్వవ్యాపకుఁడనై యున్నాను. నాతో సంబంధము లేకయే సకల భూతములు నా యందు ఉన్నవి." ఇచ్చట ఆకాశము పరమాత్మతో, వాయువు భూతములతో పోల్చఁబడి యున్నవి. మన వెండి కమండలువు యొక్క ఉదాహరణమున వెండి పరమాత్మతో, కమండలువు, పళ్ళెములు, లోటాలు వాయువునకును, సకల భూతములకును పోల్చఁబడినవి. కమండలువు, పళ్ళెములు, లోటాలు వెండితో ఎట్టి సంబంధము లేకయే వెండియందున్నవి. విశ్వము ఉన్నంతవఱకు వాయువు ఆకాశమునందుండును. అట్లే సకల భూతములు భగవంతునియందుండును.

శ్లో. సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥
(గీత. 9-7)

"ఓ కౌంతేయ! కల్పాంతమునందు సకలభూతములు నా ప్రకృతిని చేరుచున్నవి. కల్పము యొక్క ఆదియందు మరల వానిని వెలివఱచుచున్నాను."

అపరాప్రకృతి త్రిగుణాత్మిక. కల్పాంతమనఁగా ప్రళయము. కల్పాది యనఁగా సృష్టి ఆరంభమగు కాలము. వ్యక్తియొక్క మరణము ప్రళయముకన్న భిన్నము. ప్రళయమునందు సకలభూతములు భగవంతుని ప్రకృతియందు లీనమై యుండును. మోక్షము ప్రళయము కన్న భిన్నము. పరిమితమైన కాలమున కల్పము జరుగును. కల్పారంభమున సకలభూతములు విశ్వములోనికి ప్రవేశింపఁజేయఁబడుచున్నవి.

మన యుదాహరణమున కమండలువు, పళ్ళెములు, లోటాలు సకలభూతములతో పోల్పఁబడినవి. వానిని కరఁగించినప్పుడు అనఁగా వానికి ప్రళయము సంభవించినప్పుడు కమండలువు మొదలైన వస్తువు లన్నియు తమకు ఆత్మయైన వెండియందు లీనమగుచున్నవి. కమండలువు మొదలుగా ఇవి ఏవియును వెండికన్న భిన్నముగా కన్పించుట లేదు. సకలభూతములు పరమాత్మయందు ఉన్నట్లే ఇవి యన్నియు వెండియందున్నవి. కల్పారంభమున, అనఁగా ఉత్పత్తికాలమున భూతము లన్నియు విశ్వములోనికి పంపఁబడుచున్నవి. ఇట్లే మనము కోరినప్పుడు వెండినుండి కమండలువు మొదలగునవి సృష్టింపఁబడుచున్నవి.

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥
[గీత. 9-8]

"ప్రకృతికి లోనై అవశమై యున్న యీ భూతముల సముదాయము నంతను నా ప్రకృతిని అవలంబించి మాటిమాటికి వెలివఱచుచున్నాను."

ఈ యుత్పత్తి ఏ యాధారమున జరుగుచున్నదని ప్రశ్న. వివిధములైన భూత సముదాయములను వెలివఱచుటలో భగవంతునకు మార్గదర్శక మేమున్నది ?

"నా ప్రకృతి" అని భగవంతుఁ డన్నప్పుడు అది అవిద్యామయమైన యపరా ప్రకృతియే. ప్రకృతిసాయమున భగవంతుఁడు మాటిమాటికి సకలభూతములను వెలివఱచుచున్నాఁడు. అవిద్య వలన శక్తిహీనములై సకలభూతములు ప్రకృతి యొక్క లేక స్వభావము యొక్క ప్రభావమునకు లోనగుచున్నవి అని గుర్తింపవలయును. మన మందఱము జీవులము, నిత్యులము అని గుర్తించి మాటిమాటికి స్మరింప వలయును. మనము స్వతంత్రులమైన కర్తలము, భోక్తలము. మనము త్రిగుణములు అను నాలుగు గోడలమధ్య నున్నాము. మన కృత్యము లన్నియు త్రిగుణములచే నియమింపఁబడుచున్నవి. ఇట్లు మనము మంచిపనులను, చెడ్డ పనులను చేయుచున్నాము. చిత్రగుప్తుఁ డను దేవత మన మంచిపనుల యొక్క, చెడ్డ పనుల యొక్క సరియైన లెక్కలను, వర్ణనలను అద్భుతముగా తయారు చేయుచుండును. కర్మఫలప్రదాత యైన యీశ్వరుఁడు మన మంచిపనులకు, చెడ్డపనులకు ఫలముల నొసంగు చుండును. ప్రళయము నందు జీవు లందఱును కర్మవాసనలతో ప్రకృతియందు లీనమై యుందురు. నూతన కల్పారంభమున పరమేశ్వరుఁడు వారి వారి కర్మవాసనలను అనుసరించి జీవుల నందఱను మరల మరల సృష్టించు చుండును.

ఈ సృష్టికి సంబంధించినంత వఱకు భగవంతుని ఆయన చేయు కార్యములు బంధింపవు.

అనుభవించు వాని కోరికను బట్టి నిర్వికారము, మూలద్రవ్యము నైన వెండినుండి పెక్కు రూపములతో, అనేక నామములతో ఎన్ని వస్తువులైనను తయారుచేయ వచ్చునని మన కమండలువు యొక్క ఉదాహరణము వలన గ్రహింప వచ్చును. ఈ నామములతో, రూపములతో ఎట్టి సంబంధము లేకుండ వెండి వెండిగానే యుండును.

జీవసముదాయ సృష్టిలో ఒక ప్రాణికి మఱియొక ప్రాణికి చాల భేదములను మనము చూచుచున్నాము. వీరి సృష్టియందు కన్పించుచున్న హెచ్చులు, తగ్గులు మొదలైన భేదములకు పరమాత్మను బాధ్యునిగా భావించుటకు వీలులేదు.

శ్లో. న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ ।
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు ॥
(గీత. 9-9)

"ఓ ధనంజయ ! ఉదాసీనునివలె అసంగుఁడనై యున్న నన్ను ఆ కర్మలు బంధింపవు."

ఈశ్వరుని సృష్టి అసమానము. ఆ వ్యాపారము లాయనను బంధింపవు. వానితో ఆయనకు సంగము లేకుండుటయే అందులకు కారణము. ఆత్మ అవ్యయము. అది సృష్టి వ్యాపారములందు సక్తము కాదు. భగవంతునకు ఆ కర్మ ఫలముల యందు సంగము లేదు. "నేను చేయుచున్నాను," "నేను అనుభవించుచున్నాను" అని యిట్టి యహంకారభావన ఆయనకు లేదు.

మఱి భగవంతుని వాక్యములలో విరోధ మున్నట్లు తోఁచుచున్నది గదా! "నేను జీవసముదాయమును వెలివఱచుచున్నాను" అని చెప్పుచు ఆయన, "నేను ఉదాసీనుని వలె వున్నాను" అని కూడ చెప్పుచున్నాఁడు. ఇందులకు వివరణముగా ఆయన ఇట్లు చెప్పుచున్నాఁడు :

శ్లో. మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్,
హేతు నానేన కౌంతేయ జగ ద్విపరివర్తతే ॥

(గీత. 9-10)

"నేను అధ్యక్షుఁడనుగా ప్రకృతి చరాచరమైన జగత్తును పుట్టించుచున్నది. ఓ కౌంతేయ! ఈ హేతువుచేతనే జగత్తు వర్తించుచున్నది."

భగవంతుఁడు అన్నివైపుల పరిశీలించుచు మార్పు నొందని సాక్షిగా, జగత్తునకు అధ్యక్షుఁడుగా నున్నాఁడు. బీజముగా నున్న యవ్యక్తమైన ప్రకృతి (అవిద్య) త్రిగుణాత్మకమై చరాచరాత్మకమైన విశ్వమును సృష్టించుచున్నది. శ్రుతి యిట్లు చెప్పుచున్నది: "దేవుఁడు ఒక్కఁడే. అతఁడు సర్వభూతములయందు గూఢుఁడై, సర్వవ్యాపియై, సర్వభూతములకు అంతరాత్మయై, కర్మలకు అధ్యక్షుఁడై, సర్వభూతములకు ఆశ్రయుఁడై, సాక్షియై, చిద్రూపుఁడై, కేవలుఁడై, నిర్గుణుఁడై యున్నాఁడు."

(శ్వేతాశ్వతర. 6-11)

ప్రపంచములోని చంచలములైన వికారములను జూచి మన జీవితములపై మనకు రోఁత కలిగినప్పుడు, నిరాశవలన ఒక్కొక్కప్పుడు మనము ఈ సృష్టివలన ప్రయోజన మేమి అని ప్రశ్నించుచుందుము. పరమాత్మ అనుభవింప వలసినది ఏదియు లేకపోవుటచే, ఆయన యనుభవము కొఱకై ఇది యుద్దేశింపఁ బడినది అని చెప్పుటకు వీలులేదు. కేవల చైతన్యమే ఆయన స్వరూపము. ఆయన కేవలము సాక్షి. అనుభవించుటకు వేఱొక చేతనుఁడు లేఁడు. అచేతనము మోక్షమును సంపాదింపఁ జాలదు. నిజమునకు అది మోక్షమునకు విరోధి. కావున ఇందు ప్రశ్నగాని, ప్రతివచనముగాని సంభవము కాదు. పరమాత్మ యొక్క మాయ వలన సృష్టి జరుగుచుండుట వలన దీనికి అవకాశము కూడ లేదు. గురువు నొద్ద సముచితమైన శిక్షణము లేకుండ పరమాత్మను తెలిసికొనుట చాల కష్టము. శ్రుతి కూడ ఇట్లు చెప్పుచున్నది :

"వివిధమైన యీ సృష్టి ఎక్కడనుండి, ఎందులకై పుట్టుచున్నదో ఎవఁడు తెలిసికొనుచున్నాఁడు? ఎవఁడు చెప్పుచున్నాఁడు?" (తైత్తిరీయ బ్రాహ్మణ. 2-8-9) శ్రీకృష్ణుఁడు కూడ చెప్పెను.

"జ్ఞానము అజ్ఞానముచేత ఆవరింపఁబడి యున్నది. ఆ కారణము చేత ప్రాణులు మోహమును పొందుచున్నారు." [గీత. 5-15] అజ్ఞానముచేత సృష్టి సంభవించుచున్నదని గీత చెప్పుచున్నది.

*

# పరాపర ప్రకృతులను కలిగియున్న ఈశ్వరుని ముఖ్య స్వభావము ఏమి?

పూర్వ విషయమునందు పరమాత్మ యొక్క రెండు ప్రకృతులను గూర్చి చెప్పఁబడినది. సంసార కారణమగుటచే అపరా ప్రకృతి హీనమైనది. జీవస్వరూపమైన పరాప్రకృతి ఉత్కృష్టమైనది. ఇదియే క్షేత్రజ్ఞుఁడుగ పరమాత్మతో తప్పనిసరిగా ఏక మగుచున్నది. పైన పేర్కొనఁబడిన రెండు ప్రకృతుల వలన ఈశ్వరుఁడు విశ్వము యొక్క ప్రభవమునకు, స్థితికి, ప్రళయమునకు కారణ మగుచున్నాఁడు. త్రిగుణాత్మిక మైన ప్రకృతి శరీరములు, ఇంద్రియములు, విషయములు మొదలుగా సకల పదార్థములుగా రూపొందుచున్నది. శరీరేంద్రియ సముదాయములు ఇట్లు ఏర్పడుచున్నవి. పురుషుని యొక్క భోగము, ముక్తి అను రెండు లక్ష్యములకు సాధన మగుటయే దీనికి ప్రయోజనము. భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో. ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మి త్యభిధీయతే ।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥
(గీత. 13-2)

"ఓ కౌంతేయా! ఈ శరీరము క్షేత్ర మని చెప్పఁబడుచున్నది. దీని నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వానిని క్షేత్రజ్ఞుఁడని ఆ విషయ మెఱింగినవారు చెప్పుచున్నారు."

ఈ శ్లోకమున తెలిసికోవలసిన ముఖ్యాంశ మొకటి కలదు. ఈ శరీరము అను మాటలతో ఈ శ్లోకము ఆరంభ మగుచున్నది. "ఈ "లేక" ఇది" అను సర్వనామముచేత భగవంతుఁడు భౌతికమైన శరీరమును క్షేత్రమునుగా నిర్దేశించినాఁడు. శరీరమును నిర్దేశించుటకు భగవంతుఁడు ఇది (ఈ) అను సర్వనామమును ఏల ఉపయోగించెను? ఇది టాయి, ఇది విశ్వము, ఇది కొయ్య, ఇది శరీరము అని ఇట్లు మనము సాధారణముగా చెప్పుచుందుము. పదార్థములు ఒకదాని కన్న ఒకటి భిన్నమైనను ప్రతిపదార్థము "ఇది" అను సర్వనామముచేత నిర్దేశింపఁబడుచున్నది. నామవాచకమునకు బదులుగా ఉపయోగింపఁబడు పదము సర్వనామ మని నిర్వచింపవచ్చును. వ్యక్తి, ప్రదేశము, వస్తువు మొదలగువాని యొక్క నామమును చెప్పునది నామవాచక మని నిర్వచింపవచ్చును. వస్తువనఁగా చూచుటకు, తాఁకుటకు వీలైనది. లేక చూచుటకు, తాఁకుటకు వీలు లేకున్నను ఆలోచనకు అందునట్టిది యైనఁ గావచ్చును. "ఈ శరీరము" అని చెప్పినప్పుడు "శరీరము" అను పదము ఏ భాషాభాగ మగును? శరీరము అను పదము కేవలము నామవాచక మనిగదా తోఁచును,

కాని దానివలన వచ్చుచున్న యర్థమును గమనించుచు సరిగా చెప్పవలయు నన్నచో, అది సాధారణమైన విశేష్యము కాదు. అది నామవాచక విశేషణము, విశేషణాత్మకము.

విశేషణ మనఁగా నామవాచకమునకుఁ గాని, సర్వనామమునకుఁగాని అర్థవిశేష మును గలిగించు పదము అని నిర్వచింప వచ్చును. అది తనకు ముందు గాని, వెనుక గాని యున్న కొన్ని నామవాచకములకు అర్థ విశేషణమును కలిగించును. ఈ సందర్భమున "ఈ శరీరము" అను ప్రయోగమున శరీరము విశేషణమై "ఈ" అను సర్వ నామమునకు విశేషమును కలిగించుచున్నది.

మఱియొక యుదాహరణమును తీసి కొందము. "అతఁడు రామకృష్ణరావు." ఈ వాక్యమున "అతఁడు" సర్వనామము. "రామకృష్ణరావు" వ్యక్తియొక్క పేరు అని మనము చెప్పుదుము. తుదకు ఆ వాక్యమున కేమి యర్థము? అతఁడు అను సర్వనామము యొక్క సామాన్యమైన యర్థము, రామకృష్ణరావు అను పదము చేత ప్రత్యేకముగా స్పష్టపఱుపఁబడినది. అతఁడు అనఁగా రామకృష్ణరావు అను పేరు గల పురుష వ్యక్తి. "అతఁడు రామకృష్ణ రావు" అను వాక్యము యొక్క అర్థమును పరీక్షింపుఁడు. అతఁడు ఏ వ్యక్తి? అతఁడు రామకృష్ణరావు అని సమాధానము. ఈ యర్థ వివరణమును వేదాంత మతము దృఢ పఱచుచున్నది. కావున సరిగా చెప్పినచో, రామకృష్ణరావు అను పదము అర్థముచేత విశేషణము మాత్రమే. అది "అతఁడు" అను సర్వనామమునకు అర్థవిశేషమును కలిగించుచున్నది. వాస్తవముగా "అతఁడు" అను సర్వనామమునకు విశేషణముగా తప్ప "రామకృష్ణరావు" అను పదమునకు స్వతంత్రమైన యస్తిత్వము లేదు. "ఇది" అను నొక్క పదమే సమస్త విశ్వమును నిర్దేశించుచున్నది. పొరపాటుచేత ప్రతి వాఁడు విశ్వముతో తాదాత్మ్యమును పొందు చున్నాఁడు. విచారణముచేత తాను జగత్తు కాదని గ్రహింపఁగలఁడు. మధ్యమపురుషలో ఏకవచనమున "నీవు ఇది కాదు," "నీవు అది." ఈ శ్లోకమును మరల పరీక్షింతము.

ఈ శరీరము క్షేత్రముగా పేర్కొనఁబడినది. దీనిని తెలిసికొనుచున్నవాఁడు క్షేత్రజ్ఞుఁ డని ప్రసిద్ధుఁడై యున్నాఁడు. జీవాత్మకు ఈశ్వరునితో తాదాత్మ్యము ఇట్లు చెప్పఁ బడినది :

శ్లో. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥

"ఓ భారత! సర్వక్షేత్రములయందు వున్న క్షేత్రజ్ఞుని నన్నుగా నెఱుంగుము. క్షేత్రమును, క్షేత్రజ్ఞుని తెలుపు జ్ఞానమే జ్ఞాన మని నా యభిప్రాయము."

జీవాత్మ, పరమాత్మ ఒక్కటే. జ్ఞానము, అజ్ఞానము కార్యముచేత భిన్నములు. బుద్ధి మొదలగు నుపాధుల వలన ఆత్మ సంసారిగా కన్పించుచున్నది. అది అవిద్యవలన ఏర్పడుచున్న మిథ్య. చీఁకటి యందున్న స్తంభము మనుష్యుఁడను భ్రాంతిని కలిగించు చున్నట్లు అనాత్మ మైన శరీరాదికములతో ఆత్మకు తాదాత్మ్యభావన అవిద్యవలన సకల మర్త్యుల యందును సాధారణముగా కలుగు చున్నది. ఈ భ్రాంతి వలన మనుష్యుని లక్షణములు స్తంభమునకు కాని, స్తంభము యొక్క గుణములు మనుష్యునకుఁగాని వాస్తవముగా సంక్రమించుట లేదు. ఆత్మా

నాత్మల విషయమున కూడ ఇంతే. చైతన్య మెప్పుడును శరీరమునకు సంబంధింపదు. సుఖము, దుఃఖము, మాంద్యము మొదలైన దేహలక్షణములు చైతన్యమాత్ర మైన యాత్మకు చెందవు. జీర్ణత్వము, మృత్యువు మొదలైన విశేషణములు అవిద్య వలన ఆత్మకు ఆరోపింపఁబడుచున్నవి. మంచి వెలుఁగులో స్తంభమును చూచినప్పుడు పొరపాటు తొలఁగిపోవుచున్నది. అట్లే ఆత్మయొక్క జ్ఞానము కలిగినప్పుడు మాయ తొలఁగిపోవుచున్నది. అట్టివాఁడు తన యాత్మను పరమాత్మనుగా సాక్షాత్కరించు కొనును. ద్రవ్యమనఁగా ఏది ?

శ్లో॥ మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ।
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియ గోచరాః॥
[ గీత. 13-6 ]

"మహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, పదునొకండు ఇంద్రియ ములు, ఇంద్రియ విషయములు అయిదు."

మహాభూతములు ఇంద్రియ విషయము లుగా చెప్పఁబడలేదు. అవి యన్నియు ప్రకృతియొక్క వికృతులు. ఇచట నిర్దే శింపఁబడిన భూతములు సూక్ష్మములు; స్థూలములు కావు. అహంకారము మహా భూతములకు కారణము. బుద్ధి అహంకారము నకు కారణము. అవ్యక్తము, లేక అవ్యా కృతమైన యీశ్వరశక్తి బుద్ధికి కారణము. శ్రోత్రము మొదలుగా బుద్ధీంద్రియములు అయిదు. మనస్సు ఒక్కటి అంతరింద్రియము. శబ్దము మొదలైన వైదును ఇంద్రియ గోచ రములైన విషయములు. సాంఖ్యశాస్త్ర మున ఇవియే ఇరువదినాల్గు తత్త్వములుగా చెప్పబఁడుచున్నవి. ఇంక—

శ్లో॥ ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥

"ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, అవయవ సముదాయ రూపమైన శరీరాది కము, ప్రజ్ఞ, ధృతి ఇది యంతయు వికార సహితముగా క్షేత్ర మని సంగ్రహముగా చెప్పఁబడినది.

సుఖమును కలిగించు పదార్థమును పొంద వలయు నను తలంపు ఇచ్ఛ. ఇది అంతః కరణధర్మము. ఇది తెలిసికొనుటకు వీలగు చున్నది. కావున క్షేత్ర మగుచున్నది. ఇట్లే ద్వేషము, సుఖము, దుఃఖము, సము దాయము, బుద్ధి, ధృతి ఇవి యన్నియు అంతఃకరణ ధర్మములై జ్ఞేయము లగు టచే క్షేత్ర మగుచున్నవి. మహత్తు మొద లైన వికారములతో కూడిన క్షేత్రము మొత్తమువిూఁద ఈ శరీరముగా చెప్పఁబడి నది. [ గీత. 13-1 ] మహాభూతముల నుండి ధృతివఱకు దాని యొక్క వివిధరూపములు వర్ణింపఁబడి యున్నవి. ( గీత. 13-5, 6 )

బ్రహ్మము వాక్కునకు, మనస్సునకు అతీతము.

శ్లో. జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే।
అనాదిమ త్పరం బ్రహ్మ న స త్త న్నాస దుచ్యతే॥
( గీత. 13-12 )

"దేనిని తెలిసికొన్నచో అమృతత్వము కలుగునో అట్టి జ్ఞేయమైన తత్త్వమును చెప్పు చున్నాను. పరబ్రహ్మము అనాది. అది 'సత్' అని కాని, 'అసత్' అని కాని చెప్పఁబడుట లేదు."

బ్రహ్మము "ఉన్నది" అని కాని, "లేనిది" అని కాని చెప్పుటకు వీలు లేదు. కావున

జ్ఞేయమైన బ్రహ్మము వాక్కులకు అందనిది అగుటచే, అన్ని యుపనిషత్తులలో అది నిషేధాత్మకముగా నిర్వచింపఁబడినది. "నేతి నేతి" (ఇది కాదు, ఇది కాదు)—బృహదారణ్యక, 2-3-6. "అస్థూలము, అనణువు" బృహదారణ్యక, 3-8-8. "ఇది అదికాదు." నాస్తి బుద్ధికి విషయము కాకపోవుటచే అది లేనిది కాదు. అది ఇంద్రియగోచరము కాదు. అస్తిత్వబుద్ధికి కాని, నాస్తిత్వబుద్ధికి కాని అది విషయము కాదు. అది కుండవలె ఇంద్రియ గోచరమైన విషయమైనచో దాని యొక్క అస్తిత్వము, నాస్తిత్వము మనకు గోచర మగును. ఈ జ్ఞేయము ఇంద్రియములకు అగోచరమై అపౌరుషేయ మైన శబ్దమే ప్రమాణముగా తెలిసికొనఁదగి యున్నది. కావుననే అది "సత్" అని కాని, "అసత్" అని కాని చెప్పఁబడ లేదు. శ్రుతి ఇట్లు చెప్పుచున్నది. "అది విదితము కన్న అన్యము; అవిదితముకన్నను అతీతము." (కేనోపనిషత్తు. 2-3) బ్రహ్మము ప్రతి వ్యక్తికి తనయాత్మకన్న భిన్నము కాదు. దాని కదియే ప్రమాణము. "అది నిష్కలము, నిష్క్రియము, శాంతము" (శ్వేతాశ్వతర. 6-19)

"అది ఏకము. దానికి దేనితో సంబంధము లేదు. అది యద్వితీయము. అది ఏ యింద్రియమునకు విషయము కాదు. అది ఆత్మ. అది స్వసంవేద్యము. అది ఏపదముచేతను నిరూపింపఁబడదు." వాక్కులు, మనస్సు దేనిని అందుకోలేక మరలుచున్నవో (అది బ్రహ్మము) తైత్తిరీయ. 2-4-1.

కాని అది శూన్యమని చెప్పుటకు వీలు లేదు. ఈ యభిప్రాయమును నివారించుటకు శ్రీకృష్ణుఁడు బ్రహ్మముఁ 1) ప్రత్యగ్రూపముగా మనయందు (2) ఇంద్రియాదుల వ్యాపారములకు కారణముగా (3) భావనా మాత్రమైన సకల ద్వైతప్రపంచముయొక్క అస్థిత్వబుద్ధికి కారణముగా (4) జగత్తునకు ఈశ్వరుడుగా ఉన్న దని వర్ణించుచున్నాఁడు.

అచేతనములై క్రియలు గల దేహము మొదలగు నుపాధులకు, అచేతనములై క్రియాన్వితము లైన విషయములకు వెనుక ప్రత్యక్చైతనమైన తత్త్వముండి తీరవలయును. బ్రహ్మము శూన్యమగుచో, తుదకు ఏమియు మిగుల కున్నచో, అది శూన్యము అని యైన మనము గ్రహించుటకు ఎట్లు వీలగును అని ప్రశ్నింపవలసి యున్నది. ఆ శూన్యమును తెలిసికొనువాఁడైనను ఒకఁడు ఉండవలయును కదా! ప్రత్యక్చైతన్యమే పరమాత్మ యనుట తుది నిర్ణయము. అదియే ప్రజ్ఞానబ్రహ్మము.

ఈ విషయము తెలిసికొనుట కష్టమగుటచే నిత్యులైన ప్రకృతి పురుషులను పరీక్షింతము. సకలభూతములకు గర్భస్థానీయము లైన "అపరా, పరా" అను రెండు ప్రకృతులు ముందే వర్ణింపఁబడినవి. (గీత. 7-6) క్షేత్ర క్షేత్రజ్ఞులను గూర్చి కూడ తెలిసికొంటిమి. ఇప్పుడు ప్రకృతి పురుషులను గూర్చి చర్చింతము.

శ్లో. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్॥
[గీత. 13—20]

"ప్రకృతి పురుషు లిరువురును అనాదు లని ఎఱుంగుము. సకలరూపములును, గుణములును ప్రకృతివలన సంభవించుచున్న వని తెలిసికొనుము."

ప్రకృతి పురుషుఁడు (ద్రవ్యము, చైతన్యము) ఈశ్వరుని యొక్క ప్రకృతి.

ప్రకృతి పురుషులకు మొదలు లేదు. నిత్యుఁడైన యీశ్వరుఁడు ఈ రెండింటికి మూలమై యున్నాఁడు. కావున ఈ రెండును నిత్యములే యగుట సహజము. ఈ రెండింటి వలన ఈశ్వరుఁడు జగత్తు యొక్క సృష్టి స్థితి లయములను కలిగించుచున్నాఁడు. ఈశ్వరుని యొక్క ప్రకృతులు రెండును అనాదులు. కావున అవి సంసారమునకు కారణమగు చున్నవి.

ప్రకృతి నుండియే సకలరూపములును, గుణములును ప్రభవించు చున్నవి. ప్రకృతి నిత్యము. అదియే అన్ని వికారములకు, గుణములకు మూలమై యున్నది. ఆత్మ మాత్రము నిర్వికారముగా, నిర్గుణముగా నున్నది.

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు:

శ్లో. కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే।
పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే॥
[ గీత. 13–21 ]

"కార్యకారణముల కర్తృత్వమునందు ప్రకృతి హేతువుగా చెప్పఁబడుచున్నది. సుఖదుఃఖముల భోక్తృత్వమునందు పురుషుఁడు హేతువుగా చెప్పఁబడుచున్నాఁడు."

కార్య మనఁగా భౌతిక శరీరము. కరణములు లేక సాధనములు పదుమూఁడు శరీరము నందున్నవి. జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు అయిదు, మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి యీ పదుమూఁడు.

పురుషుఁడు, జీవుఁడు, క్షేత్రజ్ఞుఁడు, భోక్త —ఇవి యన్నియు పర్యాయపదములు. పురుషుఁడు చేతనుఁడుగా సుఖమును, దుఃఖమును ఇంద్రియముల ద్వారమున అనుభవించుచుండును. కావున అతఁడును కారణమే యగుచున్నాఁడు.

ఇచ్చట పేర్కొనఁబడిన పురుషుఁడు పరమాత్మ కాదని గుర్తింప వలయును. పురుషుఁడు చైతన్యతత్త్వముగా పరిమితుఁడైన జీవుడు. నిత్యముక్తమైన యాత్మ స్వయముగా సంసారమునకు లోనుగాదు.

భోక్త, భోగము, భోగ్యము అనునవి భిన్నములని సాధారణముగా అందఱి యనుభవములో నున్నదే. సుఖమునుగాని, దుఃఖమును గాని అనుభవించునప్పుడు భోక్తయైన జీవుఁడు మార్పునొందుచుండఁగా, పరమాత్మ నిర్వికారముగానే యుండును. ఈ భోగమే జీవునకు సంసారము. ఇదియే వానిని సంసారినిగా చేయుచున్నది. అవిద్య, కామము పునర్జన్మలకు కారణములు.

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాడు:

శ్లో. పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోఽస్య సదస ద్యోని జన్మసు ॥

"ప్రకృతియందున్న పురుషుఁడు దాని వలన కలుగుచున్న గుణములను అనుభవించుచున్నాఁడు. ఈ గుణముల యందున్న సంగము వానియొక్క మంచిజన్మలకు, హీన జన్మలకు కారణ మగుచున్నది."

భోక్తయైన పురుషుఁడు ప్రకృతియందు నెలకొని యున్నాఁడు. ప్రకృతి అనఁగా ఏమి? అది అవిద్యయే. ప్రకృతి సంభవములైన శరీరేంద్రియములతో తాదాత్మ్యము నొందుట పురుషునకు గాఢమైన యభ్యాసము. సుఖము, దుఃఖము, మోహము మొదలుగా ప్రకృతినుండి పుట్టు గుణములను పురుషుఁడు అనుభవించుచున్నాఁ డన్నమాట. "నేను సుఖముగా నున్నాను", "నేను కష్టపడు

చున్నాను", "నేను వివేకము కలిగి యున్నాను", "నేను మోసపోయితిని" అని యీవిధముగా అతఁడు తలంచు చున్నాఁడు. వీని నన్నింటిని మించి ఆతని యందు గాఢమైన యభ్యాసముగా నెలకొని యున్న శరీర తాదాత్మ్యము ప్రధానముగా వాని జన్మపరంపరలకు కారణమై యున్నది. శ్రుతి యిట్లు చెప్పుచున్నది : "అతఁడు ఎట్టి కామము కలవాఁడు అగుచున్నాఁడో, అట్టి సంకల్పము కలవాఁడు అగుచున్నాఁడు." ( బృహదారణ్యక. 4-4-5 )

పురుషునకు స్థానమైన యవిద్యారూప ప్రకృతి, ఆతని కామము లేక గుణసంగము అను నీ రెండును కలిసి సంసారకారణ మగు చున్నవి. అవిద్య ఉపాదాన కారణము ; కామము నిమిత్త కారణము. వైరాగ్యము సన్న్యాసమునకు త్రోవఁ జూపును. సన్న్యాస ముతో కూడిన జ్ఞానము అవిద్యా కామము లను అంత మొందించును. జ్ఞాన మనఁగా ఏదియో శ్రీకృష్ణుఁడు మాటిమాటికి ఉపదేశించుచున్నాఁడు :

శ్లో. ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥
( గీత. 13-23 )

"సమీపమునందుండి చూచువాఁడు, అనుమతి నిచ్చువాఁడు, భరించువాఁడు, అనుభవించువాఁడు, మహేశ్వరుఁడు, పర మాత్మ అని ఈ దేహమునందే పరముఁడై యున్న పురుషుఁడు చెప్పఁబడుచున్నాఁడు."

ఉపద్రష్ట యనఁగా స్వయముగా తా నేమియు చేయక సర్వమును సాక్షిగా చూచుచుండువాఁడు. యజ్ఞ కర్మయందు ఋత్విక్కులు తమ కార్యములందు నిమగ్నులై యుండఁగా, ఆ యజ్ఞ కర్మలలో ఉచితము లైన యాదేశములను ఆవశ్యకమైనప్పు డొసంగుటకు ఆ కర్మలలో నిపుణుఁడైనవాఁడు ఒకఁ డుండును. అట్లే శరీరేంద్రియముల వ్యాపారములతో సంబంధము లేకుండ ఆత్మ యుండును. ఆత్మ కన్నను అత్యంత సన్ని హితము, అంతరతమమును అయిన సాక్షి అంతరంగమున మఱి యొకఁడు లేఁడన్న మాట. అందువలన ఆత్మ ఉపద్రష్టగా చెప్పఁబడినది. జరుగుచున్న కృత్యములకు అంగీకారము నొసంగుచుండుటచే ఆత్మయే అనుమన్తగా కూడ చెప్పఁబడుచున్నది. భరించుటచే ఆత్మయే భర్త. ఆత్మయొక్క ప్రోద్బలము లేక ఏ పనియు జరుగదు. భోక్త కూడ ఆత్మయే.

ఆత్మ నిత్యచైతన్య స్వరూప మగుటచే అనుభవించునదియును అగుచున్నది. ఆత్మయే మహేశ్వరుఁడు. ఆత్మ సమస్త విశ్వముతో ఏకమై యున్నను స్వతంత్రముగ నున్నది. ఉపద్రష్ట మొదలగు పదములచేత నిర్వచింపఁ బడిన యాత్మ పరమమైనది. ఎందువల్ల ననఁగా, అనాదియైన యజ్ఞానముచేత ఆత్మ యను భ్రాంతిని గలిగించుచున్న భౌతిక దేహము నుండి అవ్యక్తము వఱకుఁ గల యన్నింటి కన్నను అది ఉత్కృష్ట మైనది.

అన్యోన్య విరుద్ధములైన క్షేత్ర క్షేత్రజ్ఞు లకు, అనఁగా విషయికి, విషయమునకు మధ్య గల సంబంధము పరస్పరాధ్యాసారూప మైనది. అది వివేకము లేకపోవుట వలన కలుగుచున్నది. కావున జీవాత్మ, పర మాత్మల జ్ఞాన మొక్కటే మోక్షమునకు చేర్చును.

## ముగింపు

కూటస్థమై అవ్యయమైన బ్రహ్మము తాను విశ్వమునకు కారణము కానేరదు. కాని, కాల వశమున సూక్ష్మమై, అనభివ్యక్త శక్తిసహితమైన మాయతో కూడిన బ్రహ్మము విశ్వమునకు ఆదికారణ మయ్యెనని చెప్పుచున్నారు. సకల కార్యములకు బ్రహ్మము నియతము. అవ్యభిచారియు నైన పూర్వసిద్ధవస్తువు. కావున అది విశ్వకారణముగా చెప్పఁబడుచున్నది.

శ్రీకృష్ణుఁడు ఇట్లు చెప్పుచున్నాఁడు :

శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥
( గీత. 15-16 )

"క్షరుఁడు, అక్షరుఁడు అని ఇరువురు పురుషులు కలరు. సకలభూతములు క్షర రూపములు అని, కూటస్థుఁడు అక్షరుఁడని చెప్పఁబడుచున్నది."

మనకు సంసారములో రెండు విధములైన భూత సముదాయములు కన్పించును. అవి చైతన్యరూపుఁడైన యొక్క పురుషుని యుపాధులే యగుటచే, వానిని కూడ పురుషులనియే చెప్పుచున్నారు. ఒక సముదాయము క్షరము, మఱియొకటి అక్షరము. ఈశ్వరుని మాయాశక్తియే అక్షరము. దీని నుండియే క్షరము ఉద్భవించుచున్నది. అసంఖ్యాకులైన మర్త్య జీవులయొక్క కామము, క్రియ మొదలగు సకల సంస్కారములకు అదియే స్థానము. మాఱుచుండు రూపములతో కూడిన సమస్త విశ్వము క్షరము. కూటస్థము అనఁగా మార్పులేనిది అక్షరము. సంసార బీజము అనంత మగుటచే అది అక్షరముగా చెప్పఁబడినది. బ్రహ్మజ్ఞానము చేత తప్ప ఈ బీజము నశింపదు. వృక్షమువలె ఛేదింపఁదగినది. కావున సంసారము వృక్షముతో పోల్చఁబడినది.

ఈ క్షరమునకు, అక్షరమునకు అతీతముగ నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావమైన వస్తు వొకటి యున్నది. ఈ సర్వోన్నతమైన తత్త్వమును శ్రీకృష్ణుఁడు ఇట్లు ప్రశంసించుచున్నాఁడు :

శ్లో. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥
( గీత. 15-17 )

"మూఁడు లోకములయందు వ్యాపించి వానిని భరించుచున్న యవ్యయుఁడైన యీశ్వరుఁడు మాత్రము ఉత్తముఁడైన పురుషుఁడు ; అతఁడే పరమాత్మయని చెప్పఁబడుచున్నాఁడు."

సర్వోన్నతమైన చైతన్యము పైన పేర్కొనఁబడిన రెండింటికన్న విలక్షణము. అదియే పరమాత్మ. భౌతిక దేహము మొదలగునవి అవిద్యాకల్పితము లగుటచే అది పరమము అగుచున్నది. సకల భూతములందును అభంగురమైన యంతర్యామి చైతన్య మగుటచే అది ఆత్మయు నగుచున్నది. ఉపనిషత్తులలో అది పరమాత్మగా ప్రశంసింపఁబడినది. భూర్భువస్సువర్లోకములను మూఁడింటిని తన బలశక్తిచే వ్యాపించి, కేవలము తన యునికి చేతనే వానిని భరించుచున్న నిత్య సర్వజ్ఞుఁడు, పరమేశ్వరుఁడు నైన నారాయణుఁడే ఆ పరమాత్మ.

భగవంతుఁడింకను ఇట్లు చెప్పుచున్నాఁడు :

శ్లో. యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥
( గీత. 15-18 )

"క్షరమునకు అతీతుఁడనై అక్షరము కన్నను ఉత్తముఁడ నగుటచే లోకమున వేదమునందును నేను పురుషోత్తముఁడనుగా ప్రసిద్ధుఁడనై యున్నాను."

క్షరము కన్నను, అక్షరము కన్నను పరమాత్మ అతీతమనుట స్పష్టము. కావున అది పురుషోత్తముఁడుగా వర్ణింపఁబడినది.

అవిద్య కలవాఁడు జీవాత్మ. అవిద్య ఎక్కడనుండియో రాలేదు. "నేనెవఁడను" అనునది తెలియకుండుట యథార్థము. ఇదియే అవిద్య. దీనికి మొదలు లేదు. కనుక అవిద్య అనాది యన్నమాట. సాధన చతుష్టయ సంపత్తి కలిగినప్పుడు ఈ అవిద్య తొలఁగు చున్నది. సాధన చతుష్టయ సంపత్తిని సంపాదింప వలయు నన్నచో సదాచారము, సత్ప్రవర్తనము, సత్సాంగత్యము, సద్గ్రంథపఠనము, సచ్ఛీలము, శ్రద్ధతో విడువకుండ ప్రయత్నించుట, ప్రాపంచిక విషయముల యెడ ఉదాసీనత, దుష్ట సంసర్గమును పరిహరించుట మొదలగునవి ఉండవలయును. వేద వేదాంత శాస్త్రములలో, బ్రహ్మవిద్యలో పరినిష్ఠితుఁడైన సద్గురువు లభించుట అన్నింటి కన్నను మించిన భాగ్యవిశేషము. కావున మోక్షమును కోరువాఁడు "ఆత్మను తెలిసికొని సాక్షాత్కరించుకొనవలయును" అను గాఢమైన కాంక్షతో, శ్రద్ధతో తనకు ఆత్మ, పరమాత్మ, జగత్తు అను వానిని గూర్చి బోధించి జ్ఞానము నుపదేశింపఁగల సద్గురువును అన్వేషింపవలయును.

## నారాయణ స్మృతులతో

(ప్రాణవృత్తికి, అహస్సునకు అభిమాని యైన దేవత) మిత్రుఁడు మాకు సుఖము (సుఖకరుఁడు) అగునుగాక! (అపానవృత్తికి, రాత్రికి అభిమానియైన దేవత) వరుణుఁడు మాకు సుఖము (సుఖకరుఁడు) అగును గాక! (చక్షురింద్రియమునకు, ఆదిత్యమండలమునకు అభిమానియైన దేవత) అర్యముఁడు మాకు సుఖము (సుఖకరుఁడు) అగునుగాక! (బలమునకు, బాహువులకు అభిమానియైన దేవత) ఇంద్రుఁడు, (వాక్కునకు, బుద్ధికి అభిమానియైన దేవత) బృహస్పతి మాకు సుఖము (సుఖకరులు) అగుదురు గాక! (పాదేంద్రియమునకు అభిమానియైన దేవత) ఉరుక్రముఁడు (జగద్వ్యాపకుఁడు) అయిన విష్ణువు మాకు సుఖము (సుఖకరుఁడు) అగును గాక! బ్రహ్మమవైన యో వాయుదేవా! నీకు నమస్కారము. నీవే ప్రత్యక్షమైన బ్రహ్మము. నిన్నే ప్రత్యక్షమైన బ్రహ్మమునుగా చెప్పుదును. ఋతమునుగా (శాస్త్రమునను సరించి బుద్ధియందు నిశ్చయింపఁబడిన కర్తవ్యమునుగా) చెప్పుదును. సత్యమునుగా (వాక్కుచేత, కాయముచేత వ్యవహరింపఁబడునట్టి ఋతమునుగా) చెప్పుదును. అది (సర్వాత్మకమైన యా వాయురూప బ్రహ్మము) నన్ను (బ్రహ్మవిద్యను అర్థించు శిష్యుని) రక్షించును గాక! అది వక్తను (బ్రహ్మవిద్యను బోధించు నాచార్యుని) రక్షించునుగాక! నన్ను రక్షించును గాక! వక్తను రక్షించును గాక!

ఆధ్యాత్మికములైన విఘ్నములు శాంతించును గాక! ఆధిభౌతికములైన విఘ్నములు శాంతించును గాక! ఆధిదైవికములైన విఘ్నములు శాంతించును గాక!

ఓమ్ తత్సత్

# స్వామివారికి లేఖలు

I

జగదీశ్ ప్రసాద్
అడ్వొకేట్

70, గాంధీ పార్కు
బెనారస్ సిటీ
1-6-'51

పూజ్యపాదులకు ప్రీతికలుగును గాక !

గౌరవ పురస్సరమైన చరణ స్పర్శము నకు పిమ్మట, తమకు లేఖలు వ్రాయఁజాల కుండినందులకు అత్యంతమైన సంతాపమును పొందుచుంటి నని విన్నవించుకొనుచున్నాను. కుటుంబ విషయమున, వృత్తి విషయమున పలువిధములైన వ్యవహారముల వలన నైసందిన కార్యములకు తప్ప ఇతరమునకు అవకాశమే లేకుండ పోయినది.

1951 జూలై 18 నుండి రెండు నెలలు తమరు వారణాసియందు ఉండఁదలఁచు కొన్నారని తెలిసి మిగుల సంతోషించితిని. నా సుకృతము వలననే తమకు అట్టి యభి ప్రాయము కలిగిన దని నా జన్మరాశి నక్ష త్రములకు ధన్యవాదములు చెప్పకొను చున్నాను. ఎందువల్లననఁగా నాకు తమతో వ్యక్తిగతమైన సంబంధమునకు అవకాశములు పుష్కలముగా కలిగి, తమయొక్క బోధల చేత నేను జనన మరణ రూపమైన యీ సంసారచక్రము నుండి తప్పక ముక్తుఁడను కాఁగలను. తమరు క్రిందటి సంవత్సరము బసచేసిన తావుననే ఉందురని ఆశించు చున్నాను. తమరు ఎప్పుడు ఇక్కడికి చేరుదురో ఆ సమయమును స్పష్టముగ తెలిపినచో నేను కృతజ్ఞుఁడనై యుందును.

తాత్కాలికములైన యీ ప్రపంచ వ్యవ హారములనుండి, విధివశమున, నేను అధిక కాలమును వినియోగింపఁలేని వాఁడనై యున్నాను. సాధ్యమైనంతవఱకు తఱచుగా తమ దర్శనము కావించుకొనుటకు ప్రయ త్నింతును. తమ వారణాసి యాత్రను నేను హృదయపూర్వకముగా అభిలషించు చున్నాను. "ఇది కాదు" అని నిషేధ రూపమున విచారించు పద్ధతిలో, ముక్తిని కోరుచున్న "నేనే" నన్ను నాశమొందించు కొందునేమో అన్న విషయము ఖేదమును కలిగించుచున్నది. జాగ్రత్ప్రపంచమునఁ గాని, స్వప్నసీమలోఁగాని ఇంద్రియములచే గ్రహిం పఁబడుచున్న ప్రతిపదార్థమును నిరాకరిం చుచు తుదకు "నేను" అన్నది మిగులుచునే యున్నది. "ఇది కాదు; ఇది కాదు" అని ఎంతకాలము ప్రతిపదార్థమును తొలఁగించు చున్నను, ఈ "నేను" అన్నది మిగిలి యున్నంతవఱకు, ఇది తనకు సంబంధించిన "నాది" అను భావమును సృష్టించుచునే యుండును. మొట్టమొదట ఏ "నేను" యొక్క సుఖము కొఱకై మనము ఎల్లకాలము ప్రయత్నించుచున్నామో అట్టి "నేను" నాశ మొంద వలయునని ఎవరును కోరరు. ఈ యంశముపై స్వామివారి సూచనలను గ్రహింపవలయునని కోరుచున్నాను.

ఈ లోకమునను, పరలోకమునను నాకు సుగతిని కలిగించునట్టి తమ యాశీస్సులను నాపై కురిపింతురు గాక !

ప్రణామములతో, తమ విధేయుఁడు
(సం) జగదీశ్ ప్రసాద్

జగదీశ్ ప్రసాద్
అడ్వొకేట్

విక్టోరియా పార్కు
వారణాసి
27 ఆగస్టు, 1952

పూజ్యపాదులకు ప్రీతి కలుగును గాక !

తమతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపఁజాలనందులకు వేయిసార్లు క్షమా భిక్షను ప్రార్థింపవలసి యున్నది. ఇందులకు కారణములు అనేకములు. కుటుంబమునకు, వృత్తికిని సంబంధించిన చిక్కులు ఎప్పుడును ప్రతి యుద్యోగమునందును కన్పించుచునే యుండును. దోష మంతయు నాదే యని స్వీకరించుచు దయఁజూపుఁడని ప్రార్థించు చున్నాను. మీరు నన్ను క్షమింతురని దృఢముగా విశ్వసించుచున్నాను. మీ మహనీయతయే మిమ్ము ప్రోత్సహించి నన్ను క్షమింపఁజేయును. నేను మీకు వ్రాయ కున్నను, చాల విలువగల మీ బోధలు నిరంతరము నా చెవులయందు మ్రోగుచునే యున్నవి. "నేను ఇది కాదు" ఇంద్రియ గోచరమైన దంతయు తెలిసికొనువాఁడు తెలిసిన దాని కన్న భిన్నుఁడు. చేయువాఁడు చేయఁబడుచున్న దాని కన్న భిన్నుఁడు. అన్నింటికిని నేను కర్తను ; తెలియఁబడు చున్న సకలమును తెలిసికొనుచున్న వాఁడను నేనే. నిషేధ పద్ధతి వలన మనము తుదకు ఏదియు తెలిసికోవలసిన యక్కఱ గాని, ఏదియు చేయవలసిన యక్కఱ గాని లేని స్థితికి తఱుమఁబడుచున్నాము. తెలిసికొను వాఁడు, తెలిసికొనఁబడినది, తెలిసికొనుట అను వ్యాపారము కూడ పూర్తిగా అదృశ్య మగుచున్నది. అది ఆత్మ. అచ్చట "నేను ఉన్నాను" అంతకు ఏమియు అన్యము కాదు. నేను ఆ ఆత్మనైనందులకు గర్వింపవలసి యున్నది. మఱియును రక్త మాంస మయమైన యీ శరీరమును గూర్చి ఆలోచించుట మానుకోవలసి యున్నది. తమ పాదములచెంత నేను నేర్చుకొన్నది యిది. ఈ మర్త్య శరీరమును గూర్చి ఇంతకుముందు ఎట్లు తలంచుచుంటినో అంత దృఢముగా 'నేను ఆత్మను' అని ఎల్లప్పుడు ఎడ తెగకుండ భావించునట్లు ఆశీర్వదింపుఁడని ప్రార్థించు చున్నాను.

కోరఁదగినది, అభ్యసింప దగినది అంతయు నిదియే. ఇది అభ్యసింపఁ బడినపుడు తోచుచున్న ప్రపంచ మంతయు నా సొంత సృష్టివలెనే కన్పించును. ఎండమావివలె అయథార్థముగా, తాత్కాలికమైనదిగా, స్వభావముచేత కేవలము నిరపాయమైనదిగా గోచరించుచు, సకలరూపములలో వ్యాపించి రూపరహితమై యున్న యఖండమైన యాత్మను సదా స్మరింపఁజేయుచుండును.

"బ్రహ్మ సత్యమ్ జగన్మిథ్యా" అను శ్రుతి వాక్యము ఇట్లే వివరించు చున్నది. ఇందే యథార్థమున సుఖ మున్నది. ఇది ఎప్పటికిని నశింపదు. ఇది లభించిన పిమ్మట ఇంక పురల సుఖము కొఱకు కోర్కెయే కలుగదు. ఆ సుఖము, ఆనందము నాది. లేక ఆ యానందమే నేను అను విషయమును నేను ఎప్పటికిని మఱచిపోకుండునట్లు తమరు ఆశీర్వదింతురుగాక ! ఈవిషయమున ఇంకను తమ రొసంగు నుపదేశముల కొఱకై చాల ఉత్సుకత్వముతో తమపాదముల చెంత శారీరకముగా కాకున్నను మానసికముగా వేచియున్నాను.

భవద్విధేయుఁడు
(సం) జగదీశ్ ప్రసాద్

తా. క. : చిరకాలముగానున్న మూల వ్యాధితో బాధపడుచున్న మా బావమఱంది తమ యాశీస్సులచే వెనుకటి కన్న స్వాస్థ్యమును పొందియున్నాఁడు.

*

కుర్తాలము
1-9-1952

## శ్రీ స్వామివారి సమాధానము

ప్రియమైన జగదీశ్ ప్రసాద్ గారూ,

మీరు ఆగస్టు 27-వ తేదీ వ్రాసిన యుత్తరమును చూచి చాల సంతోషించితిని. ఉత్తరములో మీరు వ్యక్త మొనర్చిన భావములకు నేను నిజముగా ఆనందించితిని. ఉత్తర ప్రత్యుత్తరములలో కూడ మనము "జీవితమును" చూచుచుందు మనుట యథార్థ విషయమే. కావున పరస్పరము అభిప్రాయములు తెలుపుకొనుచుండుట మంచిదే. ఇది మనకు ఉత్సాహమును కలిగించును.

ఎట్లైనను భావములు మానసికములే. అవి యథార్థము కావని మన మందుము. భావము లన్నియు బాహిరము లైన పదార్థములకు ప్రతినిధులు. పదార్థములు యథార్థములని వానికి ప్రతినిధులైన భావములు కేవలము మానసికములే కాని యథార్థములు కావని మనము నమ్ముచున్నాము. భావములను గూర్చి, పదార్థములను గూర్చి వివరముగా నేను చర్చింపఁగోరుటలేదు. కాని సత్యము అసత్యము ; మంచిది చెడ్డది ; వెలుఁగు చీఁకటి ; తండ్రి కుమారుఁడు మొదలుగా ఇవి యన్నియు తారతమ్యాత్మికము లైన పదములు అన్న విషయమును మీ దృష్టికి తీసికొనిరాఁ గోరుచున్నాను.

ఇప్పు డీ యుత్తరము వ్రాయుచున్నవాఁ డెవఁడు ? "నేను ఈ ఉత్తరము వ్రాయుచున్నాను" అని నేను చెప్పవలె. ఈ "నేను" ఎవరు ? "నేను" అనునది స్వామి వారు మొదలైన భావములకు ప్రతినిధి. నేను ఎవరికి ఈ ఉత్తరము వ్రాయుచున్నాను ? జగదీశ్ ప్రసాదుగారికి అన్నది సమాధానము. ఇది యంతయు మన జ్ఞానము. ఈ జ్ఞానము ఎల్లప్పుడును తెలిసికొనఁబడిన పదార్థముల మీఁదను, తెలిసికొనుచున్నవాని మీఁదను ఆధారపడి యుండును. ఇప్పుడు మనకు జ్ఞాత (తెలిసికొనువాఁడు), జ్ఞాతము (తెలిసికొనఁబడినది), జ్ఞానము ఏర్పడినవి. ఈ మూఁడును సత్యము లని కూడ మనకు తెలియును.

"నీవు సింహము నెఱుఁగుదువా" అని ఎవఁడైన నిన్ను ప్రశ్నించె ననుకొనుము. సమాధానము "ఔను." అనఁగా నీకు సింహమును గూర్చి తెలియు నన్నమాట. సింహము యొక్క చిత్రమో లేక దాని నకలో నీ మనస్సులో నున్న దన్నమాట. సింహమునకు బదులుగా ఆవు యొక్క చిత్రము నీ మనస్సునందు రూపొందినచో, అది సరియైన జ్ఞానమని చెప్పుటకు వీలులేదు. ఇట్టిది ఏదైన నిజముగా సంభవించినచో, అట్టి యనుభవము కలవాఁడు పిచ్చివాఁడుగా భావింపఁబడును. కాఁబట్టి జ్ఞానమునందు అసలు పదార్థము యొక్క యథార్థమైన నకలు ఉండును. ఇచ్చట అసలు పదార్థము

సత్యమని, నకలు అసత్యమని చెప్పు చున్నాము. కాని నకలు ఎల్లప్పుడు అసలు పదార్థమునకు ప్రతినిధిగానే యున్నది. అయినప్పటికిని దానికి అసలు కన్న భిన్నముగా స్వతంత్రమైన యస్తిత్వము లేదు. కావున మన మనస్సులో నున్న సింహము యొక్క నకలు వెలుపల నున్న సింహము యొక్క జ్ఞానముగా చెప్పఁబడుచున్నది. మన చర్చకు యథార్థముగా ఒక సింహము మన యెదుట నుండ నక్కఱలేదు. సింహమును గూర్చిన జ్ఞానము అనఁగా దాని యొక్క నకలు మన మనస్సులో ఉండినఁ జాలును.

ఈ నకలు సింహమునకు ప్రతినిధి యైనప్పటికిని, ఇది యథార్థమైన సింహమునకు భిన్నమే. బహిరంగ పదార్థములో సంబంధము కలిగినప్పుడు మనస్సు సింహము యొక్క రూపమును గాని, నకలును గాని పొందుచున్నదని చెప్పవలసి యున్నది. మనము జ్ఞాతమైన పదార్థమును గూర్చి, దాని వలన కలుగు జ్ఞానమును గూర్చి కొంత చర్చించితిమి.

జ్ఞాతను గూర్చి మఱికొంత తెలిసికొందము. ఈ తెలిసికొనుచున్నవాఁ డెవఁడు? ఒక పదార్థమును గూర్చి తెలిసికొనుచున్నవాఁడే వీఁడు. కావున తెలిసికొనఁబడిన పదార్థము కన్న తెలిసికొనుచున్న వాఁడు భిన్నుఁడు. జ్ఞానము కన్న జ్ఞాత భిన్నుఁడని, ఆ జ్ఞాతయును తెలిసికొనఁబడుచున్న పదార్థమునకు సంబంధించియే యుండునని అంగీకరించుటకు మనము తటపటాయించ వచ్చును.

ప్రశ్న : జ్ఞాత ఎవఁడు?

సమాధానము : నేను జ్ఞాతను.

ప్రశ్న : నీవు ఏ విషయమున జ్ఞాతవు?

సమా : నేను సింహ విషయమున జ్ఞాతను.

సరియే. జ్ఞాత, జ్ఞాతము, జ్ఞానము అనునవి సంబంధాత్మకము లని, ఒకదానిపై నొకటి యాధారపడి యుండునని గుర్తింపుము.

ఇప్పుడు నీవు, "నేను జ్ఞాతనా" అని ప్రశ్న వేయవలసి యున్నది. కాకున్నచో "నే నెవఁడను? నేను జ్ఞాతనుగా ఎప్పుడైనాను?" సింహము అను పదార్థమును ఎప్పుడు తెలిసికొన్నానో అప్పుడు జ్ఞాత నైతి నని సమాధానము. సింహమునుగూర్చి జ్ఞాతవు కాక పూర్వము నీవు లేవా?

సమా : సింహము యొక్క జ్ఞానము కలుగుటకు ముందు కూడ నేను తప్పక ఉన్నాను.

ప్రశ్న : అప్పుడు నీవు జ్ఞాతవా?

తెలియనివాఁడు, "ఔను, నేను జ్ఞాతను" అని సమాధానము చెప్పును. కాని ఈ విషయమున లోఁతుకు పోగలిన వాఁడు "నేను జ్ఞాతను కాను" అని సమాధానము చెప్పును.

ఇంతసేపు నీవు జ్ఞాత వను నభిప్రాయముతోనే యుండుటచే సమాధాన మెప్పుడును నిషేధాత్మకముగా (Negative) ఉండును. విచారించిన తరువాతనే నీవు జ్ఞాతవు కావని తెలిసికొంటివి.

"నేను జ్ఞాతను కాకున్నచో, నే నెవరు?" అను నీ విధమైన ప్రశ్న యొకటి కలుగ వచ్చును.

వెనుకటి సమాధానము వంటిదే నీవు చెప్పఁదలచుకొన్నచో — నీవు ఇప్పుడు ప్రశ్న వేయుచున్నావు కావున, "నేను ప్రశ్నించుచున్న వాఁడను" అని నీవు చెప్ప వలసి యుండును. అప్పుడు "నే నెవరు?"

మఱియొక యుదాహరణమును గైకొని నేను జ్ఞాతను అగుదునో కాదో గ్రహించుటకు ప్రయత్నింతము.

ఇప్పు డీ ఉత్తరమును వ్రాయుచున్న దెవరు?

నే నిప్పు డీ యుత్తరమును వ్రాయుచున్నాను.

అయినచో నే నెవరు?

నేను లేఖకుఁడను.

కావున నేను నా వ్రాఁతలో తాదాత్మ్యమును పొంది, "నేను లేఖకుఁడను" అని చెప్పుచున్నాను. ఈ నేను, లేఖకుఁడు ఒక్కరేనా అన్నది ప్రశ్న. వీరిద్దఱు ఒక్కరే అని తోఁచును.

నిజమునకు "నేను" లేఖకుఁడను కాదు. అనఁగా వ్రాఁతకు ముందు నే నున్నాను, వ్రాఁత ఆగిపోయిన తరువాత కూడ నేను ఉందును; వ్రాయుచున్నప్పుడును ఉన్నాను; కావున "నేను" లేఖకుఁడను కాదు. వ్రాఁత ఆగిపోయినప్పుడు లేఖకుఁడు అదృశ్యుఁడగును. కాని నేను లేఖకునితోఁబాటు అదృశ్యమగుట లేదు. కావున, లేఖకునితో, జ్ఞాతతో సంబంధము లేకుండ నేను ఎప్పుడును స్వతంత్రముగా నున్నాను.

కావున జ్ఞాత, జ్ఞానము (పదార్థరూపము యొక్క నకలు) రెండును మానసికములే, అయథార్థములే. ఈ మూఁడింటికన్న భిన్నముగా "నేను" అన్నది ఉన్నప్పుడే జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అను మూఁడింటియొక్క సంయోగము ఏర్పడును. కావున, "నేను జ్ఞాతను కాదు", "నేను లేఖకుఁడను కాదు" అనుటయే సరియైన సమాధానము.

అయినచో నీ వెవరు?

సమా: "నేను నేనే" (అహ మేవాహమ్)

ఇట్లు చెప్పినప్పుడు నేను వాక్యమును చెప్పుచున్నవాఁడ నగుదును. ఈ చిక్కును తప్పించుకొనుటకు, పని చేయుచున్నప్పుడు తటస్థించునట్టి ప్రతిభావముతో అసత్యమైన తాదాత్మ్యమును నివారించుకొనుటకు "నేను జ్ఞాతను కాని లేఖకుఁడను కాని కాదు" అని ఎల్లప్పుడు చెప్పుచుండుటయే మేలు.

మీ లేఖలో మీరు ఈ క్రింది వాక్యములను వ్రాసితిరి.

"నేను మీకు ఉత్తరము వ్రాయుచుండినను, నేను ఇది కాదు" అని మీరు గావించిన యుపదేశములు, చాల విలువ గలవి. నా చెవులలో నిరంతరము మ్రోఁగుచునే యున్నవి. ఇది యంతయు ఇంద్రియములకు గ్రాహ్యమే. జ్ఞాత తాను తెలిసికొన్న పదార్థము కన్న భిన్నుఁడు. చేయఁబడుచున్న వస్తువుకన్న చేయువాఁడు భిన్నుఁడు. అన్నింటికిని నేను కర్తను; తెలియఁబడుచున్న సకలమును తెలిసికొనుచున్నవాఁడను నేనే. నిషేధవిధానమువలన మనము తుదకు ఏదియు తెలిసికోవలసిన యక్కఱ అగాని, ఏదియు చేయవలసిన యక్కఱగాని లేని స్థితికి తరుమఁబడుచున్నాము. తెలిసికొనువాఁడు, తెలిసికొనఁబడినది, తెలిసికొనుట అను వ్యాపారము కూడా పూర్తిగా అదృశ్యమగుచున్నవి. అది ఆత్మ. అచ్చట "నేను ఉన్నాను. అంతకు ఏమియు అన్యము కాదు. నేను ఆత్మనై నందులకుగర్వింపవలసి యున్నది. మఱియును రక్తమాంసమయమైన యీ శరీరమును గూర్చి ఆలోచించుట మానుకోవలసి యున్నది. తమ పాదముల చెంత నేను నేర్చుకొన్నది యిది. ఈ మర్త్య

శరీరమును గూర్చి ఇంతకు ముందు ఎట్లు తలంచుచుంటినో అంత దృఢముగా నేను ఆ ఆత్మను అని ఎల్లప్పుడు ఎడతెగకుండ భావించునట్లు ఆశీర్వదింపుఁడని ప్రార్థించుచున్నాను. కోరఁదగినది, అభ్యసింపఁదగినది అంతయు నిదియే. ఇది అభ్యసింపఁబడినప్పుడు తోఁచుచున్న ప్రపంచ మంతయు నా సొంత సృష్టివలెనే కన్పించును. ఎండమావివలె అయథార్థముగా, తాత్కాలికమైనదిగా, స్వభావముచేత నిరపాయమైనదిగా గోచరించుచు సకలరూపములలో వ్యాపించి రూపరహితమై యున్న యఖండమైన యాత్మను సదా స్మరింపఁజేయుచుండును."

పై పేరాలోని యొక్కొక్క వాక్యమును గైకొని మీ యభిప్రాయములలోని ప్రామాణ్యమును పరిశీలింతము.

"విలువగల మీ యుపదేశములు" అని మీ లేఖలో మీరు చెప్పితిరి. "ఉపదేశములు" అన్నది బహువచనము, కాని మీరు ఉపదేశములను గూర్చి పేర్కొన్నప్పుడు, "నేను ఇది కాదు" అను నొక్క యుపదేశమును మాత్రమే వ్రాసితిరి. నేను మీకు చెప్పినవి రెండు ఉపదేశములు. "నేను ఇది కాదు", "నేను ఇది కాదు." మీ నివాసమునందు నే నున్న కొద్దిసేపటిలో మన యిరువురకును మధ్య జరిగినదానిని మాత్రమే నేను మీకు జ్ఞప్తికి తెచ్చుచున్నాను. కావున ఎల్లప్పుడు రెండుసార్లు నిషేధింపవలెనని గుర్తుంచుకొనుఁడు.

జ్ఞాత జ్ఞాతముకన్న భిన్నుఁడనుట నిజమే. పైన జరిగిన చర్చదృష్టితో మిమ్ము మీరు జ్ఞాతగా చెప్పుకొనఁగలరా? చెప్పుకొన లేరనుట నిశ్చయము. పదార్థమునకును, దాని వలన కలిగిన జ్ఞానమునకును సంబంధించి మీరు "జ్ఞాత" అయినారు. ఈ జ్ఞానము కలుగుటకు పూర్వము మీరు లేరా? జ్ఞాతము కన్న జ్ఞాత భిన్నుఁడు అని మీరు ప్రకటించుచు, వెంటనే మీకు తెలియకుండఁగనే జ్ఞాతతో తాదాత్మ్యమును పొంది, "నేను జ్ఞాతను" అని చెప్పుచున్నారు. దానివలన మీరు సుఖము నొందుచు, మరల ఆ సుఖముతో తాదాత్మ్యమును పొందుచున్నారు.

దేనితోనో ఒకదానితో ఎప్పుడును తాదాత్మ్యమును పొందుచుండుట అను విషవలయముననే మీరు తిరుగుచున్నారు. జ్ఞాత, జ్ఞాతము, జ్ఞానము అనువానికి భిన్నముగా మీరు ఎప్పుడును స్వతంత్రముగా నున్నారు అను విషయమును విస్మరించుచున్నారు. ఒకానొక చర్య వలననే "మీరు" (అనఁగా ఆత్మమైన నేను) జ్ఞాతగా గుర్తింపఁబడుచున్నారు. మీరు ఆలోచించుట మానుకొన్నచో ఇంక "జ్ఞాత"గా నుండరు. మీకు ఇంద్రియములున్నవి. కాని మీరు ఇంద్రియములు కాదు. మీరు ఇంద్రియముల కన్న భిన్నులు. ద్రష్టచేత (చూచువానిచేత) ఇంద్రియములు కూడ చూడఁబడుచున్నవి. అయినప్పటికిని మీరు "ద్రష్ట" కాదు. నేను ద్రష్టను అని మీరు చెప్పినచో, ఆ ద్రష్టతో తాదాత్మ్యమును పొందుచున్నారని యర్థము. ఈ చూచుట ఆగిపోయినచో ద్రష్టయు నుండఁడు. ఇంతకును మీరు చేయుచున్న చూచుట అను చర్య నుద్దేశించి మీకు ఒసంగఁబడిన యొక పేరే 'ద్రష్ట' అను పదము. యథార్థమైన మీ యునికి వలననే చూచుట యను కార్యక్రమ మంతయు జరుగుచున్నదని, ఎల్లప్పుడు మీరు స్మరించు

చుండుఁడు. కావున మీరు జ్ఞాత కాని, ద్రష్ట కాని, కర్త కాని కాదన్నమాట. కాఁబట్టి మిమ్ము గూర్చి మీరు తెలిసికోవలయు నన్నచో, "నేను ఇది", "నేను అది", "నేను ఆనందము" అని ఎప్పుడును తలంప రాదు. మొట్టమొదట మీరు (అనాదియైన) అసత్యమైన తాదాత్మ్యమును తొలఁగించుకొన వలయును. అప్పుడు మీరు ఎవరో మీకు తెలియఁ గలదు. ఏ క్షణమున మీరు అసత్యమైన తాదాత్మ్యమును తొలఁగించుకొందురో, ఆ క్షణముననే మీకు యథార్థమైన యాత్మజ్ఞానము కలుగును. అసత్యమైన తాదాత్మ్యమును తొలఁగించుకొనుటయే యథార్థమైన యాత్మజ్ఞానము పొందుట. ఉదాహరణమునకు, మీ రొక త్రాడును సర్పమునుగా చూచితి రనుకొనుఁడు. పరిశీలించిన పిమ్మట దానిని మీరు త్రాఁడుగా కనుఁగొంటిరి. మీరు త్రాఁడును చూచి నంతనే దానిపై ఆరోపింపఁబడిన సర్పము అదృశ్యమైనది.

మీరు ఉన్నారు. జ్ఞాత యొక్క గుణములు మీపై ఆరోపించుకొని నేను "జ్ఞాత" ను అని చెప్పుకొనుచున్నారు.

కాఁబట్టి తన్ను తాను తెలిసికొనుటకు ప్రత్యేకముగా చేయవలసిన దేమియు లేదు. "ఇది కాదు", "ఇది కాదు" అని చెప్పుచు ద్వైతముతోనున్న యసత్యమైన తాదాత్మ్యమును తొలఁగించుకొనుటయే చేయవలసిన పని.

"నిషేధ విధానము వలన, ఏమియు తెలిసికొన నక్కఱలేని, ఏమియు చేయ నక్కఱలేని స్థితికి తఱుమఁబడు చున్నాము" అని మీరు ఉత్తరములో వ్రాసితిరి.

నిషేధ విధానమును ఆరంభించుటకు ముందు, "నేను ఈ జ్ఞాతను", "నేను ఈ కర్తను", "బహువిధములైన యాస్తులు కలిగియున్న జగదీష్ ప్రసాదును", "నేను న్యాయవాదిని" అని యీ విధముగా ఆలోచించుచుంటిరి. నిషేధ విధానమువలన, ఇంద్రియములకు గోచరము లగుచున్న పదార్థము లన్నింటితో నున్న అసత్యమైన తాదాత్మ్యమును తొలఁగించుకొనఁ గలుగుచున్నారు. ఇంతకు పూర్వము మీరు "నేను జన్మించితిని; నేను బలవత్తరుఁడనో లేక బలహీనుఁడనో అగుచున్నాను; నేను చని పోవుదును" అను నభిప్రాయముతో నున్నారు. కాని సత్సంస్కారములు మొద లగు వాని వలన మీరు ఇప్పుడు ఇంద్రియ జన్యములైన యనుభవములతోడి తాదాత్మ్యమును మాత్రమే తొలఁగించుకొనఁ గలుగుచున్నారు. "నేను ఇది కాదు", "నేను ఇది కాదు" అని చెప్పుచు అసత్యమైన తాదాత్మ్యమును తొలఁగించుకొను విధానమువలన ఏమియు తెలిసికొన నక్కఱ లేని, ఏమియు చేయనక్కఱలేని స్థితికి మీరు ఎన్నటికిని తఱుమఁబడరు.

"తఱుమఁబడుట", 'డ్రివెన్' అను నాంగ్లపదము చాల చెడ్డ యర్థము నిచ్చును. ప్రత్యేకముగా ఈ సందర్భమున ఆ మాటను మన మెప్పుడును వాడ కూడదు. ఈ నిషేధ విధానము వలన మీరు ఎక్కడ నుంటిరో అక్కడనే యుందురు. మీ స్థితి ఎంత స్థిర ముగా, దృఢముగా నుండు ననఁగా మీరు ఉన్న స్థితినుండి ఈశ్వరుఁడు కూడ మిమ్ము తఱిమివేయఁ జాలఁడు.

అంతేకాక సత్యమైన పరమాత్మయును తెలియును. ఏమియు తెలిసికొననక్కఱలేని,

ఏమియు చేయనక్కరలేని స్థితికి మీరు తఱిమివేయఁబడుదు రని మీరు చెప్పుచున్నారు. అది సరికాదు. నిషేధ విధానమువలన ఇంతకు పూర్వము మీరు ఏ స్థితియందున్నారో అక్కడనే యుందురు. మఱియు పరమాత్మనుకూడ తెలిసికొందురు. తెలిసికోవలసిన దేమియు లేదు అని తలంచుట తప్ప. ప్రతిదానిని నిషేధించు నంతస్తునకు చేరుకొన్నప్పుడు మీరు చాల జాగరూకతతో, చురుకుఁదనముతో "నీవు అది," "ఇది కాదు" అని తెలిసికొనవలయును. అక్కడ, మీ పరమాత్మ మనస్సునకు, వాక్కునకు అతీతమైనదని గుర్తింతురు, తెలిసికొందురు. ఇక్కడ ఇంచుమించుగా ప్రతి వ్యక్తియును, "బ్రహ్మము మనస్సునకు, వాక్కునకు అతీతమైనదో ఆ బ్రహ్మమును తెలిసికొనుట ఎట్లు సాధ్యమగును" అని ప్రశ్నించుచు పొరపాటు పడుచుండును.

నిషేధ విధానము వలన మాత్రమే బ్రహ్మము మనోవాక్కులకు అతీతమని మీరు తెలిసికొనఁ గలుగుచున్నారు. బ్రహ్మము మనస్సునకు, వాక్కునకు అందనిది అను విషయము నీకు తెలిసినది అనఁగా బ్రహ్మము మనోవాక్కులకు అతీతము అన్న విషయమును నీవు తెలిసికొనఁగలిగి యున్నావన్న మాట.

బ్రహ్మమునకు (పరమాత్మకు) సంబంధించినంత వఱకు తెలిసికొనవలసినది ఏదియు లేదు. బ్రహ్మము యొక్క స్వరూపము బ్రహ్మమే. దానికి రెండవది లేదు. ( అద్వితీయము ) ఈ విషయమును మీరు తెలిసికొనవచ్చును. అనఁగా బ్రహ్మము మనోవాక్కులకు అతీతమైనది అన్న విషయమును మీరు తెలిసికొనఁగలుగు చున్నారన్న మాట. కాని, ఆ జ్ఞాన స్థితితో మరల మీరు తాదాత్మ్యమును పొందరాదు ; "నేను బ్రహ్మమును" అని చెప్పరాదు. "నేను జగదీశ్ ప్రసాదును" అని చెప్పుటలోని జ్ఞానము ఎట్టిదో ఈ జ్ఞానము కూడ అట్టిదే. కావున మనస్సునకు, వాక్కునకు అతీతమైన పరమాత్మను తెలిసికొనుట అసాధ్యము కాదు.

మనస్సు యొక్క, వాక్కు యొక్క అస్థిత్వము కూడ పరమాత్మ వలననే కలుగుచున్నది. కాఁబట్టి మనోవాక్కులకు అతీతమైన పరమాత్మను తెలిసికొనుట సాధ్యమే.

"జ్ఞాత, జ్ఞాతము, తెలిసికొనుట అను చర్య కూడ పూర్తిగా అదృశ్యమగును" అని మీరు ఉత్తరములో వ్రాసితిరి.

ఈ మూఁడును పూర్తిగా అదృశ్యమగు ననుట నిజమే. కాని ఆత్మ లేక పరమాత్మ మైన మీరు ఎల్లప్పుడును అదృశ్యము కారు. ఆత్మ స్వయంప్రకాశము. అదియే అస్థిత్వము. అదే ప్రజ్ఞానము. అది యానందము. అది అద్వితీయము.

"నేను ఆ ఆత్మనైతినని గ్రహింపవలసి యున్నది ; మఱియు నేను ఈ రక్తమాంసమయమైన శరీరమని యనుకొనుట మానుకోవలసి యున్నది" అని మీరు వ్రాసితిరి.

మీరు మీరు గానే యున్నారు. కావున మీరు క్రొత్తగా పొందిన దేమియు లేదు. కాఁబట్టి మీరు దేనిని గూర్చియు గర్వపడరాదు. కాని అనాత్మతో మీ కున్న యసత్యమైన తాదాత్మ్యమును తొలఁగించుకొనఁ గలుగుచున్నారు. కావున మీరు చాల గర్వపడ వచ్చును. కాని మీరు నేర్చుకొన్న దానియొక్క ప్రాముఖ్యమును, మహత్త్వమును

తెలిసికొనకుండ ప్రాంత పద్ధతియందు పడిపోకుండునట్లు మీరు చాల జాగరూకత వహింప వలయును.

మీ రేమి నేర్చుకొంటిరి ? "నేను ఇది కాదు", "నేను ఇది కాదు" అని మాత్రమే మీరు నేర్చుకొంటిరి.

దీనిని గ్రహించుటచేత, రక్తమాంసములకు సంబంధించిన మీ యాలోచన పూర్తిగా నశించునని తలంపకుఁడు. రక్తమాంస మయమైన శరీరమును గలిగియున్నానను తలంపు ఉండనే యుండును. మీరు రక్తమాంసమయమైన యీ దేహముతో తాదాత్మ్యమును పొందకుండ వలెను. "నేను ఈ శరీరము", "నేను లావైతిని" అని యిట్లు చెప్పకుండ నుండవలె. మీరు ఈ శరీరములో నున్నంతవఱకు దీనిని గూర్చి అనుకోకుండ నుండలేరు. మీరు ఈ శరీరముతో తాదాత్మ్యము పొందుచున్నంత వఱకు మీకు సుఖ దుఃఖములు కలుగుచునే యుండును. అసలు సత్య మేమనఁగా, మీరు సుఖము కలిగినప్పుడు పొంగి పోరాదు. దుఃఖము కలిగినప్పుడు క్రుంగి పోరాదు. రెండింటిని సమానముగా చూడ వలయు నన్నపుడు, మీకు సుఖ దుఃఖములు కలుగవని యర్థముకాదు. మీరు సుఖ దుఃఖములలో నున్నప్పుడు, ఆ సుఖ దుఃఖములు మీరు కాదు అని గుర్తింపవలె. ఇట్లనుటచే మీరు ఏమియు కాదని యర్థము కాదు.

ఉత్తరములో మీరు ఇంకను ఇట్లు వ్రాసితిరి. "తమ పాదముల చెంత నేను నేర్చుకొన్నది యిది. ఈ మర్త్యశరీరమును గూర్చి ఇంతకుముందు ఎట్లు తలంచుచుంటినో అంత దృఢముగా నేను ఆ ఆత్మను అని ఎల్లప్పుడు ఎడతెగకుండ భావించునట్లు ఆశీర్వదింపుఁడని ప్రార్థించుచున్నాను. కోర్క దగినది అంతయు నిదియే."

ఇక్కడ మీరు కొంత నన్ను ప్రశంసించుచు వ్రాసితిరి. నేను అందులకు అర్హుఁడను గాను అని చెప్పుచున్నాను. నేను మీకు చెప్పుచున్న దానిలో నేదేని మంచి విషయ మున్నచో అది మా గురువుగారి యొక్క మహాప్రసాద మని దయచేసి గుర్తింపుఁడు.

"నేను ఆలోచించుచున్నాను. కాఁబట్టి నేనున్నాను" అని డెస్కార్టెస్ చెప్పినాఁడు. ఆలోచించుచున్న మనస్సు ఉన్నది కాఁబట్టి "నేను" అన్న యాత్మ ఉన్నదని నిరూపింప వచ్చునని అతఁడనెను. కాని ఇది సరికాదు. మొదట నీవు ఉండకపోయినచో ఎట్లు ఆలోచింపఁగలవు? ఆలోచించుటకు పూర్వమే నీవు ఉన్నావు. నీవు ఉన్నావు గనుక ఆలోచింపఁగలుగుచున్నావు. కావున నేను ఉన్నాను గనుక నేను ఆలోచింపవచ్చును, ఆలోచింపకుండ నుండవచ్చును" అని మనము చెప్పవలసి యున్నది. సత్య మిది. కాని సాధారణముగా ప్రతివ్యక్తియు, ఆలోచన లేనిచో ఆత్మయే యుండదని తలంచును. విశ్వసించును. ఆలోచింపకున్నచో ఎవ్వఁడును సుఖపడఁడు. తనకు సుఖముగా నుండు నొకా నొక పద్ధతిలోనే ఎల్లప్పుడు ఆలోచింప వలయునని ప్రతివ్యక్తియు తలంచుచుండుట పరిపాటియే. ఏకారణముచేతనైనను తన యిష్టము వచ్చినట్లు ఆలోచింప లేకపోయినచో, అతఁ డప్పుడు నిరాశ నొంది తన్ను తాను తిట్టుకొనును. ఈ కారణము చేతనే మీరు కూడ మర్త్యశరీరమును గూర్చి ఎట్టి యాలోచన లేకుండ, "నేను ఆత్మను" అని దృఢముగా ఎడతెగకుండ సదా భావించు

చుండవలయు నని కోరుచున్నారు. ఆత్మ ఎల్లప్పుడు శుద్ధము, సదానందము నైన యాత్మగానే యున్నదన్న విషయమును మీ రిక్కడ మరచుచున్నారు. ఆత్మ ఎప్పుడును వ్యక్తీకరణకు అతీతమైనది. కాఁబట్టి "నేను ఇదికాదు", "నేను ఇది కాదు" అని మీరు చెప్పుచుండవలయును.

మీరు మీ శరీరమును ద్వేషించుచుండుట శోచనీయము. మీకు తటస్థించుచున్న ప్రతిదానితో మీకు కలుగుచున్న అసత్యమైన తాదాత్మ్యమును ఈ మర్త్య శరీరము వలననే తొలఁగించుకొని ఆత్మను గ్రహింపఁ గలుగుచున్నారన్న విషయమును మీరు గుర్తించుటలేదు. ఈ మానవశరీరము వలననే మీరు ఆలోచింపఁ గలుగుచున్నారు. కాఁబట్టి ఈ యవకాశమును జారవిడచుకొనకుండ మీరు చక్కఁగా ఆలోచించుచు సత్యము గ్రహింపవలె. కావున మీరు, "నేను ఆత్మను" లేక "నేను బ్రహ్మమును" అని చెప్పరాదు. అట్లు తలంపరాదు. మీరు ఎప్పుడును "నేను ఇదికాదు", "నేను ఇదికాదు" అనియే అనుకొను చుండవలయును. ఈ విధముగాఁ గాని, ఆ విధముగాఁగాని, మఱి ఏ విధముగా నైనను మీ రెట్లు ఆలోచింతురో దానిని బట్టి మీ యునికి యుండును.

"ఆ ఆత్మను నేను" అని మీరు సంతతము ఆలోచింపఁ గలిగినచో మీరు సుఖము నొందుచు, పరమానందమును పొందినట్లుగా కూడ తలంచుచున్నారు. ఉదాహరణకు, విద్యుచ్ఛక్తి అను పదార్థము, "నేను విద్యుచ్ఛక్తిని" అని తలంపవలసిన పని లేదు. విద్యుచ్ఛక్తి ఎప్పుడును విద్యుచ్ఛక్తియే కదా!

మీ విషయమున, ద్వైతము యొక్క గుణములు అద్వయమైన పదార్థముపై ఆరోపింపఁబడినవి. అందువలన మీరు "నేను ఇది", "నేను అది" అని యీ విధముగా ఎల్లప్పుడు ఆలోచించుచున్నారు. జ్ఞానము చేతనే ఈ యారోపణమును తొలఁగింపవలసి యున్నది. ఇందులకు, 'ఇది కాదు', "ఇది కాదు" అన్నది యొక్కటే ఆయుధము.

"ఆ ఆత్మను నేను" అని మీరు తలంచుచున్నచో, ఆ యాలోచనా విధానముతో తాదాత్మ్యమును పొందుచు "నేను సుఖించుచున్నాను" అని మీరు భ్రమించుచుండ వచ్చును.

ఆత్మతో, అనుబద్ధమై యున్న నాత్మను తీసివేయుట మాత్రమే ఆవశ్యకమై యున్నది. ఆ యనాత్మ ఆ విద్యచే బ్రహ్మమునందు మిథ్యగా ఆరోపింపఁబడుచున్నది. దానిని జ్ఞానముచేతనే తొలఁగింపవలయును." ఆత్మ ఎప్పుడును స్వయం విదితము. ప్రతిదానిని దేనినైనను ఆలోచనచేత నిరాకరింపవచ్చును గాని, "ఆలోచించువానిని" ఎప్పుడును నిరాకరింపఁజాలవు. "అది నీవు" (తత్ త్వమ్ అసి) ఆత్మ చేరుకొనఁదగిన పదార్థము కాదు. ఆత్మ తొలఁగించుకొన వీలైనది కాదు. పొంద వీలైనదికాదు. మన శరీరముకన్నను ఆత్మ మనకు చాల సన్నిహితమైనది. కావున తన యాత్మను గూర్చి తాను తెలిసికొనుటకు బహిరంగమైన సాక్ష్యము అక్కఱలేదు.

బ్రహ్మము రూపరహితము. రూపములేని బ్రహ్మమును గ్రహించుట సాధ్యముకాదని మీరు తలంతురు. ఇది కూడ ఒక పొరపాటే. గుఱ్ఱమునకు ఒక రూప మున్నది. కావున

గుణ్ణమును గ్రహింపఁగలుగుచున్నానని మీరు తలంచుచున్నారు. మీరు గుణ్ణమును గ్రహించుచున్నప్పుడు, మీకు గుణ్ణమును గూర్చి జ్ఞానము కలుగుచున్నది. గుణ్ణము యొక్క నకలు మీ జ్ఞానమునందు రూపొందునని ఇంతకు పూర్వము ఆరంభముననే చెప్పియుంటిని. బ్రహ్మమునకు రూపము లేకపోవుటచే, పై విధముగా బ్రహ్మము యొక్క నకలు మీ జ్ఞానమునందు రూపొందుటకు వీలు లేదని మీరు తలంచుచున్నారు. ఇట్టి హేతువాదము సరి కాదు. ఉదాహరణకు, కోపమునకు రూపము లేదు. మఱి రూపములేని కోపము యొక్క జ్ఞానము మనకు కలుగుటలేదా? కాఁబట్టి రూప సహితములు, రూప రహితములు అయిన పదార్థములను గ్రహించు శక్తి మన మనస్సునకు ఉన్నదని మనము అంగీకరింపవలసి యున్నది. కావున రూపములేని బ్రహ్మమును మీరు గ్రహించినారన్నచో ఆశ్చర్యమేమియును లేదు. మన విషయమున గ్రహీత, గృహీతము, గ్రహణము అను మూఁడును ఒక్క బ్రహ్మమే. దీనిని మీరు స్వప్నమున గ్రహింపఁగలరు. కాఁబట్టి బ్రహ్మజ్ఞానమునకు సాధారణ జ్ఞానముతో ఎట్టి సామ్యము లేదు.

మీరు ఇంకను ఇట్లు వ్రాసితిరి. "కోరఁదగినది, అభ్యసింపఁదగినది అంతయు నదియే. ఇది అభ్యసింపఁబడినప్పుడు తోఁచుచున్న ప్రపంచ మంతయు నా సొంత సృష్టివలెనే కన్పించును. ఎండమావివలె అయథార్థమైనదిగా, తాత్కాలికమైనదిగా స్వభావము చేత కేవలము నిరపాయమైనదిగా గోచరించుచు, సకలరూపములలో వ్యాపించి రూపరహితమై యున్న యఖండమైన యాత్మను సదా స్మరింపఁజేయు చుండును."

మీరు పై పంక్తులను వ్రాయునపుడు మీకు జ్ఞాన నిష్ఠ కావలయు ననుట మీ యభిప్రాయ మని తలంచుచున్నాను. అద్వితీయమైన బ్రహ్మ మొక్కటే యున్నది. బ్రహ్మమునకు సంబంధించినంతవఱకు సృష్టియే లేదు. అవిద్యచేత సృష్టి యున్నదని మీరు తలంచితిరి. జ్ఞానముచేత సృష్టి యున్నది. దృశ్యమాత్రమేకాని, యథార్థము కాదని మీరు తెలిసికొనుచున్నారు. కాఁబట్టి ఆత్మయొక్క లేక బ్రహ్మముయొక్క జ్ఞానము కొఱకు మీరు ఎట్టి ప్రయత్నమునుగాని, యభ్యాసమునుగాని చేయవలసిన పని లేదు. అనాత్మను ఆత్మనుగా భావింపకుండ మనస్సును వారించుచుండుటయే ముఖ్యముగా మీరు చేయవలసి యున్నది. ఈ మార్గముననే మీకు జ్ఞానమున లేక జ్ఞాన నిష్ఠయందు భక్తి సంభవించును. జ్ఞానము కూడ లభ్య మగును.

ఇప్పుడీ యుత్తరము వ్రాయుచున్న దెవరు? "నేనీ యుత్తరమును వ్రాయుచున్నాను. నేను అనఁగా త్రివిక్రమరామానంద భారతీస్వామి. అప్పుడు నేను లేఖకుఁడనా అని ప్రశ్న ఉదయించును. వ్రాతకు సంబంధించి నేను లేఖకుఁడను అగుచున్నాను. నేను వ్రాఁత నాపినచో వ్రాయసకాఁడ నగుటయు ఆగిపోవును. కాబట్టి నేను వ్రాయసఁకాడను కాను అని చెప్పవలసి యున్నది. వ్రాయుచున్నప్పుడు కూడ నేను వ్రాయసకాఁడను కాను. ఇది తెలిసికోవలసి యున్నది."

మీరీ యుత్తరమును చదువునప్పుడు పఠితలగుచున్నారు. కాని మీరు పఠితలు కారు. నేను వ్రాయసకాఁడనుకాను అని చెప్పునప్పుడు, నేను ఉత్తరము వ్రాయుచుండుట లేదని యర్థముకాదు. నే నిప్పుడు ప్రత్యక్షముగా వ్రాయుచునే యున్నాను కదా!

ఇది చాల క్లిష్టమైన విషయ మనుట సత్యము. మనము తఱచుగా కలిసికొని సందేహములను బుద్ధికౌశలముతో, శ్రద్ధతో చర్చించుకొన వలయును.

1-6-1951 తేదీ మీరు నాకొక యుత్తరము వ్రాసితిరి. మీ యుత్తరములో ప్రస్తావింపఁబడిన సంశయములకు సమాధానము నొసంగుటకై దాని నిప్పటికిని దగ్గఱనే యుంచుకొనుచున్నాను. మీరు వెంటవెంటనే సమాధానములు వ్రాయకుండుటచే, చిక్కుపడినట్లుండు అంశములను గూర్చి చర్చించుచు, దీర్ఘములైన లేఖలను వ్రాయుటకు సంకోచించుచు వెనుకముం దాడుచుంటిని.

మీ యుత్తరములోని కొన్ని ముఖ్య వాక్యములను క్రింద వ్రాయుచున్నాను. నిషేధరూపమున 'ఇది కాదు' అని విచారించు పద్ధతిలో ముక్తిని కోరుచున్న 'నేనే' నన్ను నాశ మొందించుకొందునేమో అన్న విషయము ఖేదమును కలిగించు చున్నది. జాగ్రత్ప్రపంచమునగాని, స్వప్నసీమలోగాని ఇంద్రియములచే గ్రహింపబడుచున్న ప్రతి పదార్థమును నిరాకరించుచు తుదకు నేను అన్నది మిగులుచునే యున్నది. "ఇది కాదు" "ఇది కాదు", అని ఎంతకాలము ప్రతిపదార్థమును తొలఁగించుచున్నను, ఈ "నేను" అన్నది మిగిలి యున్నంత వఱకు ఇది తనకు సంబంధించిన 'నాది' అను భావమును సృష్టించుచునే యుండును. మొట్ట మొదట ఏ 'నేను' యొక్క సుఖము కొఱకై, మనము ఎల్లకాలము ప్రయత్నించు చున్నామో, అట్టి 'నేను' నాశ మొంద వలయునని ఎవరును కోరరు. ఈ యంశముపై స్వామివారి సూచనలను గ్రహింపవలయునని కోరుచున్నాను."

ఈ నిషేధ విధానమును గూర్చి వివరముగా పై పుటలలో మనము చర్చించితిమి. కావున నేను వారణాసిలో 1950 లో ఉన్నప్పుడు మీతో చెప్పియుండిన విషయమును అర్థము చేసికొనుటకు వెనుకటికన్న మేలైన స్థితి యందు వుందురని ఆశించుచున్నాను.

ఈ నిషేధ విధానము వలన మీ స్వరూపమైన యాత్మయే నశించునని మీరు భయపడుచున్నారు. అనుకొనకుండ, అకాలముగా "నేను" నశించునేమో యని మీరు ఖేదమును కూడ పొందుచున్నారు.

నిషేధ విధానము చేత "నేను" అన్నది నశించిన తరువాత మీకు ఖేదము కలుగుచున్నదా లేక "నేను" అన్నది నశింపక ముందు, అనఁగా నిషేధ విధానమును మీరు ఆరంభించుటకు ముందే, ఖేదము కలుగుచున్నదా అని నేను తెలియఁగోరుచున్నాను. ఏ పక్షమునందును మిథ్యయైన "నేను" కొఱకు మీరు ఖేదము నొంద నక్కఱలేదని చెప్పుచున్నాను.

"నేను" అన్నది నశించుటకు పూర్వమందు కూడ ఖేదము నొందుట నిరర్థకము. నిషేధ విధాన వశమున "నేను" అన్నది నశించినచో, ఖేదము నొందుటకు ఎవ్వరును ఉండరు. 'నేను' అన్నదాని యందు ఖేదము, వినాశము రెండును ఒక్కసమయమునసే సంభవించునని మీ రెట్లు ఊహించుచున్నారు? నిషేధ విధానమునందు 'నేను' అన్నది నశించునేమో అన్న భావము ప్రస్తుతము మీ ఖేదమునకు నిజమైన కారణమని సాధారణ మానవ స్వభావ పరిజ్ఞానమును బట్టి తేలుచున్నది. ఇంద్రియములతో, బహిరంగములైన విషయములతో

తాదాత్మ్యమును పొందుచున్న "నేను" అన్న విషయ మొక్కటి నశించు ననుట నిజమే. అవ్యయము, స్వయంప్రకాశము నైన "నేను" అన్న లక్ష్యము మాత్రము ఎప్పుడును నశింపదు. అది యథాతథము గానే యుండును.

జాగ్రత్ప్రపంచమున, స్వప్న ప్రపంచమున కూడ సమానమైన "నేను" అన్న దే ఉన్న దనుటయు యథార్థమే. గాఢనిద్రా స్థితిని గూర్చి మీ రేల మౌనము వహించు చున్నారు? గాఢనిద్ర యందు కూడ నిలిచి యుండు నట్టి అదే "నేను" ను గూర్చి మీ రే మనుకొను చున్నారు? ఆ "నేను" దేనినైన గుర్తించు చున్నాదా? ఈ నిషేధ విధానము జాగ్రద్దశయందే సంభవమని మీరు దయచేసి గుర్తింపుఁడు.

ఆ 'నేను' గాఢనిద్రలో నిలిచి యున్నదా? గాఢనిద్రలో మీకు ఏమియు తెలియ దనుట, అయినప్పటికిని మీరు సుఖముగా నున్నా రనుట యథార్థమే. గాఢనిద్రలో "నేను" ఉండు ననుటయు యథార్థమే. కావున గాఢ నిద్రలో ఉన్న 'నేను' "తనది" అన్న దానిని దేనివి సృష్టించుట లేదు అన్న విషయము నిశ్చితము. ఎందువల్ల ననఁగా "నేను" దేనిని సృష్టింపదు. ఆ "నేను" అన్న దానిని, మన కందఱకును పరిచితమై వ్యావహారిక మైన "నేను" గా చెప్పుట సమంజసము కాదు. గాఢనిద్రలో అద్వయ మైన "నేను" ఉండఁగా దేనికొఱ కైనను, ఎవనినైనను సంబోధింప నక్కఱలేదు. కావున పరమాత్మకన్న భిన్నముకాని 'నేను' ను గూర్చి ఆలోచింపవలసిన యక్కరయే లేదు.

ఈ "నేను" ను నశింపఁజేయవలయునని ఎవ్వఁడును కోరుట లేదనుటయు యథార్థమే. బహిరంగములైన విషయములవలన మీరు సుఖపడఁగోరుచున్నంతకాలము, ఆత్మ స్వరూపముకన్న భిన్నమైన దానిమీఁదనే ఎప్పుడును ఆధారపడియుండు ఈ "నేను" ను నశింపఁజేయుట ఉచితముకాదు. కాని, ఏ బహిరంగమైన విషయముపై ఎప్పుడును ఆధారపడని యా సుఖమే మీ స్వరూపమని తెలిసికొన్నప్పుడు, సాక్షాత్కరించుకొన్న ప్పుడు, "నేను" యొక్క వినాశమునకు ఆవశ్యకత ఏమున్నది? నాశకుఁడు లేకుండ ఏదియును నశింపఁ జేయఁబడఁజాలదు. ఏ వినాశమైన ఉన్నపక్షమున, ఆ నాశమునకు పిమ్మట నాశకుఁడు మిగిలియుండవలయును. ఏమైనను నాశకుఁడు, నాశనము అనునవి సంబంధ బోధకములైన పదములు. ఆత్మ అన్నింటికిని పైది.

పై చర్చవలన మీ సందేహములు తీఱిపోవునని ఆశించుచున్నాను.

మీ కుటుంబములోని సభ్యుల కందఱకు, శ్రీ కేశవప్రసాదుగారికి నారాయణ స్మృతు లతో మా యాశీస్సులను అందింపుఁడు.

నారాయణ స్మృతులతో

శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి

*

## ఇంగ్లీషు మూలములో లేని అనగా తెలుగు తర్జుమాలోకి రాని శ్రీ స్వాములవారు చేర్చిన, చెప్పిన మరికొన్ని అంశములు పొందుపర్చబడినవి.

పరతత్త్వము వలయములు తెలుపును. వలయము 1.

"ప్రజ్ఞానం బ్రహ్మ"
నిర్గుణబ్రహ్మ
బ్రహ్మము – అద్వితీయము బ్రహ్మము :
"నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూపము"
ఈ నాల్గు గుణములు బ్రహ్మస్వరూపము.
"అక్షర" "పరబ్రహ్మన్"
నిత్యము, అనభివ్యక్తము అయిన ఉనికి
ఇంద్రియములకు – అగ్రాహ్యము, అవినాశ్యము
బ్రహ్మమునకు – ఏవి శేషములు లేవు
సత్యము, జ్ఞానము, అనన్తము = "బ్రహ్మ"
"సదేవసౌమ్య ఇదమ్ అగ్ర ఆశీత్
ఏకమేవ అద్వితీయమ్."
—ఛాందోగ్యమ్

వలయము 2.

ఆది కారణమైన అవ్యక్తము + అవిద్య
అవ్యక్తము, అవ్యాకృతము, మాయ, అవిద్య
అనుపదములు - సమానార్థకములు లేక పర్యాయపదములు
జీవగణముల సృష్టికి - అవిద్యయే బీజము
శరీరములను పొందుచున్న జీవరాసులన్నిటికి
ఆ దైవాంశమే (Divine Being) ఉనికి
మాయ + ఈశ్వరుడు = హిరణ్యగర్భుడు = అండము
ప్రకృతిలోని పంచభూతములయొక్క-
సముదాయమువలన - బ్రహ్మాండము
ఏర్పడుచున్నది.

అవ్యక్తము (విస్తరించని) + అవిద్య = ప్రకృతి.
అవ్యక్తము లేక అవ్యాకృతము లేక మాయ అనునది ఈశ్వరునితో కూడియున్నట్లుగా
భాసించునప్పుడు హిరణ్యగర్భాఖ్యమైన యండము పంచభూతముల
కూడికగ రూపొందుచున్నది.
"అజ్ఞానము" అనునది ఎప్పుడు రాలేదు. అయితే "అజ్ఞానము" ఉన్నది.
అజ్ఞానమునకు మొదలు లేదు. అంతమున్నది.

3)

## మొదటి రెండు వలయములలో పొందుపర్చిన అంశములు బోధపడుటకు కొన్ని సూచనలు

మొదటి వలయములోని "అక్షరము", రెండవ వలయములోని "అవ్యక్తము" కన్న భిన్నము. విలక్షణము.

"అవ్యక్తము" "అక్షరము" కన్న అన్యము కాదు. అనగా అద్వితీయమైన యక్షరముకన్న అవ్యక్తమునకు ప్రత్యేకమైన యస్తిత్వము లేదన్నమాట.

రెండవ వలయములోని "అవ్యక్తము" అభివ్యక్తమైన తత్త్వము.

"అక్షరము" "అవ్యక్తము" కాదు.

ఇప్పుడొక ప్రశ్న సహజముగా ఉద్భవించును.

అక్షరము అవ్యక్త మెట్లయ్యెను ?

"అక్షరము" అవ్యక్తముగా ఎప్పుడును కాలేదు అనుటయే సూటియైన సమాధానము.

ఇట్టి సమస్యలను, లేక ప్రశ్నలను, లేక చిక్కులను పరిష్కరింపవలయు నన్నచో ప్రాతిభాసికములు, వాస్తవములు అయిన విషయములను ఉన్నవానిని ఉన్నట్లుగా గ్రహించి విచారించవలె.

ప్రసిద్ధమైన దృష్టాంతమగు "రజ్జుసర్పభ్రాంతి" లో భ్రాంతి నొందినవాడు యథార్థముగా సర్పమునే చూచుచున్నాడు కాని రజ్జువును చూచుట లేదు. విచారించిన తరువాతనే అతడు తాను చూచుచున్నది త్రాడునే కాని సర్పమును కాదని గ్రహించును.

భ్రాంతిచేగాని, పొరపాటుచేగాని త్రాడే సర్పముగా భావించబడుచున్నది. అనగా త్రాడే సర్పముగా కనబడుచున్నదన్నమాట.

ఇప్పుడు మన విషయమున వున్నది వున్నట్లుగా విచారించినచో రెండవ వలయములోని అవ్యక్తమే ఇప్పుడు "నేను" అని తెలిసికొనవలయును. అప్పుడు "నేను ఫలానా వాడను," "నేను చాలామందిలో ఒకడను", "ఇది నాది", "ఇది నాది కాదు" మొదలగు భావములు కల్గును. ఇప్పుడు ఒక్కమాటలో చెప్పవలెనన్నచో "నేను ఇది", "నేను ఇది" అని అనుకొనుటయే. ఇదియే రెండవ వలయములో సూచించిన "అవ్యక్తము."

పైన చెప్పిన రజ్జుసర్పభ్రాంతిలో, విచారించిన తర్వాతనే భ్రాంతిచే గాని, పొరపాటుచే గాని త్రాడు సర్పముగా తోచినదని తెలియుచున్నది.

మన విషయమున కూడా తాను తన స్వరూపమును గూర్చి విచారించిన మీదట అక్షరమునకు భిన్నముగాని "నేను" పొరపాటువలన లేక అనాదియైన అజ్ఞానమువలన "నేను ఇది", "నేను ఇది" అని తలంచడమైనది.

కాబట్టి అక్షరము అవ్యక్తము ఎట్లయినది అను ప్రశ్నయే పుట్టదు. ఎప్పుడును అక్షరము అవ్యక్తము కాలేదు. కావున యీ ప్రశ్నవేయుటకే వీలులేదు.

శాస్త్రీయమైన విచారణలో "తెలిసినదానినుండి" "తెలియనిదానిని" గ్రహించుటకు ముందుకు సాగిపోవలె. ఇచ్చట "నేను ఇది", "నేను ఇది" అని అనుకొనుట తెలిసిన విషయము.

"అక్షరము", "అవ్యక్తము" అను రెండును మనకు తెలిసిన విషయములని, అవి పరస్పరము స్వతంత్రములని మనము విచారణమును ఆరంభింపవలసి యున్నది. విచారణ చేసిన తర్వాత "అవ్యక్తము" "అక్షరము" కన్న అన్యము కాదని, "అక్షరము" అనగా "అవ్యక్తము" కాదని మనకు తెలియుచున్నది.

"అవ్యక్తమునకు" ప్రత్యేకమైన అస్తిత్వము లేనిచో దానికి ఈ క్రియాపరత్వము (క్రియాశీలము) ఎట్లు కలిగినది అనే ప్రశ్న రావచ్చును. విచక్షణజ్ఞానము ఉన్న అనాది అజ్ఞానముచే కప్పబడి సకల భూతములును జన్మించునప్పుడే "నేను ఇది", "నేను ఇది" అని తలంచుచుండును.

ఇదియే "మాయ."

ఈ చిక్కు విషయమును చక్కగా గ్రహించుటకు భగవద్గీతలో అయిదవ అధ్యాయము లోని 14, 15 శ్లోకములను, ఏడవ అధ్యాయములోని 13, 14, 27 శ్లోకములను ఆదిశంకరాచార్యులవారి భాష్యముతో చూడవలయును.

## వలయము 3.

భగవద్గీతలోని ఏడవ అధ్యాయములోని 4, 5, 6, 7 శ్లోకముల ననుసరించిన వలయము



↓

మహత్ సృష్టి

↓

అహంకారము

బుద్ధి

↓

మనస్సు

↓

పంచమహాభూతములు

ఉదాహరణము : అన్నము + విషము = విషము, విషము కలసిన అన్నమును విషమనియే అందురు కాని అన్నమని చెప్పరు.

ఆదికారణమైన అవ్యక్తము + వాసన, లేక అహంకారము = అహంకారము.

విషముతో కూడిన యన్నమును విషమనియే చెప్పినట్లు అహంకారముతో కూడిన అవ్యక్తము అహంకారమనియే చెప్పబడుచున్నది. ఈ అహంకారమే ప్రతి వ్యక్తియొక్క క్రియాశీలమునకు (activity కి) కారణము.

వాసన అనగా ఏమి ?

అనాదియైన అజ్ఞానము మూలముగా అహంకారము ఏర్పడుచున్నది. అహంకారము యొక్క అనభివ్యక్తము, నిగూఢములైన సంస్కారమే వాసన. అనగా తెలియకుండానే అనాదిగా పాతుకు పోయి "నేను ఇది", "నేను ఇది" అని ఎప్పుడు సాగిపోవుటయే "వాసన." ఇదియే "అహంకారము."

ఇంకా చెప్పవలయునన్న అహంకారము శరీరాదికమైన ప్రకృతితో తాదాత్మ్యమును పొంది, "నేను ఇది", "నేను ఇది" అని తలంచుచున్నది. కాని యథార్థముగా "నేను ఇది కాదు", "నేను ఇది కాదు" అని తెలుసుకొనవలెను.

ఆత్మజ్ఞానము చేతనే దీనిని గ్రహింపవలెను. ఆత్మజ్ఞానము సాధనచతుష్టయ సంపత్తి వలననే సాధ్యమగును.

అనాదియైన అజ్ఞానమునకు మొదలు లేదు. అది ఎప్పుడును, ఎచ్చటి నుండియు రాలేదు. అది ఉన్నది. అది ఉన్నట్లుగా కన్పడుచున్నది. వాస్తవముగా అది లేదు, కావున ఉన్న వస్తువు ఒక్క బ్రహ్మమే.

అదియే "ప్రజ్ఞానం బ్రహ్మ."

భగవద్గీతలోని ఎనిమిదవ అధ్యాయములో మూడవ శ్లోకమును బోధపరచుటకు సూచనలు.

వలయము 4.

వలయము 4 (ఎ)




వలయము 4 (బి)




పైన మొదట వలయములో పేర్కొనబడిన "పరమాత్మ", క్రింద రెండవ వలయములో నున్న అవ్యక్తములో "అహంకారము" గా నుండును. అదియే అంతరతమమైన ఆత్మగా అనగా ప్రత్యగాత్మగా ఉన్నది. ఇదియే "అధ్యాత్మము", లేక "స్వభావము" అని చెప్పబడుచున్నది.

జ్ఞానము కలిగినప్పుడు అనగా ఆత్మయొక్క సాక్షాత్కారము కలిగినప్పుడు అనగా "నేను ఇది కాదు", "ఇది కాదు" అని తెలిసికొన్నప్పుడు శరీరములో వున్న "నేను" అనగా రెండవ వలయములో ఉన్న అంతరతమమైన ఆత్మయే "నేను" (మొదటి వలయములోనున్న) పరమాత్మగా అచ్చముగా "అదియే" "ఇది" యని తెలియబడును, అనగా ఆ పరమాత్మమే 'నే' నని తెలియగలదు.

భగవద్గీతలో ఎనిమిదవ అధ్యాయములోని ఇరువదియవ శ్లోకమును బోధపరచుటకు సూచనలు.

వలయము 5 (ఎ)




ఓంకారము " పరబ్రహ్మమునకు " వ్యక్తీకరణముగా లేక సంకేతముగా లేక ప్రతీకగా భావింపబడుచున్నది. అనగా " ఓం " కార శబ్దము " పరబ్రహ్మము " అని భావించుట కొరకు, లేక " పరబ్రహ్మము " స్థానే సులభముగా ధ్యానము చేయుటకుగాను " ఓం " నే ఒక విగ్రహముగా భావించబడును.

వలయము 5 (బి)




పరబ్రహ్మమే అక్షరము. ( వలయము 5 (ఎ) లో సూచించినది )
" అవ్యక్తము ", " అక్షరము " భిన్నభిన్నములుగా కన్పడుచుండినను అవ్యక్తము అక్షరముకన్న అన్యము కాదు.

ఇట్టి యెడల ఈ అవ్యక్తము ఆ అక్షరముతో ఎట్లు సంబంధించి యున్నదను విషయమును గ్రహించుట చాలా కష్టము.

మంచి సంస్కారము, పురుషప్రయత్నము, సత్ప్రవర్తనము, శాస్త్రాచార్యోపదేశము ఉన్న కాని అక్షరమునకు, అవ్యక్తమునకు గల మాయా సంబంధము అనగా లేనిదే ఉన్నట్లు కనబడటము అర్థము కాదు.

ఇంకను విచారించుదము.

అవ్యక్తమునకు ప్రత్యేకమైన అస్తిత్వము లేదు. అయినప్పటికిని అవ్యక్తము సృష్టి కంతకును మూలకారణమై యున్నది.

వాస్తవమున సకల సృష్టికిని హేతువైన బ్రహ్మాండము ( Mundane egg ) లేక బీజము అవ్యక్తమే!

ఉదాహరణకు : ఇక్కడ వెండి కమండలువు ఉన్నది. కమండలము వెండితో చేయబడినది. అనగా వెండి "కమండలువు" గ అయినదన్నమాట. అయినచో వెండిలో ఏమైన మార్పు కలిగినదా? దానియందు ఏ మార్పు కలుగలేదు. వెండి ఎప్పుడును వెండియే. అయినచో కమండలువు ఏమిటి? కమండలువు వెండితప్ప మరేమియు కాదు.

వెండి కన్న భిన్నముగా కమండలువునకు అస్తిత్వమే లేదు. వెండియే ఎప్పుడును ఉన్నది. మొదట కమండలము లేదు. తుదియందు అనగా కమండలమును కరగించినప్పుడు కమండలము వుండదు.

మధ్యకాలమున అనగా కమండలమును ప్రత్యక్షముగా మనము చూచుచున్నప్పుడు కూడా అసలు వున్నది వెండిగాని కమండలము కాదు. అయితే కమండలము వున్నట్లుగానే కన్పించుచున్నది. కమండలము అనగా వెండి తప్ప మరొకటి కాదు.

కావున "వెండి" "కమండలము" అవునా కాదా అన్న ప్రశ్న రాగలదు.

"వెండి" "కమండలము కాదు." మొదట వున్నది "వెండి." కమండలము కరిగించిన తర్వాత వున్నది "వెండి."

కమండలమును చూచుచున్నప్పుడు వున్నది "వెండి."

కరగపెట్టినప్పుడు పోయినది "కమండలము" అని చెప్పుతాము. అంతే! వెండి లేకుండా ఎప్పుడైనను, పోనీ ఏదో కమండలమును చూచుచున్నప్పుడు అయినను కమండలమునకు వెండి లేకుండా ఉనికియే లేదాయె, ఉన్నట్లు కనపడటము తప్ప!

"వెండి" అచేతనమైనను ఒకప్పుడు "వెండి" వచ్చి "నేను కమండలమును" అని అనుకున్నచో సరికాదుగదా! ఎందువల్ల? "కమండలము" లేకుండా వెండి వున్నదాయె! కమండలము కరగపెట్టినప్పుడు కమండలము పోతే దానితో వెండి పోవటము లేదాయె! కరగపెట్టిన తర్వాతను వెండి వెండిగానే వుండునాయె! కనుక "వెండి" వచ్చి "నేను కమండలము" అని అనుకొనుట తప్పు, పొరపాటు. పైగా కమండలము పోతే "నేను పోయాను" అని వెండి అనుకున్నచో మరీ తప్పు, పొరపాటు కూడా!

కమండలమును కరగించిన తర్వాత ఆ వెండితో ఏదో పళ్లెము తయారుచేసినచో తిరిగి "ఆ పళ్లెము నేనే" అని వెండి తలంచిన లేక తాదాత్మ్యము చెందిన పొరపాటేకదా! ఇట్లు వెండి తలంచిన దీనిని భ్రాంతి అని చెప్పుదురు.

ఇట్లే "అవ్యక్తము" "అక్షరము" తప్ప మరేమియు కాదు.

వెండికన్న భిన్నముగా కమండలమునకు ప్రత్యేకముగా అస్తిత్వము లేక ఉనికి లేనట్లే, "అక్షరమునకు" భిన్నముగా "అవ్యక్తము" నకు ప్రత్యేకముగా అస్తిత్వముగాని, లేక ఉనికిగాని లేదు.

సృష్టికి మూలకారణమైన అవ్యక్తము అనాదియైన అజ్ఞానము వలన శరీరము (రూపము) తోను, పేరు (నామము) తోను, దారాపుత్రాదులతోను, స్థిర చరాస్తులతోను తాదాత్మ్యమును పొందుచున్నది.

భగవద్గీతలో పదిహేనవ అధ్యాయములోని 16, 18 శ్లోకములు గ్రహించుటకు కొన్ని సూచనలు.

జీవులందరును, తమ కర్మలయొక్క ఫలముల కొరకు కర్మఫలప్రదాతయైన ఈశ్వరునిపై ఆధారపడుచున్నారు. 'జ్ఞానులు' తమ జ్ఞానముయొక్క ఫలము కొఱకు ఈశ్వరునిపై ఆధారపడుచున్నారు.

భగవద్గీతలో ఏడవ అధ్యాయములోని పదునాఱవ శ్లోకమును పరిశీలింప దగును.

దయాశాలియైన పరబ్రహ్మము వాస్తవముగా శుద్ధము, అపరిమితము. అది క్షరములు (వినాశ్యములు), అక్షరములు (అవినాశ్యములు) అయిన ఉపాధు లన్నిటి కన్నను కేవలము విలక్షణము.

వెనుకటి అధ్యాయములలో, తర్వాత అధ్యాయములలో బోధింపబడిన దంతయు మూడు విభాగములుగా ఏర్పాటుపబడుచున్నది.

4)

వలయము 6.

భగవద్గీతలో 15-వ అధ్యాయములోని 16-వ శ్లోకము గూర్చి




పైన పేర్కొనబడిన క్షరము, అక్షరము అనువానికి కేవలము విలక్షణముగా పరమాత్మ", "పురుషోత్తముడు" ఉన్నాడు.

ఈ క్రింద చక్రమున అది వివరింపబడుచున్నది. భగవద్గీతలోని 15-వ అధ్యాయము లోని 17, 18 శ్లోకములకు వివరము

వలయము 7.

పరమాత్మ.
దయాశాలియైన ఈశ్వరుఁడు
పురుషోత్తముఁడు

**మూడవ విభాగము**

పరబ్రహ్మము — "ప్రజ్ఞానం బ్రహ్మ"
అవినాశ్యుడైన యీశ్వరుడు
పరమోన్నత చైతన్యము
శుద్ధము — అపరిమితము
నిత్యుడు, సర్వజ్ఞుడు, ఈశ్వరుడు
సత్యము, జ్ఞానము, అనంతము =
బ్రహ్మము.

సంసారమున రెండు విధములైన వేరువేరైన కూటములుగ జీవు లున్నారు. అద్వితీయచేతనుడైన పురుషునకు ఉపాధు లగుటచే ఈ జీవులను కూడ పురుషు లనియే పేర్కొనుచున్నారు.

అవినాశ్యుడైన ఈశ్వరుడు పరమాత్మ. తక్కిన సర్వభూతములు అవిద్యచేత రూపొందుచున్నవి. అవి జ్ఞానముచేత నశింపబడును.

ఓం శాంతిః

శ్రీ విమలానంద భారతీస్వాములవారు శిష్యులైన
చి. రామకృష్ణరావుగారి ఒకేరోజు 1-1-1945 తేదీన వ్రాసిన ఉత్తరములకు

## ఉపోద్ఘాతము

శాస్త్రములో చెప్పిన గురు, శిష్య సాంప్రదాయములను తూ చా యీకాలములో కూడ పాటించినది బ్రహ్మీభూతులు శ్రీ విమలానంద భారతీ స్వాములవారు, వీరి శిష్యులు శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారే అని చెప్పిన అతిశయోక్తి కాదు.

దాదాపు మూడు దశాబ్దములు 'శ్రోతుమ్ ఇచ్ఛా శుశ్రూషా' అని చెప్పినట్లు శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారు గురుసేవ చేసిరి. దైవ వశమున వా రుభయులు వేరు వేరు ప్రదేశములో వుండుట తటస్థించినచో ప్రతిదినము ఇరువురి మధ్య ఉత్తర ప్రత్యుత్తరములు జరుగవలసినదే! జరిగినది కూడా!

ఆత్మోపదేశము అయిన తర్వాత కూడా "ఆవృత్తి రసకృత్ ఉపదేశాత్" అని చెప్పినట్లు ఉత్తర ప్రత్యుత్తరములలో కూడ ఆరూఢస్థితిలో వున్న సద్గురువులు శిష్యులను ఉత్తీర్ణులను చేయుటకు ప్రబోధము చేయుటయే జరిగినది.

ఎట్లుగా యీ క్రమము జరిగినదో ఉదాహరణకు: శ్రీ విమలానంద భారతీ స్వాములవారు శిష్యులు శ్రీ త్రివిక్రమ రామానందభారతీస్వాములవారికి (వీరి పూర్వాశ్రమములో శ్రీ చిట్టూరి రామకృష్ణరావు, M. A., LL. B., Advocate, మచిలీపట్నం) 1-1-1945 ననే వ్రాసిన రెండు ఉత్తరములు యిందు ప్రచురింపబడుచున్నవి.

1-1-1945 తేదీన కుర్తాళము నుండి మొదట ఉత్తరము వ్రాసిరి. ఇందులో—

"కావున ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వచ్చివేయుము" అని వ్రాసిరి.

ఆ వెంటనే తమ శిష్యునియొక్క భక్తి ప్రపత్తులు తెలియును గనుక అనగా వెంటనే బందరునుండి వచ్చివేయునన్న అభిప్రాయముతో యీ ఉత్తరమును పోస్టు చేయుట మానివేసి, ఆ 1-1-1945 తేదీననే చాలా భాగము ఆ అంశములనే విస్తరింపజేసి—

"కావున ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వచ్చివేయుము" అన్న వాక్యము లేకుండా ఉత్తరము వ్రాసి శిష్యునకు బందరు పోస్టు చేసిరి.

ఆ తర్వాత కొన్ని రోజులకు ఉభయులు కలసినప్పుడు మొదట వ్రాసిన ఉత్తరము శ్రీ విమలానంద భారతీ స్వాములవారు తమ ప్రియశిష్యునిపై వున్న వాత్సల్యమును తెలియ చెప్పి, ఆ మొదట వ్రాసిన ఉత్తరము అందచేసిరి.

శిష్యులు శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారు యీ రెండు ఉత్తరములను గొప్ప పెన్నిధివలె దాచిపెట్టుకొని శ్రీవారి స్వదస్తూరితో వున్న ఆ ఉత్తరములకు ఫొటోలు తీయించి, బ్లాకులు తయారుచేసి చూచుకుని ఆనందపడుచున్నారు.

జిజ్ఞాసువులకు ఉపయోగార్థము శ్రీవారి దస్తూరితో వున్న ఉత్తరములను సులభముగా చదువుకొనుటకు వీలుగా వేరే అచ్చులోను ప్రచురించుచున్నాము. ఇంకా ఉత్తరముల గూర్చి వ్యాఖ్యానము అవసరములేదు. చదువరులే గ్రహించగలరు.

His Holiness
Sri Paramahamsa Parivrajakacharya
SRI VIMALANANDHA BHARATHI SWAMIGAL
SIDDHESWARI PEETADHIPATHI



Dattatreya Mandiram
COURTALLAM
Tenkasi Taluk
11-1-945
౧౮-౧౦-౬౬

అస్మదత్యంతప్రియశిష్యులకు, చి. రామకృష్ణరావునకు, నారాయణ స్మృతులు.

త. నీవు 29-వ తేదీని బెజవాడనుండి వ్రాసిన ఉత్తర మందినది. శ్రీ పొన్నాడ రామకోటియ్యగారు కొలది కాలములో రాక పోయినయెడల నీకు వ్రాసెదను. వారికి నీవు కూడా వ్రాసి వారిని పంపవలయును.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారికి అట్లే ఉత్తరము వ్రాసెదను. బెజవాడ, గుంటూరు లలో మనవాండ్రను కలిసికొనినది మంచిదియే.

శ్రీపతి లక్ష్మీపతిగారికిని అట్లే ఉత్తరము వ్రాసెదను. శ్రీ శీతంరాజు సుబ్బారావు వద్దనుండి నా కింకేమీ ఉత్తరం రాలేదు. నీవు బందరులో మనవాండ్రందఱిని కలుసుకొని నీవు వ్రాయు ఉత్తరమునకు ఎదురుచూచుచున్నాను.

నా కిక్కడ ఏమి లోపముగా నున్నను నీకు వెంటనే వ్రాసెదను.

నేను చేరవలసిన స్థానము చేరిన తర్వాతనే కదా మీరందరు నా వద్దకు (ఆ స్థానమునకు) వచ్చినది. తరువాత నే చేరు స్థానములు నా స్థానములు కావే! నష్టజాతకము గుణించుకొనుటలో నాయంతవాడు లేడు గనుక హాయిగా నున్నాను! అది ఎవరి చేతనైతే వారికి హాయి! గురు శిష్య సాంప్రదాయమునుగూర్చి మొదట, చివరకు గూడ అడిగినది నీవే అని సమయము వచ్చినప్పుడెల్ల నందఱితో నేను చెప్పుచున్నది నీవు మాత్ర మెఱుగవా? నా సాన్నిధ్యము నీ కెప్పటికిని కలిగియే యున్నది. నాలో మార్పులు వచ్చుచున్నప్పుడు నేను ఎట్లు స్వీకరింతునో నీకే కాదు జనుల కందఱకు తెలియునుగదా బందరులో! ఇక ముందు వచ్చు మార్పులను అట్లే గదా చూతును! మీరు కూడా అట్లే చూచికొనుచుండవలయును అని చెప్పుచున్నాను. ఎట్టి మార్పు లేకపోయినపుడే కదా మీరందఱు నా వద్దకు వచ్చినది! నేను ఆశ్రమము పుచ్చుకొనకపూర్వము వచ్చినవారే నిజముగ ముముక్షువులని నేను చెప్పుచుండుట లేదా!

"నాయం దెట్టి మార్పు లేదు, ఉండదు" అని ఈశ్వరియే నీకు ఋజువు చేయగలదు. ఈ వాక్యము మరవకుము. పురుషోత్తమశాస్త్రి, నరసింహం మొదలగువారలకు గూడ చెప్పి యుంచుము.

చి. రామకృష్ణరావు, రామారావు, సాంబశివరావుల క్షేమము తెలియచేయుము. మీ నాన్నగారు కులాసాగా ఉన్నారని తలచెదను.

నీకు పరమేశ్వరుడు ఒప్పగించిన చిన్నవాళ్ళ, పెద్దవాళ్ల క్షేమము చూచుచూ ఎప్పుడు వీలయిన నప్పుడే నా వద్దకు వచ్చి వేయుము. నీకు మాత్రము సంగము కలదని నే నందునా? లోకము ననుసరించి ఉండవలయును గనుక ఉంటున్నాము. అంతే. ఈ శరీరము నమ్ముకొని ఎవరిని గాని నా యెడల అసంతృప్తులను చేయు మందబుద్ధిని కానని నీవెఱుగుదువుకదా! నీవు M. A., B. L. pass అయినది నాలో మార్పు కలుగచేసినది కాని మఱియేమియు అట్లు చేయలేదే! ఆపయిన సంపాదించుచుండగా నీవు నాకు వచ్చిన ఘనత దేనిచేతను రాదే! అదంతయు దేవునికి తెలియును. నీకు తెలియును, నాకు తెలియును. కావున ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వచ్చివేయుము.

ఇవియే నారాయణ స్మృతులు

విమలానందభారతీస్వామి

His Holiness
Sri Paramahamsa Parivrajakacharya
SRI VIMALANANDHA BHARATHI SWAMIGAL
SIDDHESWARI PEETHADHIPATHI



Dattatreya Mandiram
COURTALLAM
Tenkasi Taluk
1-1-1945

అస్మదత్యంత ప్రియశిష్యులు చి. రామకృష్ణరావునకు
నారాయణ స్మృతులు

నీవు 29-వ తేదీన బెజవాడ నుండి వ్రాసిన ఉత్తరము అందినది. శ్రీ కొండా కోటయ్యగారివద్దనుండియు నీవు వారిని కలుసుకొనినట్లు తెలిసినది.

శ్రీ కొండా కోటయ్యగా రిచ్చుట లేకపోయినను శ్రీ పొన్నాడ రామకోటిగారికి అన్ని సౌకర్యములు జరుగగలవని చెప్పి వారిని వెంటనే యిచ్చుటకి వచ్చుటకు తిరిగి ఒక ఉత్తరము నీవే బందరు నుండి వ్రాయుము.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారికి నీవు వ్రాసినట్లు ఉత్తరము వ్రాసెదను. ఆయన యిక్కడకు వచ్చిన యెడల యిక చెప్పవలసిన దేమి ?

బెజవాడ, గుంటూరులలో నీవు మనవాళ్ల నందరిని కలుసుకొని విశదముగా సంగతులు ముచ్చటించుట మంచిదే.

నీవు సూచించినట్లు శ్రీపతి లక్ష్మీపతికిని ఉత్తరము వ్రాసెదను.

శీతంరాజు సుబ్బారావు వద్దనుండి ఉత్తరము నాకేమియు రాలేదు.

నీవు బందరులో మనవాళ్లందరిని కలిసికొని నీవు వ్రాయు ఉత్తరమునకు ఎదురు చూచు చున్నాను.

నా కిక్కడ ఏమి లోపము జరిగినను నీకు తప్ప ఇంకెవరికి వ్రాసి నివారించుకోగలనో నీవే చెప్పుము. కాకపోతే ఒక్క దేవితో తప్ప.

చిర్రావూరు సీతారామాంజనేయులు పోయినాడట అని వ్రాసినావు. ఇంటిపేరు తబ్దీలయినదో చూడు.

నేను చేరవలసిన స్థానము ఇప్పుడు చేరితి ననుచున్నావేమి? నేను చేరవలసిన స్థానము చేరిన తర్వాత కాదా మీరందరు నా వద్దకు ( ఆ స్థానమునకు ) వచ్చినది? నష్ట జాతకము గుణించుటలో నాయంత వాడు లేడు గనుకనే నేను హాయిగ నున్నానని నీతో పలుమారు చెప్పియుంటిని. జ్ఞాపక ముంచుకొనుము.

గురు శిష్య సాంప్రదాయము గూర్చి అడిగినది నీ వొక్కడవే నని నీతోనే కాదు, ఇతరులతో గూడ నేను సమయము వచ్చినప్పుడు చెప్పుచున్నది నీ వెఱుగవా ! నా సాన్నిధ్యము నీకు నెప్పటికిని కలిగియే యున్నదని గుర్తింపుము. నాలో మార్పులు వచ్చు చున్నవని వ్రాసితివి. మార్పులు నేనైనచో ఇక నేనేమి గురువు, నీవేమి శిష్యుడవు ?

జీవులను తరింపజేయుటకు పీఠాధిపతులు కావలెనా? అయినచో మీరందరు ఎట్టి పీఠాధిపత్యము రానప్పుడే వచ్చిరి. నేను ఎన్నిసార్లు చెప్పియున్నాను, జ్ఞాపకములేదా? నేను ఆశ్రమము పుచ్చుకొనక పూర్వము వచ్చినవారే నిజముగా ముముక్షువులు అని!

ఇది యేదో పదవి అని నేను కుతూహలపడి మారినాను అని నీవుగాని, ఇతరులుగాని అనుకొనుట, ఆయనకు బాగా జరుగుచున్నది. ఆ శిష్యులు, ఆ రామకృష్ణరావు మొదలైన వారు వున్నారుకదా! ఆ రామకృష్ణరావు ఉండగా ఆయనకేమి అని ఇతరులు నాయందు ఏ మార్పునో కాంచిన ట్లనుకొనునట్టిది కాదా? నాయందెట్టి మార్పులేదు. ఉండదు అని ఈశ్వరియే మీకు ఋజువు చేయగలదు. ఈ వాక్యము ఎప్పుడు మరవకుండా మనవాండ్రందరకు— పురుషోత్తమశాస్త్రి, నరసింహము మొదలగువారలకు చెప్పవలయును.

ఇక నేమి వ్రాయను? రామకృష్ణాదుల క్షేమము వ్రాయుము. ఇది నా కడపటి మార్పు అని అనుకొనుచున్నావు. కాని ఇంక ఎన్ని మార్పులు రాగలవో దేవున కెఱుక! నాకును ఎఱుకయే. సర్వ మనిత్యము ధ్రువమని తెలిసిన ప్రతివానికిని ఎఱుకయే. మీ నాన్నగారి క్షేమము వ్రాయుము.

మొట్టమొదట నేను ఆశ్రమము తీసుకొనబోవునప్పుడు నీవు కూడా ఆశ్రమము తీసికొందునని చెప్పినప్పుడు నేను: "ఇద్దఱు తీసికొనిన బూడిదరాలును. ఒకరు గృహస్థుగా సంపాదించుచుండవలయును, ఒకరు సన్యసించిన" అని చెప్పినది ఇప్పటికిని నా స్థితి[illegible]ట్లే ఉ[illegible]ది. ఇది నీకు విశదముగా చెప్పినాను. మొన్న నీ విక్కడ యున్నప్పుడు నీవు స[illegible]న [illegible]ప్పుడు మానగలవో నేను చెప్పెదననియు, అందాక నా తరఫున నీవు పని చేయుచు, చిన్నవాళ్ల క్షేమము చూచుచు, ఉత్సాహముతో, వచ్చుచు పోవుచు నుండ వలయు ననియు చెప్పితిని. తర్వాత ఇద్దర[illegible] కలసి యిక్కడనే ఉందుమో చూచుకొందము అని తిరిగి చెప్పుచున్నాను. ఇప్పుడు వచ్చిన మార్పేమి? కొంచెము దూరమన్న మాట తప్ప సంవత్సరమునకు 40 రూ. మనవి కావు అనుకుంటే ఊడిపడవచ్చునే యిక్కడికి. తర్వాత నేను యిక్కడ ఉండుటే నిశ్చయమైనను ఎప్పుడు పడితే అప్పుడు నేను రాగలనే! అట్టి స్వతంత్రము నాకు లేనిచో విష్ణు చెప్పినట్లు, imprisonment ఇది.

నా ప్రకృతి నీ వెఱుగవా?

కావున హాయిగా నుండి నేను నీ యా గదిలో నున్నప్పుడు ఎట్లా office కు వెళ్లుట, court కు వెళ్లుట జరుగుచున్నదో అట్లే జరుగవలయును. కొంచె మీ గది దూరము. ఇంత యేల, నా భావ మిప్పటికి ఏమీ మారలేదు. అందుకనే రాజును ఆశ్రమము సంపూర్తి చేయమని చెప్పితిమిగదా!

ఇవియే నారాయణ స్మృతులు

విమలానంద భారతీస్వామి